శ్రీ

శివాయగురవేనమః

# మతవినోదచర్చ.



మహామహోపాధ్యాయ

బ్ర॥ శ్రీ, ముదిగొండ నాగలింగశాస్త్రిలవారిచే

రచింపఁబడినది.



కైటిల్ ప్రెస్

తెనాలి, ఆంధ్రముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1931

కాపీరైటు రిజిష్టరుడు] [వెల రు. 1-8-0.

శివాయగురవేనమః

# మతవినోదచర్చ

---:o:---

విజయవాటిక — కృష్ణవేణీతీరము.

పండితారాధ్యుల బడబానల శరభసాళువారాధ్యులవారు
ప్రతివాది భయంకరం- గండభేరుండ నృసింహాచార్య స్వాములవారు.
అన్నంభొట్ల శివరామకృష్ణ భట్టాచార్యులవారు. ఈమువ్వురు ఏటిలోస్నానముచేసి

పండి— శివ శివ శివ మహాదేవ మహాదేవ

ప్రతి— శ్రీమతే రామానుజాయనమః

అన్నం— శివరామగోవింద నారాయణమహాదేవ

అనుచు నదియొడ్డున ననుష్ఠానమునకై కూర్చుండిరి.

అన్నం-ఆరాధ్యులవారూ? తమరెచ్చటనుంచి దయచేయుచున్నారండీ?

పండి— అయ్యా! మేము శ్రీశైలయాత్రచేసికొని వచ్చుచున్నాము.

అన్నం— ఆచార్యులవారూ! తమరెచ్చటనుంచి వేంచేయుచున్నారు ?

ప్రతి— శ్రీరంగయాత్ర సేవించుకొని చేరితిమి సరే. భట్టాచార్యుల వారూ! తమరెందుండి వచ్చితిరి ?

అన్నం— జగన్నాథయాత్రగావించి వచ్చుచున్నాము.
(తనలో వీరిర్వురకు కలహముపెట్టినబాగుండును.) ప్రకాశముగా ఆచార్యులవారూ ఏమి? ఈసుదినము శైవవైష్ణవ పండితు లుభయులు నిప్పుడిచ్చట సమావేశమైతిరి. ఆచార్యులవారూ? ఈనడుమ విశిష్టాద్వైత సిద్ధాంతసంగ్రహమను గ్రంథమును జూడఁగా దానియందు శివపరాత్పరత్వఖండనము బహుచమత్కారముగా నున్నదిసుడీ.

ప్రతి— అవును అది చాలాసప్రమాణముగా నున్నది.

పండి— భట్టాచార్యులవారూ ఏమది ? శివపరాత్పరత్వఖండనమా ? ఎందున్నది? ఎవరుచేసిరి?

అన్నం— విశిష్టాద్వైత సిద్ధాంత సంగ్రహమునందు
(అని చెప్పఁబూనునంతలో)

ప్రతి— ఏగ్రంథమునందో ఎవ్వరో చేసిరని చెప్పనేల? సమర్థులగువారుండినచో నిప్పుడు మేముచేయుదుము.

పండి— అట్లేని ఏమును సంసిద్ధులమే కాని మనకుమధ్యస్థులెవ్వరు ?

ప్రతి— భట్టాచార్యులవారులేరా ?

పండి— వీరు మాధ్యస్థ్యమున కంగీకరింతురా ?

అన్నం— మీర లెడ యెడముగాగూర్చుండి స్వప్రమాణములగు సరస వచనములతోఁ జర్చించునెడ భారమేమి? అట్లే అంగీకరింతును.

( తనలో నాయత్నము సఫలమైనది. )

మీరిప్పుడు డేయంశమునుగూర్చి చర్చింతురు ?

ప్రతి— పరత్వముగూర్చియే.

అన్నం— అది సులభోపాయమున దేలునా ?

పండి— త్వరలో దేలకున్న కొంచెముతడవుగాఁ దేలకుండునా ?

ప్రతి— మాసిద్ధాంతమును ప్రచారముచేయుటకన్న నావశ్యకకృత్యము మాకు వేరుగాలేదు.

పండి— మాకును నంతియేయని యెంచుడు.

అన్నం— (తనలో) తీసిపోవువారు కనపడలేదు సొగసుగానె యున్నది. ప్రకాశముగా ఆచార్యులవారూ? నారాయణపరత్వమునెడ ప్రబలమగు హేతువు సెలవిత్తురా ?

ప్రతి:— వేరేమికావలయు? శివుఁడు పరమభాగవతుఁడు

శ్లో॥ శ్రీవిష్ణుపాద జలజోద్భవ మంబుమూర్ధ్ని
శ్రీరామనామమహితం సతతంముఖాబ్జే
శ్రీనాథ శేషశయనంచ సదోద్వహన్తం
తంశంకరం పరమభాగవతంస్మరామి ॥

అని పెద్దలు చెప్పియున్నారు. దీనింబట్టి శివుఁడు విష్ణుభక్తుఁడని స్పష్టమగుచున్నది కాదా ?

అన్నం— ఆరాధ్యులవారూ ? వినుచున్నారుగాదా? ఈవిషయమున మీరేమిచెప్పెదురు?



పండి— వినుచునేయున్నాను. కాని వీరు నిజమును తలక్రిందుచేసినారు.

నారాయణమూర్తియే పరమపాశుపతుఁడు శివభక్తాగ్రగణ్యుడు కావుననే,

శ్లో॥ లింగం శివం శిరసి బిల్వదళం శిఖాయాం
రుద్రాక్షహారమురసీశ్వరనామవక్త్రే
సర్వాంగకేషుభసితం నియతందధానం
నారాయణం పరమపాశుపతంస్మరామి ॥

అని పెద్దలు సెలవిచ్చిరి. దీనికేమిచెప్పెదురు ?

అన్నం—— బలె-బలే శివుడు విష్ణుభక్తుఁడని వైష్ణవులును విష్ణువు శివభక్తుడని శైవులునుచెప్పుచున్నారు కావునరెండునిజమే. వృథా కలహమెందుకు ? ఇద్దరుసమానులనియో ? ఒక్కడేఅనియో ఒప్పుకొనిననేమి ?

ప్రీతి—— రామాయణ కాలక్షేపమున పిడకలకొట్లాటవలె నట్టనడుమ మీసిద్ధాంతము తెచ్చిపెట్టఁకుడు? ప్రస్తుతచర్చ జరగనిండు.

అన్నం—— అట్లేని మీకుమీకుగల ప్రమాణములను కనఁబరచుడు.

పండి—— విష్ణుమూర్తి శివునిగూర్చి తపము చేసినట్లు వేయిచోట్లకలదు. నారాయణమూర్తి ప్రతిదినము సహస్రకమలములతో శివునారాధించుచు నొక్కనాడొక్కకమలము తక్కువకాగా తన నేత్రకమలమును దీసిపూజింప నీశ్వరుఁడుమెచ్చి కమలములతో తుల్యములగు నేత్రములను చక్రముగూడనిచ్చుట ప్రసిద్ధము కాదా? దీనింబట్టి విష్ణుమూర్తి శివభక్తుఁడని స్పష్టపడుటలేదా ?

ప్రీతి—— శివుడు నారాయణమూర్తినిగూర్చి తపముచేసినట్లును లక్ష చోట్లకలదు. శివుడు ప్రతిదినము వేయిసంపెంగపూలతో నారాయణమూర్తి నర్చించుచుండ నొక్కనాడొక్క పూవు తక్కువపడగా శివుడు తనముక్కునుగోసి పూజింప నారాయణ మూర్తి ప్రసన్నుండై సంపెంగపూవుం బోలుముక్కును త్రిశూలమును నిచ్చినట్లు వరాహపురాణమున నున్నది. దీనింబట్టి శివుఁడు విష్ణుభక్తుడని తేటబడుటలేదా ?

మీరుచెప్పిన రెండుపద్ధతులును కొరవిబెట్టి తల గోకికొనినట్లు బాగానేయున్నవి.

అన్నం— ఇందు మీరొక్కసంగతి యాలోచింపవలయు. ఏమనిన శివపురాణములు మీసిద్ధాంతమునకు ననుకూలింపనికారణమున నవి తామసములని మీపెద్దలు వానిని వదలియుండవచ్చును. కాని విష్ణుపురాణములలో విష్ణునుత్కర్ష ముండుట సహజము. అవిమాత్రమే ప్రమాణమనుకొనువారు చర్చాపద్ధతిలోనికి రాకూడదు. తమలోతాముమాత్రము సంతసపడవలసినదియే. ఇదిగాక మేముచెప్పిన నియమములు నంగీకరించి సిద్ధాంతము చేయుదమని యాచార్యులవారు ఒప్పుకొనుచున్నారు. మీరే మందురు? రెంటిలో విష్ణుపురాణములుమాత్రము ప్రమాణ మనువారి సిద్ధాంతము బలవత్తరమా? రెంటిని నంగీకరించిన వారి సిద్ధాంతము బలవత్తరమా? మీరే సెలవిండు.

ప్రతి— రెంటిని ప్రమాణముగా నంగీకరించినవారిసిద్ధాంతమే ఎక్కువ ప్రమాణములుగలదిగాన బలవత్తరముగా కనఁబడును. కాని అట్లు సిద్ధాంతముసేయ నశక్యము.

అన్నం—శక్యమైనచో నాసిద్ధాంతము ప్రబలమేయని యంగీకరింతురా?

ప్రతి— అదియెట్లో చూచిగాని చెప్పఁజాలము.

అన్నం— రెండును ప్రమాణములని యంగీకరించి సిద్ధాంతము సేయు డందుమా? రెంటిని వదలిపెట్టి యితర ప్రమాణములతో సిద్ధాంతముసేయుడని యాచార్యులవారి నడుగుదుమా ?

ప్రతి— వాదమునకై కొంచెముసేపు రెంటిని ప్రమాణమనియే యంగీకరింతుము. రెంటిని ప్రమాణముగా సంగీకరించి వారెట్లు సమన్వయముచేతురో చెప్పుమనుడు.

అన్నం— [illegible] ?

పండి—శైవ వైష్ణవపురాణములకు విరోధమునంగీకరించి సమన్వయము సేయుమందురా? విరోధము లేదనియే సమన్వయము సేయుమందురా ?

అన్నం— ఇందు ధనవ్యయమేమికలదు? రెండువిధములను మీాసిద్ధాంతమున సమన్వయము చేయుడు.

పండి— సావధానముగావినుడు. శైవ వైష్ణవపురాణములకు విరోధము లేదనుటయే యథార్థము. అయినను కొందఱు శైవ వైష్ణవపురాణములకు విరోధముకలదని యనుచున్నారుగాన ఆపక్షమున నిట్లు సమన్వయము చేసిరి.

అన్నం— ఎట్లు ?

పండి— పదునెనిమిది పురాణములయందును శైవపురాణములు పది యనియు వైష్ణవపురాణములు నాలుగనియు చెప్పబడియున్నది. పది శైవపురాణములలో శివపురాణము లక్ష గ్రంథసంఖ్యయు స్కాందపురాణము లక్ష గ్రంథసంఖ్యయు గలిగియున్నవని ప్రసిద్ధిగలదు. పదునెనిమిది పురాణములు చేరిన మొత్తము నాలుగు లక్షల గ్రంథసంఖ్యలో శైవస్కాందములు రెండు సగము గ్రంథముగదా? కడమయెనిమిది శివపురాణములకు సంఖ్యయెంత యుండునో గమనింపుడు. ఇట్లే సౌరాదిపురాణము నాలుగింటికి కొంతవిభాగించుడు. ఇఁక విష్ణుపురాణములు నాలుగింటికి గ్రంథసంఖ్య యెంతయుండునో యూహింపుడు. దీనింబట్టి విష్ణుపురాణముల గ్రంథసంఖ్య కంటెశివపురాణముల గ్రంథసంఖ్య యెన్నియోమడంగు లెక్కుడని స్పష్టమగుచున్నదికదా? ఇఁక నీరెంటికి విరోధమున్నదనుపక్షమున ప్రామాణ్యము దేనికుండునో నిర్ణయించుకొనవలయు. ఇట్టిసందర్భమున సూ॥ విప్రతిషేధేభూయసాం స్యాత్స్వధర్మత్వం॥ విరోధమువచ్చినప్పుడు ఎక్కు [illegible] శైవ [illegible] యించెను.

దీనింబట్టి శివపురాణములయందు విష్ణువు శివభక్తుడనుదానికి విరుద్ధముగా విష్ణుపురాణములయందు శివుడెవిష్ణుభక్తుడని చెప్పినది ప్రమాణముకాదని తేలినది. కాదా ?

అన్నం— ఇదియా కారణము. విష్ణుపురాణములలోని శివపురాణ విరుద్ధాంశములకు జైమిని న్యాయముచే నప్రామాణ్యము ప్రాపింపఁగా శివపురాణములకు తామసత్వము కల్పించి యవి అసలే ప్రమాణములు కావని త్రోసివేసినట్లు కనఁబడుచున్నది.

పండి— ఇందు న్యాయమేదియో నిర్ణయింపుడు.

అన్నం— జైమినిన్యాయము కాదన నెవ్వరితరము? ఆచార్యులవారూ ఇచ్చట మీరేమిచెప్పెదురు?

ప్రతి— ప్రమాణములైన వచనములకు పూర్వాపర విరోధము వచ్చినప్పుడు జైమినీ యన్యాయము ప్రవర్తించుగాని తామసములుగాన కేవల మప్రమాణములైన శివపురాణముల విషయమున నాన్యాయమెట్లు ప్రవర్తించును?

అన్నం— మీ సిద్ధాంతమున నంతియె యగుగాక. ఇందొక్కన్యాయమాలోచింపవలయును. జైమినీయ న్యాయము నిర్వివాదముగా సర్వ జనాంగీకారము నొందియున్నట్లు శివపురాణ తామసత్వము సర్వజనాంగీకారము నొందినదికాదు. ఇదిగాక ఎక్కువ వచనములకు విరోధించినందున తక్కువ వచనములకు నప్రామాణ్యము నంగీకరించినను ఎక్కువ వచనములకు ప్రామాణ్యము నంగీకరింపనందున శైవుల సిద్ధాంతమునకు నెక్కువ ప్రామాణ్యంబును, ఎక్కువ గ్రంథసంఖ్యగల శివపురాణములకే యప్రామాణ్యము నొప్పి తక్కువ గ్రంథసంఖ్యగల విష్ణు పురాణ వచనములకే ప్రామాణ్యము నంగీకరించిన మీ సిద్ధాంతమునకు ప్రామాణ్యము తక్కువయగుట యని [illegible] ఏర్పడుట లేదా?

ప్రతి—ప్రమాణముకాని నిస్సారవచనము లెన్ని లక్షలుండిన నేమిలాభమండీ?

పండి—ఇందొక్క సంగతి నాలింపుడు. శ్లో॥ పురాణ మేక మేవా సీచ్ఛతకోటి ప్రవిస్తరం॥ కృతయుగమునందు పురాణకాండము నూరు కోట్ల గ్రంథసంఖ్యగలిగి యుండెనని చెప్పి, అద్దానిని, కలియుగాదిని నాలుగు లక్షలగ్రంథముగా సంగ్రహించునపుడు వేదవ్యాసులవారు ఈనాలుగులక్షల గ్రంథములో మూడుపాళ్ళు నిస్సారమగు నప్రామాణ్యగ్రంథమును పొందుపరచిరనుట యెంతసారవంతముగా నున్నదో యోజింపుడు.

ప్రతి—ఎందైనను సారమే స్వల్పంబుగను, అసారమే అధికము గానుంట సాధారణమే.

పండి—సారమే స్వల్పముగాను, అసారమే అధికముగాను నుండవచ్చును. కాని, ప్రమాణగ్రంథము స్వల్పంబును, తద్విరుద్ధమగు నప్రమాణగ్రంథమె అధికంబుగానున్నదనుట సమంజసమగునా?

అన్నం—అట్లుండుటసమంజసము కాదని జైమినీయ న్యాయము చేతనె ధ్రువపడియెను. అంతకన్న నెక్కువ మీరేమిచెప్పఁగలరు?

పండి—ఈయాథార్థ్యము నాచార్యులవారంగీకరించినారా?

అన్నం—వారంతిమాత్రమున నె యంగీకరించిన నిన్ని మతభేదము లీదేశమున పీటలు పెట్టుకొని కూర్చుండునా?

ప్రతి—ఆజైమినిన్యాయమిట్టిచోట్ల యుపయోగింపదని చెప్పి తినికాదండీ.

అన్నం—అంతకన్న మీరేమిచెప్పెదురు? మీరెట్లును సంగీకరింపరనియేకదా చెప్పచున్నాను. ఉండనిండు. ఆరాధ్యులవారూ? శైవవైష్ణవ పురాణములకు పరస్పర విరోధము లేదనుటయె యథార్థమంటిరి. అది యెట్లో నిరూపించుడు.

పండి—ఇదిచాల పెద్దసంగతి. ఎట్లనిన, వైష్ణవులు త్రిమూర్తులలో చేరినవిష్ణువే పరతత్త్వమని యంగీకరించిరి. కాని శైవులయిననో

త్రిమూర్తులలోఁ జేరిన రుద్రుఁడుగాక, త్రిమూర్తులకుఁగారణుఁడై త్రిమూర్తులకు నతీతుఁడైన శివుని పరతత్త్వముగా నంగీకరించిరి.

అన్నం—నారాయణమూర్తియు త్రిమూర్తులకు నతీతుఁడేయని యేల యంగీకరింపరాదు?

పండి—అట్లు మీ రంగీకరింపవలయునేగాని వైష్ణవు లంగీకరింపరు.

అన్నం—ఆచార్యులవారూ? నారాయణమూర్తి త్రిమూర్తుల కంటె నతీతుఁడని మీరంగీకరింపరా?

ప్రతి—నారాయణమూర్తి త్రిమూర్తులలో పరాత్పరుఁడు. ఆయనకన్న పరతత్త్వము లేనేలేదు.

అన్నం—మే మొక్కటియడిగిన మీరలింకొక్కటి చెప్పుచున్నారేమి? నారాయణమూర్తి త్రిమూర్తులకంటె నతీతుఁడా? త్రిమూర్తులలోఁ జేరినవాఁడా?

ప్రతి—నారాయణమూర్తి త్రిమూర్తులలో నతీతుఁడు. త్రిమూర్తులకంటె పరమైన తత్త్వము లేనేలేదు.

అన్నం—త్రిమూర్తులకంటె నతీతము నిర్గుణమే. కాని సగుణమున్నట్లు తోపదు.

ప్రతి-త్రిమూర్తులకంటె తత్త్వము లేనేలేదని మేముఁ చెప్పుచున్నాము నిర్గుణము మాత్రమున్నదని మీరు చెప్పుచున్నారు. కొజ్జా మగడింట నున్ననేమి? దండుననున్ననేమి యన్నట్లు నిర్గుణమున్ననొక్కటె లేకున్న నొక్కటె కాన, ఈయెడ మనయిర్వుర సిద్ధాంతము నొక్కటేయా యెను.

అన్నం—త్రిమూర్తులకంటె నతీతమగు సగుణతత్త్వమున్నదగు నెడ ప్రమాణమున్నది లేనిదియు పదంపడి విచారింతము. ఆరాధ్యుల వారూ? మీరుచెప్పినట్లు శివుని త్రిమూర్త్యతీతునిగా నంగీకరించినందున శైవసిద్ధాంతమున సర్వపురాణ సమన్వయ మెట్లు కుదురును ?

పండి—ఎట్లుకుదురునో సావధానముగా నాలింపుడు. త్రిమూర్తులకంటె నతీతుఁడు పరమేశ్వరుఁడు. పరమేశ్వరునంశములే త్రిమూర్తులు. గాన పురాణములకు పరస్పర విరోధముండ నేరదు. ఏలన, కొన్నిపురాణములయందు విష్ణునుత్కర్షంబును, మఱికొన్నిటియందు రుద్రునుత్కర్షంబును, ఇంకఁగొన్నిటియందు బ్రహ్మదేవునుత్కర్షంబును గలదు. ఈయుత్కర్షమంతయు ముగ్గురకు మూలభూతుఁడగు పరమేశ్వరునిదే. మూలభూతుఁడగు నారాయణునిగుణజాతమంతయు నద్దేవు నంశములగు రామకృష్ణాద్యవతారములయందు నారోపించి స్తోత్రము చేయఁబడుటచే అంశియొక్కగుణములు అంశము నందారోపించుట స్వాభావికము. రామకృష్ణాద్యవతారములనుగూర్చి చేయఁబడు స్తోత్రమంతయు వారికి మూలభూతుఁడగు నారాయణమూర్తిదే అయినట్లు పురాణములలో త్రిమూర్తులయందు నారోపించఁబడిన గుణజాలమంతయు వీరికి మూలభూతుఁడగు పరమేశ్వరునిదేయని స్పష్టమగుచున్నది. ఒకయుగమునందు బ్రహ్మకు, ఇంకొక యుగమునందు విష్ణునకు, వేరొకయుగమునందు రుద్రునకును నిట్లు యుగభేదములను బట్టి త్రిమూర్తులలో నుత్కర్షాపకర్షలు మారుచుండునుగాని వీరికి మూలభూతుఁడగు పరమేశ్వరు నుత్కర్షము మారిపోవునది కాదనియు మత్స్యపురాణమునందు సర్వపురాణములకు నవిరోధమిట్లు నిరూపింపఁబడియున్నది.

అన్నం—యుగభేదములయందు త్రిమూర్తులకు నుత్కర్షాపకర్షలు మారుటకు కారణమేమి?

పండి—శివపురాణమున వాయుసంహితయందు,

త్రయస్తేకారణాత్మానస్సంజాతాః మహేశ్వరాత్, ఇత్యుపక్రమ్య తపసాతోషయిత్వా తంపితరంచ మహేశ్వరం।
బ్రహ్మనారాయణౌపూర్వం రుద్రః కల్పాంతరేఽసృజత్।

కల్పాన్తరే పునర్బ్రహ్మ రుద్రవిష్ణూ జగన్మయః।
విష్ణుశ్చ భగవాంస్తద్వత్ బ్రహ్మాణ మసృజత్పునః,
నారాయణం పునర్బ్రహ్మ బ్రహ్మాణంచ పునర్భవః।
ఏవం కల్పేషు కల్పేషు బ్రహ్మవిష్ణు మహేశ్వరాః।
పరస్పరస్మా జ్జాయన్తేపరస్పర జయైషిణః।
తత్తత్కల్పాంతవృత్తాంత మధికృత్య మహర్షిభిః।
తానితాని ప్రణీతాని విద్వాం స్తత్రనముహ్యతి॥

బ్రహ్మ విష్ణు రుద్రులు మువ్వురును పరమేశ్వరునివలన ఆది కల్పమునందు జన్మించిరని యారంభించి, వీరిలో రుద్రుఁడు తపముచే తండ్రియగు పరమేశ్వరు మెప్పవడసి యొక కల్పంబున బ్రహ్మవిష్ణుల సృజించెను. ఆవిధముననె బ్రహ్మయు నింకొకకల్పంబున రుద్రవిష్ణుల సృజించెను. ఆమార్గముననె విష్ణుండును బ్రహ్మరుద్రులఁ బుట్టించెను. ఇట్లు బ్రహ్మ విష్ణు రుద్రులు తమలోతాము జయముగోరి యాయా కల్పములయందు యొకళ్లొకళ్లను బుట్టించుచు నొకళ్లవలన బుట్టుచు నుందురు. ఈవృత్తాంతమునె గ్రహించి మహర్షులు బ్రహ్మ పురాణమున బ్రహ్మయధికుఁడనియు, విష్ణుపురాణమున విష్ణువే శ్రేష్ఠుఁడనియు, రుద్రపురాణమున రుద్రుఁడే యుత్తముఁడనియు నుడివిరి. కాని యీసందర్భము నెఱిఁగినవాఁడు మోహమొందడనిభావము. దీనింబట్టి త్రిమూర్తులపారమ్యము కల్పభేదములనుబట్టి మారిపోవుచుండునుగాన త్రిమూర్తులు సమానులే అయినను వీరికి తండ్రియగు పరమేశ్వరుని పారమ్యమెన్నటికి మార్పునొందునది కాదుగాన పరమేశ్వరుఁడు సర్వోత్కృష్టుఁడనుట సిద్ధమగుచున్నది. ఈయర్థమును మహాకవి కాళిదాసుండును కుమారసంభవమునందు.

(గత సంచికానుబంధము.)

శ్లో॥ ఏకైవమూర్తిర్బిభిదే త్రిధాసా
సామాన్యమేషాం ప్రథమావరత్వం।
విష్ణోర్హరస్తస్యహరిఃకదాచి
ద్వేధా స్తయో స్తావపిధాతురాద్యౌ॥

త్రిమూర్తులు నొక్కనియంశములే. వీరి ముఖ్వురకు జ్యేష్ఠ కనిష్ఠభావము సమానమే. ఒకప్పుడు రుద్రుఁడు జ్యేష్ఠుండును బ్రహ్మ విష్ణులు కనిష్ఠులును నగుదురు. ఇంకొకప్పుడు విష్ణువు జ్యేష్ఠుండును బ్రహ్మ రుద్రులు కనిష్ఠులు నగుదురు. వేరొకప్పుడు బ్రహ్మ జ్యేష్ఠుండును తక్కిరువ్వురు కనిష్ఠులు నగుదురని చెప్పియుండెను,

అన్నం = కాళిదాస వచనమునుబట్టి, తత్త్వమొక్కటియే త్రిమూర్తులుగా భేదమునొందెననియు, నీత్రిమూర్తులలో పరత్వాపరత్వములు మారిపోవుచునుండు. గాన మువ్వురు సమానులేయనియు తెలియుచున్నది. ఇది మాసిద్ధాంతమునకు ననుకూలమే.

పండి = కల్పభేదముల యందు త్రిమూర్తుల యుత్కర్షాపకర్షలు మారుచుండుననుటకే కాళిదాసవచనము నుదాహరించితిమి. త్రిమూర్తుల యుత్కర్షాపకర్షలు మారుచుండునవి యైనను వీరికి మూలభూతుఁడగు పరమేశ్వరు నుత్కర్షమెప్పుడును మారునదిగాదు గాన నప్పరమేశ్వరుఁడు సర్వోత్కృష్టుఁడనుట నిర్వివాదము.

అన్నం = ఈ త్రిమూర్తులకంటె పైన నిర్గుణతత్త్వమున్నద నుట నిజమే. త్రిమూర్తులుగాక వీరికిపైన సగుణతత్త్వమున్నదని దేనినిబట్టి గ్రహింపవలయు ?

పండి = యుక్తినిబట్టియు, ప్రమాణములనుబట్టియు, నంగీకరింపక తప్పదు.

అన్నం = సగుణమునందు త్రిమూర్తులచేతనే సకల వ్యవహారము నెరవేరుచుండ వీరికిపైన సగుణతత్త్వమునంగీకరింప నవసరమేమి;

పండి=అట్టులంగీకరింపకున్నచో నిరీశ్వరవాదమో? లేక అనేకేశ్వరవాదమో అంగీకరింపవలసివచ్చునుగదా?

అన్నం=అదియేల?

పండి=త్రిమూర్తులకు పరత్వాపరత్వములు మారిపోవుచుండుగాన వీరిలో నొకనికిని నీశ్వరత్వములేదు. ఏలన, అదియుండినచో తమ పరత్వము స్థిరముగనే చేసికొందురుగదా?

అన్నం=కాళిదాస శ్లోకవ్యాఖ్యానమునందు॥ ఇచ్ఛయాః సర్వేజ్యేష్ఠాభవంతి-కనిష్ఠాశ్చ॥ తమ యిచ్ఛచేతనే త్రిమూర్తులు జ్యేష్ఠులు కనిష్ఠులునగు చుందురని మల్లినాథ సూరి చెప్పియున్నాడు. దీనింబట్టి వారి పరత్వాపరత్వములు తమయిచ్ఛచేతనే సంభవించెను. గాన వారికి నీశ్వరత్వము కలిగియున్నదని యేల యంగీకరింపరాదు?

పండి=యుక్తి యుక్తముగా లేనందుననే!

అన్నం=అదియెట్లు?

పండి=లోకమున నెవ్వరికైనను శ్రేష్ఠులముగా నుండవలయునని యిచ్ఛపొడమునుగాని, హీనులముగా నుండవలయునని యిచ్ఛపొడమునా? అదియసంభవము. ఇట్లు త్రిమూర్తులలో నొకరును తమ పరత్వమును నిలుపుకొను స్వాతంత్ర్యము లేనివారగుటంజేసి వీరలకు నీశ్వరత్వములేదు. వీరికిపైన సగుణమగు నీశ్వరతత్త్వము నంగీకరింప లేదుగాన నిరీశ్వరవాదమును శిరసావహింపక తీరదు.

అన్నం=త్రిమూర్తులకు నీశ్వరత్వము నంగీకరింతుముగాన నిరీశ్వరవాద మెట్లు వచ్చును.

పండి=త్రిమూర్తులకు నీశ్వరత్వము నిల్పుకొనుటయే అసంభవము. అద్దానిని [illegible] త్రిమూర్తులు [illegible] అగుదురు గాన

నప్పుడును నానేశ్వరవాదము తప్పదు. నానేశ్వరవాదము నంగీకరించి నను బాలనాయకము బహునాయకము ననునట్లు జగముయొక్క వ్యవస్థ నిలువనేరదుగదా?

అన్నం=త్రిమూర్తులకు భేదము ఔపాధికమేగాని నిజమైనది కాదు. దీనింబట్టి, త్రిమూర్తులకు నీశ్వరత్వము నొప్పినను నొక్కండె యీశ్వరుఁడని సిద్ధించును. ఇఁకనిందు నిరీశ్వరవాదముగాని, నానేశ్వర వాదముగాని యెట్లు ప్రసక్తించును?

పండి=త్రిమూర్తులకు గలభేదము ఔపాధికమే యగునేని వీరికి మూలభూతమగు నిరుపాధిక తత్త్వము సగుణమా? నిర్గుణమా?

అన్నం=త్రిమూర్తులకుపైన సగుణమెక్కడిది? నిర్గుణమే!

పండి=అట్లేని మీసిద్ధాంతమునందు, నిర్గుణమునకునీశ్వరత్వము సంభవింపదుగాన, త్రిమూర్తులకు మూలభూతమైన రూపము ఈశ్వర తత్త్వముగాదు. త్రిమూర్తులు నౌపాధికులెగానను ఉపాధిభేదము నందు నుపహితభేదము వస్తుసిద్ధమేగానను, త్రిమూర్తులకు పరస్పరభేద మంగీక రింపకతప్పదు. దానంజేసి త్రిమూర్తులకు నీశ్వరత్వము నొప్పినచో నానేశ్వరవాదము వారింప తరముగాదు.

అన్నం=త్రిమూర్తులకుగల భేదమౌపాధికమేగాన మువ్వురకు భేదములేదుగాఁబట్టి, యీశ్వరుఁడొక్కఁడే యని యేర్పడును.

పండి=మీసిద్ధాంతమున పరమార్థదశయందె తత్త్వము నిర్గుణ ముగాన భేదములేదని అభేదమును సిద్ధాంతముచేసికొని వ్యావహారిక

దశయందు భేదమును సాధించుకొనుటకే యుపాధి కల్పింపఁబడియెన గదా?

అన్నం=అట్లేయగును.

పండి=అటులేని, ఉపాధిభేదము గలిగియున్నప్పుడును భేదము లేదని వాదింప నారంభించితివేమి?

అన్నం=ఉపాధి కల్పితమే గాన నిజమునుబట్టి యట్లంటిమి.

పండి=మీా సిద్ధాంతమున, ఉపాధి కల్పితము గాన నిజముగా దనియు దానింబట్టి తత్త్వము నిర్గుణమేయనియు, దీనింబట్టి భేదము లేదనియు సాధించినది యేదశ నుద్దేశించి?

అన్నం=పారమార్థిక దశ నుద్దేశించియే॥

పండి=జగమున నీశ్వరుఁడెవ్వఁడను విచార మేదశ నుద్దేశించి?

అన్నం=వ్యావహారికదశ నుద్దేశించియే?

పండి=ఆచార్యులవారూ, వ్యవహారదశనుద్దేశించి చర్చించు నప్పుడు పారమార్థికదశనుబట్టి మీరుచెప్పనుత్తర మెట్లున్నదో చూడుడు.

ప్రతి=నిదురబోవుచు కలవరించినట్లు బాగుగనేయున్నది. వీరి నింకొక్కమాట యడుగవలయు, భట్టాచార్యులవారూ! మీారు పరమార్థదశయందు భేదము నెంతమాత్రము నంగీకరింపకు సరే, వ్యవహారదశయందు భేదము నంగీకరింతురా లేదా?

అన్నం=బాగుగా నంగీకరింతుము.

ప్రతి=అట్లేని, మాదిరాములు భేదమేల యంగీకరింపరు?

అన్నం:—వ్యవహార దశయందైనను హరిహరులకు భేదమున్నదనుట సాంప్రదాయికముగాదు.

పండి—అదియేల ?

ప్రతి—అందునకు దగుకారణము వీరు చెప్పరు.

అన్నం—అదియేమో మీరు చెప్పరాదా ?

ప్రతి—శైవులకు శివుండును, వైష్ణవులకు విష్ణువు నుపాస్యదేవతలై యుండగా కొందఱ శైవులను, కొందఱ వైష్ణవులనుగూడ గలుపుకొని యీసంఘమునకు స్మార్తమతమని వీరు నామకరణము గావించుకొని యుండిరి. అట్లుండ నామతమునకు దేవుఁడెవఁడని పలువురడుగసాగిరి. అప్పుడు శివుడు దేవుడని నచో తమ మతము శైవములో చేరును. విష్ణువు దేవుండనిన వైష్ణవులలో చేరును. కాఁబట్టి యెట్లు చెప్పనువీలుకనబడదయ్యెను. దానికై యోజించి శివుఁడు, విష్ణుఁడునుకలిసి యొక్కడే దేవుఁడని చెప్పసాగిరి. దానిమీద పలువురు ఇదియెట్లు? శివకేశవులు కలిసి యొక్క దేవతయగునా అని యడుగగా నిద్దరకు భేదము లేదని సాధింప నుపక్రమించుచున్నారు.

అన్నం—ఇది సర్వాబద్ధము. మేము హరిహరులకు భేదములేదనినది దేవుని సాధించుకొనుటకని యెందున్నది? ఎవ్వరు చెప్పిరి?

ప్రతి—త్వరపడకుము. మీశంకరాచార్యులవారె ప్రశ్నోత్తరరత్నమాలిక యందు "కో దేవః- దేవుఁడెవ్వఁడు" అని ప్రశ్నించుకొని హరిహరాత్మకో దేవః హరిహరరూపుఁడొక్కడె దేవుఁడని సమాధానము జెప్పియుండలేదా? దానింబట్టి దేవుని సాధించుకొనుటకే హరిహరులకుభేదము లేదనువాద మవలంబింపఁబడినట్లు స్పష్టపడుటలేదా?

అన్నం—అట్లుగాదు ప్రమాణబలమునుబట్టియే యావాద మంగీకరించితిమి.

పండి—మంచిది. ఆదారికిరండు. హరిహరులకు భేదము లేదనిచెప్పు ప్రమాణము లేవి ?

అన్నం—శ్రుతులే

పండి—ఒక్కశ్రుతి చదువుఁడు.

అన్నం—సంధ్యావందనముగూడ మీకు రాదా?

పండి—హరిహరులకు భేదము లేదని సంధ్యావందనమున నెచటగలదు ?

అన్నం—శివాయ విష్ణురూపాయ శివరూపాయవిష్ణవే॥ అని సంధ్యావందనమునందు పఠించుట లేదా ?

పండి—సంధ్యావందనమునకును నీశ్లోకములకును నేమిసంబంధము ?

అన్నం—ఇవి శ్రుతులుగావా? శ్లోకములందు లేవేమి ?

పండి—కృష్ణపండితుఁడు సంధ్యావందన భాష్యమునందు శివాయ విష్ణురూపాయ మొదలైనవి పురాణశ్లోకములని చెప్పియున్నాఁడు. చూడ లేదా ?

అన్నం—వాని నిప్పుడు ఉపనిషత్తులలో చూపింతునా ?

పండి—అవియిప్పుడు ఉపనిషత్తులలో చేరియుండుగాక మీవాఁడు కృష్ణపండితుఁడు పురాణశ్లోకములని చెప్పినమాట మీరలంగీకరింపరా ?

అన్నం—ఉపనిషత్తులను కృష్ణపండితుఁడు చూడ లేదుగాబోలు.

పండి—కృష్ణపండితుఁడు ఉపనిషత్తులు చూడలేదనుట సాహసము ఆయన భాష్యము చేయునాటికి నీశ్లోకము లుపనిషత్తులలో చేర లేదనుటయే నిజము.

అన్నం—పురాణశ్లోకములే యగుననుకొందము. అట్లైన ప్రమాణ ములుకావా ?

పండి—అవి పురాణశ్లోకములై యుండిన యెడ ప్రమాణములని బాగు గనమ్మవచ్చును. కానియవి శ్రుత్యాదులయందు నెందును కనం బడమిచే పురాణములయందు లేకుండునాయను భావముతో నతడట్లు వ్రాసెను. కాని యాశ్లోకములు పురాణములయందును నుండుననుటకు వీలు లేదు.

అన్నం—అదియేల ?

పండి—ఈశ్లోకములు శివపురాణమునందు నుండునా ? విష్ణుపురాణము నందు నుండునా ? శివపురాణమునందు శివుని యుత్కర్షముం డును. విష్ణుపురాణమునందు విష్ణునుత్కర్షముండును. ఇద్దరు నొక్కటియనుట పురాణప్రవృత్తివిరుద్ధము. కావున నట్టి విష యమేపురాణమునందైన నుండదగినది కాదు. కాన నీశ్లోకము లభేదవాదకల్పితములే.

ప్రతి—సర్వము కల్పితమేఅని యంగీకరించినవారికి నీశ్లోకములు కల్పిత ములైనచో నేమి బాధకము ?

అన్నం—మీతగాయిదానదుమ మాగొడవయేల? ఆరాధ్యులవారూ మీరు త్రిమూర్తులకు మీద నొకసగుణతత్త్వమున్నదని యొప్పి తీరవలయునందురు. ఇంతియెగాదా ?

పండి—అగును.

అన్నం—అట్లొప్పిన నేమిలాభము ?

పండి—అట్లొప్పిననేజగమున కీశ్వరుఁడేర్పడును. లేనిచో నిరీశ్వరవాదమో నానేశ్వరవాదమో, అంగీకరింపవలసివచ్చునని నిరూపించితిమి గాదా ?

అన్నం—అగుగాక త్రిమూర్తులకు పైన సగుణతత్త్వ మున్నదనుటకు ప్రమాణమేమి ?

పండి—తాపనీయోపనిషత్తునందు॥ అకారంబహ్మాణంనాభౌ । ఉకారం విష్ణుహృదయే । మకారం రుద్రంభ్రూమధ్యే । ఓంకారం సర్వేశ్వరం ద్వాదశాన్తే॥ అని యుండుటచే బ్రహ్మవిష్ణురుద్రులకు పైన సర్వేశ్వరు డున్నాడని తెలియుచున్నది. మఱియు మైత్రేయోపనిషత్తునందు॥ తమోవా ఇదమేకమాస । తత్పరేణేరితం విషమత్వంప్రయాతి॥ అని యారంభించి॥ తస్యప్రోక్తా అగ్ర్యాస్తనవో బ్రహ్మరుద్రోవిష్ణుః॥ అని త్రిగుణాతీతునియొక్క యంశములు బ్రహ్మవిష్ణురుద్రులనుటచే త్రిమూర్త్యతీతమగు తత్త్వమున్నదని తెలియుచున్నది.

ఇదిగాక యోగయాజ్ఞ్యవల్క్యుడు॥ అక్షరత్రయమేతత్తు కారణత్రయమిష్యతే । త్రయాణాంకారణం బ్రహ్మభారూపం సర్వకారణం॥ సర్వకారణమగు బ్రహ్మము త్రిమూర్తులకు కారణమైనదనుటచేతను, బ్రహ్మావిష్ణుశివాబ్రహ్మన్ ప్రధానాబ్రహ్మశక్తయః బ్రహ్మ విష్ణు రుద్రులు ముఖ్యములైన పరబ్రహ్మాంశములు అను వచనముచేతను సర్వకారణమైన పరతత్త్వము బ్రహ్మవిష్ణు రుద్రులకంటె నతీతమైనదని యేర్పడుటలేదా ? అదియే శివతత్త్వము కావున శివుడే సర్వదేవప్రకృష్టుఁడు.

అన్నం—త్రిమూర్త్యతీతమైన యాతత్త్వమే నారాయణమూర్తి అని యేల యంగీకరింపరాదు ?

పండి—ఆతత్త్వము నారాయణమూర్తియనుటకు ప్రమాణములేదు.

అన్నం—అది శివతత్త్వమేయనుటకు ప్రమాణముకలదా ?

పండి—చాల ప్రమాణములున్నవి॥ మాండూక్యోపనిషత్తునందు॥ శివమద్వైతం చతుర్థంమన్యన్తే॥ శివుడే తురీయతత్త్వమని స్పష్టీకరింపబడియున్నది.

ఇదిగాక, అథర్వశిఖయందు॥ సర్వమిదం బ్రహ్మవిష్ణురుద్రేంద్రాస్సం ప్రసూయన్తే॥ సర్వజగంబును బ్రహ్మ విష్ణు రుద్రేంద్రులును శివునిచే సృజింపఁబడుచున్నారు॥ అని యీశ్వరునకు త్రిమూర్తి కారణత్వము చెప్పఁబడియున్నది.

నారాయణునకు కారణత్వము చెప్పుశ్రుతియందు॥ నారాయణాద్బ్రహ్మజాయతే॥ నారాయణాద్రుద్రోజాయతే॥ నారాయణునివలన బ్రహ్మరుద్రులు మాత్రమే సృజింపఁబడుచున్నారనియున్నది. నారాయణమూర్తి త్రిమూర్తులకు నతీతుఁడే యగునేని అచ్చట త్రిమూర్తి కారణత్వము చెప్పఁబడియే యుండును॥ అట్లు చెప్పఁబడియుండలేదు. గావుననే వైష్ణవులు విష్ణుని త్రిమూర్తులలో శ్రేష్ఠునిగా నంగీకరించిరి గాని త్రిమూర్త్యతీతునిగా నంగీకరించి యుండలేదు. ఈ కారణమున విష్ణువు త్రిమూర్తులలో చేరినవాఁడనియు, శివుఁడు త్రిమూర్తులకు నతీతుఁడనియు, దాననే సర్వకారణుఁ డనియు వేదశాస్త్రములచే నేర్పడుచున్నది.

అన్నం-ఆచార్యులవారూ, త్రిమూర్త్యతీతమైన తురీయ తత్త్వము నారాయణమూర్తియే యని ప్రమాణము చూపగలరా ?

ప్రతి—త్రిమూర్త్యతీతమైన తత్త్వముండినంగదా అది నారాయణమూర్తియే అని వాదించుటకు. అట్లెందును లేనేలేదు.

అన్నం-ప్రమాణములంబట్టి తురీయతత్త్వము కలదని యేర్పడుచుండగా నది లేదనుట యెట్లు ?

ప్రతి—త్రిమూర్త్యంతర్గతమైన నారాయణతత్త్వమే కొన్ని సమయములందు త్రిమూర్త్యతీతముగా స్తుతింపఁబడి యుండవలయు. గాని యది నిజముగా నట్లు లేదు. దాననే మాసిద్ధాంతమునందు త్రిమూర్త్యతీతమైన తత్త్వ మంగీకరింపబడదయ్యెను.

అన్నం—ఈ చర్చవలన నొక్కటి తేలినది. ఏమందు రేని, శైవసిద్ధాంతమునందు శివతత్త్వము త్రిమూర్త్యతీతముగాను వైష్ణవసిద్ధాంతమునందు విష్ణుతత్త్వము త్రిమూర్త్యంతర్భూతముగాను నంగీకరింపఁబడియె ననియు, దానికి కారణ మేమనిన, శివతత్త్వము త్రిమూర్త్యతీతమనుటకు దగుప్రమాణములు కలవుగానివిష్ణుతత్వము త్రిమూర్త్యతీతమనుటకు దగు ప్రమాణములు లేవనియు, దాననే వైష్ణవులు నారాయణమూర్తిని త్రిమూర్త్యంతర్భూతునిగానె యంగీకరింపవలసి వచ్చెననియు స్పష్టమైనది.

ప్రతి—అగుగాక? అంతమాత్రమున శైవులకుగల్గిన లాభ మేమి?

అన్నం—అంతమాత్రమున శైవులకు వడిలోపడిన దేమియు లేదు. కాని త్రిమూర్త్యంతర్భూతునికన్న త్రిమూర్త్యతీతునకు నాధిక్యము న్యాయసిద్ధము కాదా?

ప్రతి—ఇట్లుమీరనుట కేవలమన్యాయమే

అన్నం—ఎట్లైనయగుగాక మధ్యాహ్నమైనది. ఇప్పటికి చర్చముగింతము. అని యందఱునిష్క్రమింతురు.

ప్రథమాహ్నికము ముగిసెను.

శివము.

---

## ద్వితీయాహ్నికము.

మరునాడందఱు తిరిగిసమావేశమైరి.

అన్నం—కేవలము శ్రుతులచేత పరత్వ మే దేవునకు సిద్ధించును?

ప్రతి—కేవలము శ్రుతులచేత పరత్వము శ్రీనారాయణమూర్తికిగాక వేరొక దేవతకు సిద్ధింపదు.

పండి—ఇట్లు మాటమాత్రము చెప్పవచ్చుగాని దీనిని నిలుపుకొనుట యసంభవము.

అన్నం-ఆచార్యులవారూ? ఆరాధ్యులవారిమాట వినుచున్నారా?

ప్రతి—వినుచుండుటయె గాదు. నే చెప్పినమాట నిదిగో సాధించుచున్నాను.

అన్నం-శ్రుతులలో నారాయణుడనిలేదు. రుద్రుడనియు లేదు. ఏకమేవా ద్వితీయం బ్రహ్మ. బ్రహ్మ పదార్థ మొక్కటియే యుని యున్నది.

ప్రతి—ఏకమేవ అను శ్రుతియందుఁ జెప్పఁబడిన బ్రహ్మపదార్థము శ్రుత్యంతరమున నారాయణుఁడనియే నిర్ణయింపఁబడియున్నది.

అన్నం-ఆ శ్రుతియేది ?

ప్రతి—ఏకోహవై నారాయణ ఆసీత్ అనునది.

అన్నం—ఆరాధ్యులవారూ? ఇక్కడ మీయభిప్రాయ మేమి? సెలవిండు.

పండి—ఏకోహవై నారాయణః అను శ్రుతి ఏకమేవాద్వితీయంఅను శ్రుతి వాక్యమునకు సమానార్థముగాదు.

ప్రతి—ఏకమేవాద్వితీయం అనుశ్రుతికి సమానార్థకమైన శ్రుతివాక్యమింకొక్కటి వినిపింపఁగలరా ?

పండి—సెలవైనచో నభ్యంతర మేమి ?

అన్నం—ఆలస్యమెందునకు ?

పండి—ఏక ఏవరుద్రోన ద్వితీయాయతస్థే॥ అనువాక్యము ఏకఏవఅను శ్రుతివాక్యమునకు సమానార్థకమగునో లేక, ఏకోహవై అను వాక్యమగునో విమర్శింపుడు.

అన్నం—ఏకమేవాద్వితీయంబ్రహ్మ అనువాక్యమునందు ఏకం, ఏవ, అద్వితీయం అని భేదమును నిషేధించుపదములు మూఁడుకలవు

ఇట్లే, ఏకఏవరుద్రోన ద్వితీయాయతస్థే అనువాక్యమునందును, ఏకః, ఏవ, నద్వితీయాయ అని భేదమును నిషేధించు పదములు మూడు గలిగియున్నవి. కాని, ఏకోహవై అనువాక్యమునందు ఏకః అనుపదమొక్కటియే భేదమును నిషేధించుపదముగలదు గాని రెండవదిలేదు. ఇట్లుండ, ఏకోహవై అనువాక్యము ఏకమేవాద్వితీయం అనువాక్యమునకు సమానార్థక మెట్లగును ?

ప్రతి—ఏకోహవై అనువాక్యమునందును, ఏకః, హ, వై అనిమూడు పదములుగలవు. ఈమూడును భేదమును నిషేధించునవియే కాబట్టి, ఏకోహవై అనువాక్యంబును ఏకమేవాద్వితీయంఅను వాక్యమునకు సమానార్థకమే యగును.

అన్నం—హ, వై అనుపదములు భేదమును నిషేధించునవియని యెం దున్నది ?

ప్రతి—సందర్భమునుబట్టి యట్టియర్థము గ్రహింపవలయు.

అన్నం—ఆరాధ్యులవారూ? హ,వైఅనుపదములకు ఏకత్వరూపార్థము కలదా ?

పండి—ని॥ తుహిచస్మహవై పాదపూరణే॥ అనునిఘంటువునుబట్టి యీ పదములకుపాదపురాణమునందేశక్తిగలదు. అని తెలియుచున్నది

ప్రతి—హ,వై అనుపదములు నిరర్థకములేయగునా ?

పండి—పాదపూరణార్థకములగుటచే సార్థకములే యగును.

అన్నం—హవైపదముల నిరర్థకత్వ సార్థకత్వవిచారము అనవసరము. ఏకమేవాద్వితీయం అనుశ్రుతికి సమానార్థకమైనది. ఏకఏవ రుద్రోన ద్వితీయాయతస్థే అనువాక్యమా? లేక, ఏకోహవై నారాయణఆసీత్ అనువాక్యమా అనునది విమర్శనీయము. ఇందు ఏకఏవరుద్రోనద్వితీయాయతస్థే అనునదియే భేదనిషేధక పదములు మూడుగలదియగుటచే సమానార్థమని తెలియు

చున్నది. దీనింబట్టి ఏకమేవాద్వితీయం బ్రహ్మయను శ్రుతి యందు నిరూపింపబడిన బ్రహ్మపదార్థము రుద్రశబ్దిత మేయని స్పష్టమగుచున్నది.

ప్రతి—మీరు చేసినతీర్మానము కేవల మన్యాయ్యమే.

అన్నం—ఏకమేవ అనుశ్రుతి వాక్యమునకు సమానార్థకమైన శ్రుతి వాక్యమును నారాయణ ప్రతిపాదకమైనదానిని మీరు కనుపించలేక పోయితిరి. ఏకఏవ రుద్రోనద్వితీయాయతస్థే అను శ్రుతినిబట్టి మేముచేయు నిర్ణయము కేవల మన్యాయ్యమనుచుంటిరి. ఈయన్యాయ్య మెవ్వరుచేసినది?

పండి—ఈయన్యాయ్యము నంతను శ్రుతులే చేసెను. గాని మరెవ్వరు చేయలేదు.

ప్రతి—అగుగాక, ఏకఏవ రుద్రో అనుశ్రుతినిబట్టి బ్రహ్మపదార్థము రుద్రుఁడని శ్రుతులు తెలిపినను ఆశ్రుతులే పరబ్రహ్మము నారాయణుఁడేయని నిర్ణయించినవి.

అన్నం—అదియెక్కడ?

ప్రతి—మంత్రపుష్పమునే మీరెఱుఁగరా? అందు నారాయణ పరం బ్రహ్మ, నారాయణ పరంజ్యోతిః, అని మొదలుగానుండలేదా? దానికి నారాయణుఁడే పరంబ్రహ్మఅని యర్థము కాదా?

అన్నం—ఆరాధ్యులవారూ? దీనికిమీరేమి చెప్పెదరు?

పండి—ఇది అర్థవాదవాక్యము గాదండీ?

ప్రతి—అదిగో ఇది అర్థవాదమట ? ఇది అర్థవాదవాక్యమని మీరు ధ్రువపరచగలరా ?

పండి—దేవుఁడే ధ్రువపరచెను.

అన్నం—ఇది అర్థవాదవాక్యమని దేనినిబట్టి ధ్రువపరతురు?

పండి—స్తుతిలింగమునుబట్టియే

అన్నం—ఇందు స్తుతిలింగ మేమున్నది ?

పండి—నారాయణుండే పరబ్రహ్మము, నారాయణుఁడె పరంజ్యోతి, నారాయణుఁడే పరతత్త్వముఅనుట స్తుతిగాక మఱేమిటి ?

ప్రతి—స్తుతివాక్యమైనంతమాత్రమున దానికి స్వార్థమునందు తాత్ప ర్యములేదనుట యెట్లు ?

పండి—దీపంజ్యోతిః పరబ్రహ్మ దీపంజ్యోతిః పరాయణం । అనువా క్యము స్తుతి వాక్యముగాదా? దానికి స్వార్థమునందు తాత్ప ర్యము గలదా? అట్లుగలదేని దీపమే పరంబ్రహ్మమని నిర్ణయ మెట్లు గాదు?

ప్రతి—హరి హరీ ఈమాటలు వినఁగూడదు. దీపంజ్యోతిః పరంబ్రహ్మ అను శ్లోకమునకు నారాయణ పరంబ్రహ్మ అనుశ్రుతికిసామ్యము గలదా?

పండి—శ్రుతి వాక్యమైననేమి? స్మృతివాక్యమైననేమి? రెండును స్తుతి వాక్యములే, స్తుతివాక్యము వేదమునందున్నను దానికిస్వార్థము నందు తాత్పర్యము లేదనియే పూర్వ మీమాంసయందు నిర్ణ యింపఁబడి యున్నది కాదా?

ప్రతి—పోనిండు. భట్టాచార్యులవారూ? రుద్రుఁడు పరబ్రహ్మమని శ్రుతివాక్యము నొక్కదానిని కనఁబరుపగలరా?

పండి—ఇదిగో వినుడు. శ్రు॥ ఋతగ్ం సత్యం పరం బ్రహ్మపురుషం కృష్ణ పింగళం। ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వైనమో నమః॥ అనుమంత్రమున విరూపాక్షుఁడు పరంబ్రహ్మము, అని నిరూపింపఁబడియున్నది.

ప్రతి—ఇదియు స్తుతివాక్యమే!

పండి— దేనినిబట్టి ?

ప్రతి—స్తుతిలింగమునుబట్టియే

పండి—అదియేది ?

ప్రతి—నమోనమఃఅని యందు నమస్కారములు కనఁబడుటలేదా ? అవి స్తుతిలింగములుగావా ?

పండి—అట్లైన్నటికిగావు.

ప్రతి—అదియేల ?

పండి—శ్రుతి, నమస్కారముచేయక రుద్రుని ప్రస్తావము నెత్తుటకు భయపడును. దానంజేసి, నమఃపదములేక రుద్రుని ప్రస్తావము శ్రుతియందు నుండదు. దీనికి నమస్తేరుద్రమన్యవ ఈ మొదలగు శ్రీ రుద్రాదులే నిదర్శనములు. దానంజేసి యిందు నమఃపదము లుండుటచే నీవాక్యము రుద్రుని యుత్కర్షాతిశయమును తెలుపునుగాని యీదియర్థవాదరూపమైన వ్యర్థవాక్యమని తెలుపునా? కాబట్టి శివుఁడే పరబ్రహ్మమనుట శ్రుత్యభిప్రాయము.

అన్నం—శ్రుతియందు ఒకచో నారాయణుఁడు పరబ్రహ్మమనియు వేరొకచో రుద్రుఁడు పరబ్రహ్మమనియు నున్నది. ఇద్దరు పరబ్రహ్మములుందురా? ఉండరు. కావున నారాయణుడన్నను విరూపాక్షుడన్నను ఒక్కడేయని యంగీకరింపరాదా.

పండి—సిద్ధాంతమునందు నారాయణమూర్తి శక్త్యంశముగాన మీరు వీరలనిద్దఱను నొక్కటిచేసినను మాకు సమ్మతమే. కాని యాచార్యులవారు మీయుద్యమమునకు సమ్మతింతురేమో అడిగి చూడుడు.

ప్రతి—ఈసిద్ధాంతవిచారము నడుమ పేడ బెల్లము రెండు నొకటియే. అను మీసిద్ధాంతముగాడవ దేనికి ?

అన్నం—అట్లైని నిద్దఱు పరబ్రహ్మములేయని మీరొప్పుకొందురా ?

ప్రతి—అంతగ్రహచారమేమివచ్చెను?

అన్నం—శ్రుతియందు నారాయణుడు రుద్రుడును పరంబ్రహ్మములే యని యున్నదానికి మీరేమి చెప్పెదురు?

ప్రతి—న్యాయమును బట్టి శ్రుతివాక్యములను సమన్వయము చేసికొందుముగాని అది కుదుర్చుకొనలేక యంతయొక్క టేయని యొప్పుకొందుమా?

అన్నం—ఆ రెండు వాక్యములకు సమన్వయ మెట్లో కుదుర్చుడు.

ప్రతి—వీనిలో ఋతగ్ంసత్యంపరంబ్రహ్మ అనునది స్తుతివాక్యము కావున రుద్రుడు పరబ్రహ్మమని శ్రుత్యభిప్రాయముగాదు. ఇక నారాయణుడు పరబ్రహ్మమనుటయే శ్రుత్యభిప్రాయమని నిస్సంశయముగా నేర్పడుచున్నది.

అన్నం—ఇక్కడ నారాయణ పరబ్రహ్మ అన్నదే అర్థవాదవాక్యమని ఆరాధ్యులవారు ఇదివరకే చెప్పియుండిరిగదా? ఇందు నిర్ణయ మెట్లు?

ప్రతి—మామతాచార్యులట్లే నిర్ణయముచేసిరి.

అన్నం—అదినిజమేకాని మీమతాచార్యుల నిర్ణయము నారాధ్యులవారంగీకరింతురా? ఇదియుండనిండు.

ఆరాధ్యులవారూ? ఈరెండువాక్యములకు మీరెట్లు సమన్వయముచేయుదురు?

పండి—నారాయణ పరంబ్రహ్మ అనునది యర్థవాదవాక్యముగాన రుద్రుడే పరంబ్రహ్మమనియే,

అన్నం—ఇట్టులంగీకరింపదగినంత కారణముగలదా?

పండి—ఉండిననె యంగీకరింపుడు.

అన్నం—ఆవిధమును బాగుగా దెలుపుడు.

పండి—నారాయణమునందు దహ్రంవిపాపం అనిమొదలుగా దహ్రవిద్య నిరూపింపబడియున్నది. అచట యత్పుండరీకంపురమధ్యసగ్ంస్థం అని హృదయపుండరీకము ఉపాసనాస్థానముగా జెప్పబడియెను. తస్మిన్యదం తత్తదుపాసితవ్యం అని యుపాస్య వస్తు

వును నిరూపించి యుపాస్య వస్తు స్వరూపము దెలుపుటకై ఋతగ్‌మ్ సత్యంపరంబ్రహ్మ పురుషంకృష్ణపింగళం ॥ అనుమంత్రము ప్రవర్తించెను. తరువాత ఉపాసకుని స్వరూపము దెలుపుటకై నారాయణపరంబ్రహ్మ అను నీమొదలగు వాక్యములు ప్రవర్తించెను. గావున ఉపాసకుని దెలుపు నర్థవాదములె నారాయణపరంబ్రహ్మ మొదలైనవి,

ప్రతి—ఎచటనైన శ్రుతి ఉపాస్యుని పరబ్రహ్మముగాఁ జెప్పెనుగాని యుపాసకుని పరబ్రహ్మముగాఁజెప్పెనా ?

అన్నం—ఉపాస్యుఁడు ఉపాసకుడునందఱు పరబ్రహ్మమెగాన నట్లు చెప్పినదేమో ?

ప్రతి—ప్రతివాక్యసందర్భమునను మీాయభేదవాదము దూర్చుచుండ వలసినదేనా? ఇద్దరు పరంబ్రహ్మములని యారాధ్యులవారంగీకరింతురా ?

అన్నం—మీారు ఉపాసకుని పరంబ్రహ్మముగా నంగీకరింపరా?

పండి—అంగీకరింపము.

అన్నం—అట్లేని నారాయణపరంబ్రహ్మ అనువాక్యము మీాకు ప్రాణాంతకరమే. నారాయణుఁడు ఉపాసకుడు అనుచుంటిరి. పరబ్రహ్మత్వము నొప్పరైతిరి. ఇఁక మీాకు నారాయణపరబ్రహ్మ యనువాక్య మెట్లుకుదురును ?

పండి—ఉపాసకుఁడు జీవుఁడేయైనను ఉపాసనయందు నేనేపరబ్రహ్మము నని పరమేశ్వరు నుపాసింపవలయునని వేదాంతములు బోధించుచున్నవి. అహంబ్రహ్మాస్మి మొదలగు వేదాంత వాక్యములు అభేదోపాసనము నె బోధించుచున్నవిగదా: వేదాంతములు ఉపాసనావిధిపదములుగావున తత్త్వమసి అహంబ్రహ్మాస్మి మొద

లగు నుపనిషత్తులు దెలిపిన యద్వైతభావము ఉపాసనా కాలిక మేయని శ్రీ నీలకంఠభగవత్పాదులవారు బ్రహ్మ మీమాంసా భాష్యమునందు నిర్ణయించియున్నారు. దాననె శ్రీహరదత్తా చార్యులవారును శ్లో॥ అద్వైతమాగమశిరోభిరుపాసనాయా ముక్తంతిదేవ పరమార్థతయానవాచ్యం । ఉపాసనా కాలము నందు ఉపాస్యోపాసకులకు భేదములేదని వేదాంతములు తెలుపు చున్నవి. అంతమాత్రమున నాయద్వైతము పారమార్థికమని చెప్పఁగూడదు. అని తెలిపియున్నారు. సూ॥ ఆత్మేతితూప గచ్ఛంతి గ్రాహయంతిచ॥ అను సూత్రమునకు వ్యాఖ్యానము చేయునప్పుడు ఉపాసకుఁడు నేను పరబ్రహ్మమునెయని యుపా సింపవలయునని భాష్యకారులవారు నిర్ణయించిరి.

అన్నం—ఇదిగో అద్వైతము పారమార్థికముగాదూ? ఈచర్చ కాగానే కుత్తుక పిసుకుదునుసుమా ? అదియుండనీ ! ఉపాసనా కాలము నందు నభేదభావమున్న నేమి ? దానింబట్టి యుపాసకుఁడు నేను పరబ్రహ్మమునని యభిన్నముగా నుపాసించుట విహితమైననేమి? నారాయణపరబ్రహ్మ అనువాక్యము మీ కెట్లుకుదిరినది ?

పండి—నారాయణమూర్తి నేను పరబ్రహ్మమునేయని పరమేశ్వరు నుపాసించునప్పుడు ఉపాసకుడు గౌణముగా పరబ్రహ్మము గాలేదా? సిద్ధాంతమునందు "నారుద్రోరుద్రమర్చయేత్, తాను రుద్రుడుగానిది రుద్రుని నారాధింపగూడదు. అనికలదు. కావున పరమేశ్వరు నారాధించునప్పుడుగాని ధ్యానించునప్పుడు గాని యేను పరమేశ్వరుడననియే భావించి ధ్యానించుచుండ వలయు. దాననే శ్రీహర దత్తాచార్యులవారు,

శ్లో॥ బ్రహ్మాచ్యుతేపరమసౌ పరమంచలిత్వం
జ్యోతిఃపరంచ పరమేశ్వర పద్మనాభః ।

త్వద్భావనైకరసికస్త్వదనన్యభావా
న్మంత్రోయథాగరుడభావనయా గరుత్మాన్ ॥

గరుడమంత్రోపాసకుడు గరుడుని భావించుటచే తానేగరుత్మంతుఁడగును. గరుత్మంతుఁడగుననగా రెక్కలు వచ్చుననిగాదు. సర్పములు గరుడునిజూచి భయమొందినట్లు గరుడమంత్రోపాసకుని గాంచియు భయమొందుట యనుభవసిద్ధము. అట్లే శ్రీమన్నారాయణమూర్తియు నేను పరబ్రహ్మమునేయని పరమేశ్వరు నుపాసించుటచే పరబ్రహ్మమనియు పరంజ్యోతియనియు పరతత్త్వమనియు చెప్పఁబడుచున్నాడు, ఇట్లు నారాయణమూర్తికి శ్రుతిచెప్పిన పరబ్రహ్మత్వాదులు ఉపాసనాసిద్ధములని యేర్పడుచున్నవి.

అన్నం—నారాయణునకు పరబ్రహ్మత్వాదులు పరబ్రహ్మధ్యానము వలననె వచ్చినవనుటకు దగుప్రమాణమేమి

పండి—నారాయణమూర్తి పరమేశ్వరోపాసకుఁడనుటకు ననేకప్రమాణములు గలవు.

ప్రతి—ఇతర ప్రమాణములతో పనిలేదు. నారాయణమునందు నారాయణమూర్తి యుపాసకుఁడని చూపింతురేమో యడుగుడు

పండి—వలయుచో నందె కనఁబరుతును.

అన్నం—అట్లు కనపరచెదరేని మీరుచెప్పినది సిద్ధాంతమే

పండి—ఆయను వాకమునందె నారాయణపరోధ్యాతా। పరనారాయణుఁడు ధ్యానము చేయువాడు అనియున్నదిగాని ధ్యేయుఁడని చెప్పబడియుండలేదు. అట్లుపరమేశ్వరుని ధ్యానము చేయుటనే పరమేశ్వర ధర్మములగు పరబ్రహ్మత్వాదులు నారాయణమూర్తికి గలిగెనని శ్రుత్యభిప్రాయము విశదమగుచున్నది.

ప్రతి—హి హి హి! ఈ వాక్యమేనా? నారాయణునకు నుపాసకత్వమ
నిరూపించునది. దీనియర్థమిదికాదు.

అన్నం—అదియేదో త్వరగాఁ జెప్పుడు.

ప్రతి—నారాయణ పరో ధ్యాతా అనుచోట నారాయణాత్పరో ధ్యాత
అని పంచమీ సమాసము. దీనింబట్టి నారాయణుని కంటె
పరుఁడు అనగా నితరుఁడై ధ్యానముచేయువాఁడు అనియర్థమ
నారాయణమూర్తియె యుపాసకుఁడని యెట్లు తేలును?

పండి—నారాయణ పరంబ్రహ్మ ఈ మొదలగు వాక్యములయంద
నారాయణుఁడే పరబ్రహ్మమని సమానాధికరణ సమాసమ
చేసి, నారాయణ పరో ధ్యాతా, అనువాక్యమునందు నారాయ
ణునికంటె పరుఁడే ధ్యానముచేయువాఁడని పంచమీ సమా
సము చేయునెడ శ్లో॥ యత్రాప్యే శ్రూయతేయచ్చ తత్ర
దృగవగమ్యతే॥ అను న్యాయమునుబట్టి ప్రాయపాఠ విరోధమ
వచ్చును. కనుక, నారాయణుఁడే ధ్యానముచేయువాఁడ
చెప్పితీరవలయు. ఇదియిష్టములేక నారాయణునికంటె ని
రుఁడై ధ్యానముచేయువాఁడని పంచమీసమాసమె చెప్పఁదల
చినచో నారాయణ పరంబ్రహ్మ, ఈ మొదలగు వాక్యము
యందును నారాయణునికంటె పరమైనదె బ్రహ్మము నారాయ
ణునికంటె పరమైనదె తత్త్వము నని మొదలుగానె యంగీకరిం
పక విధిలేదు. ఇందేయర్థము నంగీకరించినను మాకిష్టమే.

అన్నం—ఆచార్యులవారూ, ఈ రెండర్థములు మీకు ననుకూలముగ
లేవు. ఈ శ్రుతికి మూడవయర్థమేమైన గలదా? నారాయణ
పరంబ్రహ్మ అన్నశ్రుతియె మీకు సాధకము కాదయ్యెనేమి

ప్రతి—ఇంకెన్నో శ్రుతులుగలవు.

అన్నం—వానిని జనువుఁడు.

ప్రతి—ఏకో హవై నారాయణఆసీత్॥ నబ్రహ్మ, నేశానః, నేమే ద్యావా పృథివీ, శక్రిశ్చ నారాయణః, సూర్యశ్చనారాయణః,

ఈవిధమున నెన్నోగలవు. ఇందు ఏకో హవై అను శ్రుతిసృష్టికి పూర్వము నారాయణమూర్తి యొక్కఁడె యున్నాఁడను నర్థమును బోధించుచున్నది. దానింబట్టి నారాయణుఁడె సర్వజగత్కారణుఁడని స్పష్టమగు చున్నది.

అన్నం—ఆరాధ్యులవారూ, ఏకో హవై అనుశ్రుతికి మీరేమి చెప్పెదురు?

పండి—ఏకో హవై అనుశ్రుతి ఆచార్యులవారికి సాధకముగాదని చెప్పెదును.

అన్నం— అదియెట్లు?

పండి—ఏకో హవై అనువాక్యమున, ఆసీత్ అనియున్నది. ఆసీత్ అను పదమునకు, స దేవసో మ్యేదమగ్రఆసీత్ ఈ మొదలగుచోట్ల ఉండెను అని యర్థము గ్రహింపఁబడుచున్నది. శక్తేరాసీత్ప రాశరః ఈ మొదలగు స్థలములయందు శక్తికి పరాశరుడు పుట్టెనని యర్థము గ్రహింపఁబడుచున్నది. దీనింబట్టి ఏకో హవై అను శ్రుతివాక్యములోని ఆసీత్ అనుపదమునకు ఉండె ననియర్థమూ లేక పుట్టెననియర్థమూ అనివిమర్శింప శ్రుత్యంత రములనుబట్టి పుట్టెనను నర్థమే గ్రాహ్యమగును.

అన్నం—ఆశ్రుత్యంతరములెవ్వి ?

పండి—"జాతోబృహన్నభి పాతిత్నతీయం" నమోవిష్ణవేబృహ తేకరోమి యీ మొదలగుచోట్ల బృహత్పదము విష్ణువందు వినియోగింపఁ బడుచున్నది. బృహత్ బృహత్పదవాచ్యుఁడగువిష్ణువు జాతః=

పుట్టినవాఁడై, తృతీయం = మూఁడవలోకమును, అభిపాతి= పాలించుచున్నాఁడు. బ్రహ్మావిష్ణు రుద్రేంద్రాస్సంప్రసూయన్తే, బ్రహ్మ విష్ణు రుద్రేంద్రులు పుట్టింపఁబడుచున్నారు. ఈ మొద లగు శ్రుతులయందు విష్ణువు పుట్టినట్లు స్రువపడియున్నది. దానింబట్టి ఏకోహవై నారాయణఆసీత్ = ముందుగానారాయ ణుండొక్కఁడు పుట్టెను. నారాయణాద్బ్రహ్మాజాయతే = తరు వాత నారాయణునివలన బ్రహ్మపుట్టెను. నారాయణాద్రుద్రో జాయతే=నారాయణునివలన రుద్రుఁడుపుట్టెను. అనియర్థము.

ఏకల్పమునందు పరమేశ్వరునివలన మొదట నారాయణ మూర్తి జన్మించి తాను బ్రహ్మరుద్రులఁబుట్టించెనో ఆకల్పముయొక్క వృత్తాంతమును శ్రుతి దెల్పుచున్నది.

ఏకల్పమునందు పరమేశ్వరునివలన త్రిమూర్తులుజన్మించిరో ఆకల్పవృత్తాంతమును బ్రహ్మవిష్ణురుద్రేంద్రా స్సంప్రసూయన్తే। అని యథర్వశిఖ దెలుపుచున్నది. పరమేశ్వరునివలన త్రిమూర్తులు నెప్పుడు బుట్టిరో అది ఆదిసర్గమనియు,

నారాయణమూర్తితాను బ్రహ్మరుద్రులకంటె నధికుండగు నట్లు పరమేశ్వరునివలన వరముగైకొని యేకల్పమునందు తాను మా త్రము పరమేశ్వరునివలన ముందుబుట్టి తానె బ్రహ్మరుద్రుల బుట్టించెనో అది అవాంతరకల్పమనియుపురాణములయందునిర్ణయింపఁబడియున్నది

పరమేశ్వరుని వలన త్రిమూర్తులు జన్మించినదియే ఆదిసృష్టి యనియు, పరమేశ్వరుని వలన ముందుగానొక్కరుబుట్టి యాయొక్కరు వలన కడమ యిర్వురు జన్మించినది, యవాంతరసృష్టియనియు న్యాయ సిద్ధంబు నగుచున్నది.

నారాయణమూర్తివలన బ్రహ్మరుద్రులు మాత్రమే పుట్టినట్లు శ్రుతిచెప్పినదికాని త్రిమూర్తులు జన్మించినట్లు లెందును చెప్పియుం

లేదు. కావున శ్రుత్యంతరములను బట్టియు, పురాణోప బృంహణము లను బట్టియు, "ఏకో హవై నారాయణ ఆసీత్" అనుచోట నారా యణమూర్తి-యొక్కఁడే పుట్టెనను అర్థమే సిద్ధించుచున్నది.

అన్నం—ఆచార్యులవారూ? ఇచ్చట మీరేమి చెప్పెదరు.

ప్రతి—విరుద్ధవాదమున నేమి చెప్పనలయు

అన్నం—పోనిండు వేదమునం దెచ్చట నేని మీ దేవతల రూపమెట్లు చెప్పఁబడియున్నదో తెలుపుడు.

ప్రతి—నామములను దెల్పు శ్రుతులను విమర్శించినది చాలదా.

అన్నం—ఆరాధ్యులవారూ? ఆచార్యులవారు విసుకుజెంది యున్నారు. గాన ముందు మీరు తెలుపుడు.

పండి—కైవల్యమునందు 1 ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం॥ పార్వతీదేవితోఁ గూడినవాఁ డనియు, మూఁడుకన్నులు గలవాఁడనియు నల్లని కంఠము గల వాఁడనియుఁ జెప్పఁబడియున్నది.

ప్రతి—కైవల్యము దశోపనిషత్తులలోఁ జేరదు గాన దానిని ప్రమాణ ముగా మేమంగీకరింపము.

పండి—దశోపనిషత్తులలోఁ జేరని వానిలోనె నారాయణమూర్తి రూపమును దెల్పువాక్యము నొక్కటి వినిపింపుడు,

ప్రతి—అనేకమున్నవిగాని యట్టివాక్యము మాదుపస్థితిలో లేదు.

పండి—వాడుకలోనున్న యుపనిషత్తులలో నారాయణుని రూపము చెప్పువాక్యము లేనట్లేగదా ?

అన్నం—అట్లేని దశోపనిషత్తులలో మీమీ దేవతారూపములను వివ రించు వాక్యములను దెలుపుడు.

పండి—అట్లే తెలుపుదును. నారాయణమునందు॥ఋతగ్ంసత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగళం। ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వైనమోనమః ॥

కృష్ణపింగళుండు ఊర్ధ్వరేతస్కుఁడు, విరూపాక్షుఁడు, నని పరమేశ్వర దివ్యవిగ్రహ ముపదేశింపఁబడియున్నది.

అన్నం—ఆచార్యులవారూ, ఊరకున్నారేమి ?

ప్రతి—ఉపాసకునియొక్క స్తోత్రార్థమై రుద్రునిరూపము వివరింపఁబడెను. గాని ఉపాస్యుండగు నారాయణమూర్తి యొక్క దివ్యవిగ్రహమైననో ప్రసిద్ధమె గాన దానిని వివరింప నవసరము లేదుగాన నది యిచ్చట చెప్పబడలేదు.

అన్నం— ఇచ్చటచెప్పఁబడకపోనీ దశోపనిషత్తులలో మతియొక్కచో నెందేనింగలదా ?

ప్రతి—దశోపనిషత్తులలో లేకున్ననేమి ?

అన్నం—కడమయుపనిషత్తులలో లేకున్నమానెగాని నారాయణమున లేకుంటయె విచారకరము.

ప్రతి—అదియేల ?

అన్నం—నారాయణము నారాయణపరమని మీవారభిమానించియున్నారుగదా. అంతే నారాయణస్వరూపము వివరింపఁబడలేదేమి ?

పండి—దేవుని నడుగవలసిన యాప్రశ్నము నాచార్యులవారినడిగిన నేమిలాభము ?

ప్రతి—భట్టాచార్యులవారి ప్రశ్న సరియైనదిగాదు. ఏలన, వేదములన్నియు నారాయణపరములేయని మామతమున నంగీకరించియున్నారు. నారాయణరూపము.

వివరింపనిమాత్రన నారాయణ పరముగాక పోవుననుట యుక్త మగునా?

అన్నం—నారాయణుని నామరూపములు లేకుండనే వేదములన్నియు నారాయణ పరములేయని మీలోమీరు మురియుచుందురు గాబోలు?

ప్రతి—నారాయణమునందు నారాయణ నామములు కలవుగదా? నారాయణ పరమనుటకు సంశయమేమి?

పండి—నారాయణమునందు నారాయణుని నామములుమాత్రమున్నవి పరమేశ్వరుని నామములు రూపంబును గలదు. దీనింబట్టినారాయణము నారాయణపరమనుట న్యాయ్యమో పరమేశ్వరపరమనుటన్యాయ్యమో విమర్శింపుడు.

అన్నం—అందుపరమేశ్వరుని నామంబులు రూపంబును రెండును గలవుగాన పరమేశ్వర పరమనుటయే న్యాయ్యమని స్పష్టమగుచున్నది.

ప్రతి—ఉపాస్యరూపము ప్రసిద్ధమేగాననది యందు దెలుపలేదనియు, ఉపాసక రూపము స్తోత్రార్థమై యావశ్యకముగాననది యందు వివరింపఁబడియెననియు లోగడనే తెలిపియుంటిని గదా?

అన్నం—ఆరాధ్యులవారూ, ఆచార్యులవారు చెప్పినది సహేతుక మగునా?

పండి—శ్రుతియందు స్తోత్రార్థమై యుపాసక రూపమే దెలుపనావశ్యకమనియు, యుపాస్యుఁడగు నారాయణునిరూపము ప్రసిద్ధమేగాన నదిదెలుప నావశ్యకము లేదనియు వీరుచెప్పుచున్నారు. ఇది యొంతయు తృప్తికరముగాలేదు. ఏలన, సాధకు లుపాసించుటకై యొండైన నుపాస్యరూపమె దెలుప నావశ్యకమగు గాని యుపాసకుని రూపమావశ్యక మెన్నటికిగానేరదు. నారాయణ

స్వరూపము ప్రసిద్ధమని మాటమాత్రము చెప్పుచున్నారుగాని ప్రామాణికములైన శ్రుతులలో నొక్కచోనైన నారాయణ రూపమును దెలుపు వాక్యమును వీరు కనబరచి యుండలేదు. దీనింబట్టి నారాయణరూపము శ్రుతిప్రసిద్ధముగాదు. ఇది యుపాస్యరూపముగాదు గానన నారాయణమునందు వివరింపఁ బడలేదు. ఉపాస్యరూపముగాననే పరమేశ్వరుని దివ్యవిగ్రహ మందు నుపదేశింపఁబడియెను. కావున నారాయణము పరమేశ్వ రునే సర్వోపాస్యునిగా నిర్ణయించుచున్నదని స్పష్టమగుచున్నది.

అన్నం—ఆచార్యులవారూ, నారాయణోపనిషత్తు ఈశ్వరపరమగు చున్నది. నారాయణ పరమనుటకేమైన సాధకమున్నచో త్వరితముగా దెలుపుడు.

ప్రతి—ఇతరకారణములతో నేమి? అది నారాయణపరము గాననే దానికి నారాయణమని పేరుగలిగెను. అది కాదన నేరితరము.

అన్నం—బళీ, ఆచార్యులవారూ, చెప్పినచో నిట్టి గట్టిహేతువునే చెప్ప వలయు. ఆరాధ్యులవారి శక్తి యిప్పుడుగదా చూడవలయు. ఆరాధ్యులవారూ, ఆచార్యవారు చెప్పినది విన్నారుగదా? దీనికి సరియైన సమాధానముకలదా? లేక, వారి సిద్ధాంతమునె గ్రహింతురా?

వండి—సమాధానములేనిచో సంతకన్న చేయునదేమిగలదు? నారా యణమను సంజ్ఞకుఁ గారణమువినుడు. సూత్రకారులు, నారా యణ దృష్టేన పురుషసూక్తే నోపచితాంచితి మభ్యర్ధమాన ఇహాజన్మని పురుషోభవతి॥ అనుటచే నాయుపనిషత్తునకు నారా యణుఁడు ద్రష్టయని తెలియుచున్నది. ఆమంత్ర భాగమున గనిపెట్టినవాఁడు నారాయణుఁడుగాన దానికి నారాయణ మని పేరువచ్చెనని ఋషులు నిశ్చయించియున్నారు గాన నింద

ప్రతిపాద్యుడు నారాయణమూర్తి యయినందున దీనికి నారా యణమని పేరువచ్చెననుట ఋషిసమ్మతముగాదు. కావున, నారాయణమని పేరున్నమాత్రమున నారాయణ పరమను కొనుట కేవలము భ్రాంతియేయగును.

అన్నం—ఆచార్యులవారూ? నారాయణోపనిషత్తే నారాయణపరము కాదయ్యెను. వేదములన్నియు నారాయణపరములనుటయెట్లు?

ప్రతి—అదియెట్లుగాదు? శ్లో॥ వేదాదిర్వేద మాతాచ పౌరుషంసూక్త మేవచ। తథాభాగవతం చైవద్వాదశాక్షర ఏవచ॥ అని ప్రణ వము. గాయత్రి, పురుషసూక్తము, శ్రీభాగవతము, ద్వాద శాక్షరము మొదలగునవి నారాయణపరములని పెద్దలు నిర్ణ యించియున్నారు. ప్రణవము, గాయత్రి మొదలగునవి నారాయణపరములుగాన దానింబట్టి వేదములును నారాయణ పరములేయని యేర్పడితీరును.

అన్నం—ప్రణవము, గాయత్రియు నారాయణపరములని నిర్ణయించి నారా?

ప్రతి—అవును.

అన్నం—ముందు ప్రణవము నారాయణపరమని యెట్లు నిర్ణయించిరో దెలుపుడు.

ప్రతి—వారాహమునందు॥ యస్త్వం వందే విష్ణుమోంకారవాచ్యం॥ అని యున్నదిగాన విష్ణువే ఓంకార వాచ్యుఁడని యేర్పడుచున్నది.

అన్నం—ఆరాధ్యువారూ? మీయభిప్రాయము చెప్పుడు.

పండి—శివపురాణమునందు ప్రణవో వాచకస్తస్య శివస్య పరమాత్మ నః॥ ప్రణవము శివునకు వాచకమనియున్నది గానశివునినే చెప్పు నని యేర్పడుచున్నది.

అన్నం—ప్రణవము నారాయణుని జెప్పునని విష్ణుపురాణమునను న్నది. శివుని జెప్పునని శివపురాణమున నున్నది. ఇక దేనినిబట్టి నిర్ణయము తేలవలయును? శివకేశవులిద్దరు ప్రణవ వాచ్యులేయని యొప్పుకొనరాదా?

ప్రతి—నడుమనడుమ మీసిద్ధాంతము దేనికి? నిర్ణయమునకు దగిన సాధనములు లేకపోలేదు.

అన్నం—అట్లేని యదియెట్లో నిరూపింపుడు.

ప్రతి—వేదము నారంభించునపుడు 'హరిః ఓం' అని యారంభించుచున్నారు, కావున, ఓమనునదియు హరినామ మేయని యేర్పడుటలేదా?

పండి—హరిః ఓం అని కొందఱు వేదమునారంభించినను మఱికొందఱు హరిః ఓం అనియె ఆరంభించుచున్నారు. కావున నదిసాధకము గాదు. వేదారంభమున హరిః అనుడని యెందున్నది?

ప్రతి—వేదము చదువువారందరు హరిః యనియే అనుచున్నారు. ఇట్టి శిష్టాచారమునకు ప్రమాణము దేనికి?

పండి—అశాస్త్రీయమగు విధిననుష్ఠించువారు శిష్టులనుట యెట్లు?

అన్నం—మేమందఱము 'హరిః ఓం' అనియే వేదారంభము సేయుచున్నాము. ఇది యశాస్త్రీయమా! అశిష్టాచారమా?

పండి—అట్టులారంభింపుడని యెందున్నదో మీరె చెప్పుడు.

అన్నం—ఏమని యారంభింపుమని యున్నదో మీరుచెప్పరాదా?

పండి—శ్లో॥ వేదస్య ప్రణవంకుర్యాం దాదావంతే చసర్వదా॥ వేదమునకు నాదియందును నంతమునందు ప్రణవము నుంచవలయునని యున్నదికాని హరిః అనిమని యెందున్నది?

అన్నం—వేదారంభమున హరిః అనుమనువిధి లేకపోనీ? హరిభక్తులు హరిః అనియు, హరభక్తులు హరః అనియు నుచ్చరింతురు గాక. దీనం దప్పేమి?

పండి—ఇదితప్పని యెవ్వరు చెప్పిరి? వేదారంభమునందు 'హరిః ఓం' అనుటంబట్టి ప్రణవము హరినామమని యాచార్యులవారు సాధింపం జూచుటచే నదిప్రమాణ సిద్ధము కాదంటిని.

అన్నం—ప్రణవము విష్ణువాచకమనుటకు నది సాధకముగాదు. శివ విష్ణు పురాణవచనములు పరస్పరవ్యాఘాతము నొందెగాన నవియు సాధకములుగావు. కాన మీసిద్ధాంతమునకు సాధకమగు ప్రమాణాంతరము నెద్దాని నేని కనంబరుచుము.

పండి—పాతంజల యోగసూత్రమునందు॥ క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః॥ తస్యవాచకః ప్రణవః॥ అను సూత్రములయందు ప్రణవమీశ్వరవాచకమని నిర్ణయింపంబడి యున్నది. దానింబట్టి ప్రణవము శివవాచకమేయని నిర్ధారణమగుచున్నది.

ప్రతి—ఈశ్వరశబ్దము భాగవతాదులయందు శ్రీ మహావిష్ణునందును ప్రయోగింపబడియున్నది. లోకమున రాజునుగూడ దెలుపును. ఇట్టులుండ నీశ్వరవాచకమన్నమాత్రాన శివునిబోధించుననుటయెట్లు?

అన్నం—ఈశ్వరశబ్దము కేవలము శివునినే బోధించుననుట యంత యుక్తియుక్తముగాదు,

పండి—అదియేల? యస్మిన్నీశ్వర ఇత్యనన్యవిషయశ్శబ్దో యథార్థాక్షరః అనియు, ఈశ్వరఇత్యుచ్చైస్సార్ధచంద్రం బిభర్తియః॥ అనియు మహాకవి కాళిదాసుడు ఈశ్వరశబ్దము శివునిదప్ప వేరొకనిబోధింపదనినిర్ణయించియున్నాడు. ఈశ్వరశ్శర్వ ఈశానః

అని మొదలుగా నిఘంటుకారులును నీశ్వరపదము శివునందు రూఢమని నిర్ణయించియున్నారు. ఇట్లుండగా నీశ్వరపదము శివ వాచకమనుటకు సంశయమేమి ?

అన్నం—ఈశ్వరపదము శివునందు రూఢమేయగుచో భాగవతాదుల యందు విష్ణునందు, ప్రభ్వాదులయందును నెట్లుప్రయోగింప బడును? అది వారినెట్లు బోధించును?

పండి—అదియేమియు బాధకముకాదు. ఈశ్వరపదము ప్రకరణాదులను బట్టి కొన్నిచోట్లయౌగికముగా నారాయణాదులను బోధించినను అంతమాత్రమున లోకవేద సిద్ధమగుశివవిషయక రూఢిని విడువనేరదు, అట్టి రూఢిని విడిచెనేని కాళి దాసాది మహా కవులు, నిఘంటు కర్తలును నప్రామాణికులె కావలసి వత్తురుగదా?

అన్నం—ఈశ్వరపదము శివవాచకమె యగుగాక, ఇంత మాత్ర మున ప్రణవార్థమెట్లు నిర్ణీతమగును?

పండి—తస్యవాచకః ప్రణవః॥ ప్రణవమీశ్వర వాచకమని పతంజలి మహర్షి చెప్పెను. ఈశ్వర పదము శివవాచకమగు నెడ ప్రణ వము శివవాచకమే యని యేర్పడదా?

అన్నం—ఇదిగాక శ్రుతి యందెక్కడనైన ప్రణవార్థము నిర్ణ యింపఁ బడి యుండలేదా?

పండి—నిర్ణయింప బడకేమి? అథర్వశిఖయందు॥ మహేశ్వర మహా దేవాది నామములతో బాటు ప్రణవంబును శివవాచకమేయని నిర్ణయింపఁబడి యున్నది.

ప్రతి—అథర్వశిఖ దశోపనిషత్తులలోనిది కాదు, కావున నది ప్రమా ణము కాదు, కాబట్టె దానిని మేమంగీకరింపము.

అన్నం—దశోపని షత్తులలో చేరని యుపని షత్తులోనె ప్రణవము విష్ణువాచకమని మీరొక ప్రమాణము కనబరుపుడు.

ప్రతి—దశోపనిషత్తులలో జేరని యుపనిషత్తులో ప్రమాణమును వారు జూపించిన నెంతలాభమో నేనుజూపకున్న నంతియె లాభము. ప్రమాణము కానిదానిని జూపిననుజూపకున్నను నొక్కటేగదా?

అన్నం—వీరుచెప్పినది ప్రమాణము కాదనుచున్నారు. అట్టిదానిని మీరు చెప్పుడనిన చెప్పఁజాలకున్నారు. ఇదియెట్లున్యాయ్యము? దశోపనిషత్తులలో చేరనివి ప్రమాణము కావా?

పండి—దశోపనిషత్తులలో చేరనివి ప్రమాణము కావనుట తప్పు. శ్రీ శంకరాచార్య విద్యారణ్య ప్రభృతులు అధర్వ శిఖాదులకు భాష్యములు చేసియుండిరి. అధర్వ శిఖాదులు పురాణముల లో నుపబృంహితములై యున్నవి. దశోపనిషత్తులలో చేరనివి ప్రమాణము కావను నెడ వైష్ణవులకు పరమప్రమాణములైన సౌబాలోపనిషత్తు మొదలగునవి యెట్లు ప్రమాణములగును; ఇవియు గంగలో గలియుగదా?

అన్నం—ఆచార్యులవారూ? ప్రణవము విష్ణువాచకమని దశోపనిషత్తు లలో నొక ప్రమాణవచనము దెలుపుడు.

ప్రతి—ప్రణవము శివవాచకమని దశోపనిషత్తులలో ప్రమాణవచనము నారాధ్యులవారు కనబరచినారా?

అన్నం—మీకువారితో వంతేమి? ఆరాధ్యులవారు దశోపనిషత్తులలో చేరనివియు ప్రమాణములేయని యొప్పుదురుగాన దశోపని షత్తులలో చేరనివానిలో చూపించినారు. మీరైననో దశోప నిషత్తులు మాత్రమే ప్రమాణమంటిరిగాన దశోపనిషత్తులలోనె కనబరచవలయు.

అన్నం.—యో దేవ స్సవితాస్మాకం, అను స్మృతివచనము మేము చెప్పునర్థమునకు సాధకముగా నున్నది. గాన నిందు వ్యధికరణ దోష మున్నను నంగీకరింప దగినదే.

పండి.—అస్మృతివచనమున జెప్పఁబడిన యర్థమునందు క్లిష్టాన్వయము మఱియొకగొప్పదోషంబును గలదు.

అన్నం.—అది యెట్లు?

పండి.—యచ్ఛబ్దమునకు, తచ్ఛబ్దమునకును నిత్యసంబంధముగలదని శాస్త్రజ్ఞు లందఱు నంగీకరించియున్నారు. గాయత్రిమంత్రము నందు, తచ్ఛబ్దమొక్కటియు, యచ్ఛబ్దమొక్కటియు గలదు గాన నీరెంటికి మాత్రమే సంబంధముగలిపి యన్వయించుట యుచితము. గావున మేము చెప్పినసమన్వయమునందు ఏభర్గుడు మాబుద్ధులను ప్రేరణచేయునో. ఆబ్రహ్మమునే ధ్యానము చేయుచున్నామని వచింపఁబడియెను.

ఇఁక, యో దేవ స్సవితాస్మాకం అను శ్లోకమున జెప్పఁబడు నర్థమునందైననో, ఏసూర్యుఁడు మాబుద్ధులను ప్రేరణచేయునో, ఆసూర్యునియొక్క యనుటకై మూలములోనున్న యచ్ఛబ్దమునకును మూలములోలేనిదే కల్పింపఁబడిన (తస్య, అను తచ్ఛబ్దమునకును, మూలములోనున్న తత్, అను, తచ్ఛబ్దమునకు, ఆసూర్యునియొక్క యేతేజస్సు గలదో, ఆతేజమును, అనుటకై (యద్భర్గః, అను మూలములోలేనిదే కల్పింపబడిన యచ్ఛబ్దమునకును సంబంధము గలిపియన్వయింపఁబడియున్నది, మంత్రమూలమున నున్న యత్తచ్ఛబ్దములకు సంబంధము త్రెంచివేయుటయెగాక, మూలమున లేని పదముల నధ్యాహారము చేసి యన్వయించుటంబట్టి యాయర్థము క్లిష్టము, గౌరవము మొదలగు దోషములు గలదై యున్నది.

అన్నం.—యో దేవ స్సవితాస్మాకం అనునది స్మృతివచనము. స్మృతులు మహర్షులు చెప్పినవి. శ్లో॥ ఋషిభి ర్నిశ్చి తేత్వర్థే కాశంకాస్యా న్మహాత్మనాం॥ మహర్షులు నిర్ణయించి చెప్పిన యర్థమునందు సంశయ ముండ గూడదు. గావున, భర్గశబ్దమును సకారాంతముగా గ్రహించి, స్మృతివచనము ననుసరించి మేము చెప్పిన యర్థము నిర్దోషమే యగును. గాన దీని యందు క్లిష్టత్వాదిదోషములు గలవని శంకింపఁగూడదు.

ప్రశ్రి.—గాయత్రిలోని భర్గశ్శబ్దము సాంతమని తేలినది. దీనింబట్టి శైవసిద్ధాంతంబును సాంతమైనట్లే.

పండి.—వేగిరపడకుడు. భట్టాచార్యులవారూ! మీరు చెప్పినట్లు 'యో దేవస్సవితా' అను శ్లోకము స్మృతివచనమే అయినను, ఇది శ్రుతివిరుద్ధముగా నున్నదిగాన, ఇది ప్రమాణము గానేరదు,

అన్నం.—శ్రుతివిరోధమేదో తెలుపుడు.

పండి.—తలవకారి బ్రాహ్మణమునందు, ద్వితీయో భర్గమయః పాదః అని యున్నది. గాయత్రిలోని భర్గపదము సకారాంతమే యగు నెడ 'భర్గోమయః' అని యుండవలెనుగాని భర్గమయః అని యుండగూడదు.

ఇదిగాకఁ మైత్రేయోపనిషత్తునందు॥ బుద్ధయో వై ధియస్తా యోస్మాకం ప్రచోదయా దిత్యాహుః బ్రహ్మవాదినోఽథ భర్గఇతి సోహవా అస్మిన్నాదిత్యే నిహిత స్తారకేఽక్షిణి చైషభర్గాఖ్యః భాభిర్గతి రస్యహీతి భర్గః, భర్గయతీతి వైష భర్గఇతి, రుద్రః అనియు, త్రిపురాతపనమునందు॥ భర్గోదేవస్యధీమహీ త్యాధారరూపశివాఖ్యం గమ్యతే భర్గోదేవస్యధీమహీ త్యేవం వ్యాఖ్యాస్యామః అని యారంభించి భగవాన్పరమేశ్వరో భర్గోదేవః, అని నిర్ణయింపఁబడియున్నది. దీనింబట్టి

పెక్కు శ్రుతులయందు భర్గశబ్దము అకారాంతమే యనియు, దానికి నర్థము శివుఁడే యనియు నిర్ధారణము చేయఁబడియున్నది.

ఇట్లు శ్రుతులయందు, గాయత్రీమహామంత్రములోని భర్గశబ్దము అకారాంత మనియు, దానికినర్థము శివుఁడేయనియు నిర్ణయింపఁబడి యుండగా, భర్గశబ్దము సాంతమనియు, దానికి నర్థము తేజమనియుఁ జెప్పిన స్మృతివచనము శ్రుతివిరోధమువలన నప్రమాణమగునని స్పష్టమగుచున్నది. ఎట్లన,

శ్రుతియందు, ఔదుంబరీం స్పృష్ట్వోద్గాయేత్, మేడికొమ్మను దాకి సామగానము చేయవలయునని యుండగా, ఔదుంబరీ సర్వా వేష్టయితవ్యా, మేడికొమ్మకు నంతకును వస్త్రముచుట్టవలయునని స్మృతియందుగలదు. మేడికొమ్మకు నంతకు వస్త్రము చుట్టునెడ సామముపాడునప్పుడు దానిని దాకుట సంభవింపదు. దీనింబట్టి యీస్మృతివచనము శ్రుతివిరుద్ధ మనియు, శ్రుతివిరోధమువలన నీవచన మప్రమాణమనియు పూర్వమీమాంసయందు నిర్ణయింపఁబడి యున్నది. ఆన్యాయమునుబట్టి యో దేవ సవితా అను స్మృతివచనంబును శ్రుతివిరోధమువలన నప్రమాణమేయని యేర్పడుచున్నది. ఈవిమర్శ ముంబట్టి భర్గశబ్దము సాంతమనువాదమే సాంతమైనది,

అన్నం—ఆచార్యులవారూ! భర్గశబ్దము సాంతమని తేలిన దనియు, దానింబట్టి శైవసిద్ధాంతమే సాంతమయ్యెననియు నంటిరే. దానిని మీరు సాధించుకొనుడు.

ప్రతి—భర్గశబ్ద మేయంతమైన నగుగాక, శైవసిద్ధాంతము సాంతముసేయు టెంతపని?

అన్నం—అదియైన నొకటి తేలనిండు.

ప్రతి—గాయత్రి శివపరమనుట యెట్లును సంభవింపదు,

అన్నం—భర్గశబ్దమునుబట్టి శివపరమేయని తేలలేదా?

ప్రతి—అంతమాత్రమున నెట్లు తేలును?

అన్నం—ఎట్లు తేలదు?

ప్రతి—మైత్రాయణీయమునందే, భర్గాఖ్యం విష్ణుసంజ్ఞం అని యున్నది దీనింబట్టి భర్గపదమకారాంతమైనను నది విష్ణువాచకమేయని స్పష్ట మగుచున్నది,

అన్నం—ఆచార్యులవారూ? ఇట్టిప్రమాణములను దాచియుంచికొనిన నేమిలాభము? ఈవచనము చాలబాగుగా నున్నది, ఆరాధ్యుల వారూ? భర్గపదమునకు నర్థము విష్ణువేయని మైత్రాయణీయ మునందే కలదట, ఆబ్రాహ్మణమునందే ఒకచోట భర్గశబ్ద మునకు శివుఁడనియు, వేరొకచోట విష్ణువనియు నర్థ మిన్ని విధములఁ జెప్పియుండగా నిందేది ప్రమాణ మగును? దానిం బట్టి, శివుఁడు, విష్ణువుగూడ భర్గశబ్దమునకు వాచ్యులే యని యొప్పికొని గాయత్రి యుభయపరమునని చెప్పుట న్యాయ్య ముగా గన్పట్టు చున్నది, దీనింబట్టి మాసిద్ధాంతమే ప్రామా ణికముగా నేర్పడుచున్నది, నిజ మిట్లుండ గాయత్రి శివపరమని యొక్కరు, విష్ణుపరమని వేరొక్కరు కలహించుచుంట యుచిత మగునా?

పండి—మాసిద్ధాంతములు నిల్వనప్పుడు మీసిద్ధాంతమే గ్రహింప వచ్చును,

అన్నం—మీసిద్ధాంతము లింకను నిల్చునను నాశ మీకు గలదా?

పండి—ఆశ యున్న నేమి? లేకున్న నేమి? కొంచెము నేపు మామా వాదములు వినుటకు మీకు నుత్సాహములేదా?

అన్నం—వినుటకేమి? బాగుగా విందును, ఇచట నిర్ణయ మెట్లో తేల్పుడు,

పండి—ప్రమాణవచనములలో నెట్టినైన చూడగానె పరస్పరవిరోధము కనుపించుట సంభావితము, అంతమాత్రమున నేదియు తేలదని

చెప్పి అంత యొక్కటె యనుట శాస్త్రసమ్మతము గాదు. ఇక నిచట 'భర్గాఖ్యం విష్ణుసంజ్ఞం' అనుదానికి సమాధాన మేమి యనిన వినుడు.

భర్గాఖ్యం విష్ణుసంజ్ఞం అనువాక్యము ప్రాత్యక్షికములైన శ్రుతులయందు గన్పట్టుట లేదు. దానింబట్టి యీవచనము గాయత్రి విష్ణుపరమని సాధించుకొనుటకు గొందఱచే గల్పింపఁబడినట్లే విశద మగుచున్నది.

అన్నం.—అట్లైని, గాయత్రి శివపరమనుటకు మీరు కనబరిచిన శ్రుతులును కల్పింపఁబడినవే యని వారు వచింపరా?

పండి.—ఉన్ననిజము చెప్పితిని, ఆవాక్యము నున్నదానిగా నంగీకరించినను బాధకము లేదు.

అన్నం.—అది యెట్లు?

పండి.—భర్గాఖ్యం అనువాక్యమునర్థము విమర్శించునెడ నది తేలును.

అన్నం.—విమర్శించుడు.

పండి.—భర్గాఖ్యం అనువాక్యమునకు నర్థ మేదో చెప్పుమనుడు.

ప్రతి.—ఈవాక్యమునకు నర్థము స్పష్టముగా గనఁబడుచుండ దీనిని విమర్శించున దేమున్నది? భర్గుఁడనే ఆఖ్యగలవాఁడు విష్ణుసంజ్ఞుఁడే యనియర్థము. ఇందేమి చిక్కుగలదో చెప్పనిండు.

పండి.—భర్గాఖ్యం విష్ణుసంజ్ఞం అనురెండుపదములలో అనువాద మేది? విధేయ మేది?

ప్రతి.—ఈరెంటిలో నేది యెట్లైన నేమి?

పండి.—ఈరెంటిలో మొదటిది అనువాదమైనచో భర్గుడనే ఆఖ్యగలవానికి విష్ణుసంజ్ఞ విధేయ మగును. దీనింబట్టి శివునకు విష్ణువను పేరుగూడ నున్నదనియే యేర్పడును.

ప్రతి—ఇందు రెండవదియె యనువాదమని యొప్పి విష్ణుసంజ్ఞగలవానికే భర్గుఁడనే పేరు విధింపఁ బడుచున్నదని యంగీకరింతుము.

పండి—అట్లే మీరంగీకరింతురుగాక అదిమాత్రము శాస్త్రసమ్మతము గాదు.

ప్రతి—అది యేల?

పండి—అనువాదవిధేయములలో నెటనైన మొదటిది యనువాదంబుగాను, చివరది విధేయంబుగాను నుండును. ఏలన, ఏదే నొకదాని ననూదించి దానికి వేరొకటి విధింపఁబడును. దీనింబట్టి యనువాదము ముందును విధేయము తరువాతను నుండుట యుచితము.

ప్రతి—ఇదియంతయు లోకములోని సంగతి. వేదమునం దైననో, ఛందసి బహుళం॥ అనుటచే సర్వము వ్యత్యస్తముగానె యుండును. గాన చివరదే యనువాదమని యంగీకరింపనగును.

పండి—ఛందసి బహుళం॥ అనగా వేదమునందు విభక్తులు కొన్ని యొకదాని కింకొకటి వచ్చునని యర్థముగాని సర్వంబును తలక్రిందేయని యర్థమా? కాసిందు. ఆవచనమునకు తలక్రిందుగానె యర్థము గ్రహించి భర్గుఁడనగా విష్ణువేయని మీరు విపరీతార్థము చెప్పఁబూనిసను పూర్వమీమాంస మీకు బాధకముగాక మానదు.

ప్రతి—పూర్వమీమాంస మాకెట్లు బాధక మగును?

పండి—పూర్వమీమాంసయందు, విప్రతిషేధే భూయసాం స్యాత్స్వధర్మత్వం॥ అని న్యాయము కలదు. రెండర్థములకు పరస్పర విరోధమువచ్చినప్పుడు ఎక్కువవాక్యములచేఁ జెప్పఁబడునదియే న్యాయ్యమని నిర్ణయింపఁబడియున్నది. భర్గాఖ్యం విష్ణుసంజ్ఞితం


... నది మొద...

చెప్పఁబడిన త్రిపురాతపన, తలవకారబ్రాహ్మణాది బహువిధ ప్రమాణములకు విరుద్ధముగా నున్నది గాన నీవాక్యమునకు బహ్వృతరవాక్యములకు ననుకూలముగా భర్గాఖ్యునకే విష్ణుసంజ్ఞయు గలదని యర్థము గ్రహించితీరవలయు. లేనిచో నీవాక్యమునకు ప్రామాణ్యమే లేకపోవును. కావున, భర్గశబ్దమునకు శివుఁడే యర్థమనుటయు, దానింబట్టి గాయత్రి శివపరమనుటయు వారింపతరము గానేరదు,

అన్నం—అచార్యులవారూ! మీరింక నేమైన జెప్పవలసినదియున్నదా? లేదా?

ప్రతి—లేకేమి? అనంతముగా కలదు. గాయత్రి శివపరమైనచో సర్వము శివపరమే యగునుగాన నది యెంతమాత్ర మంగీకరింపఁ దగినది గాదు,

అన్నం—ప్రమాణబలమునుబట్టి శివపరమేయని యేర్పడుచుండగా మన మంగీకరింపకున్న నేమి?

ప్రతి—గాయత్రి శివపరము గాదనుటకు నెన్నోప్రమాణములు గలవు,

అన్నం—అటులేని త్వరగా వెల్లడించుము,

ప్రతి—గాయత్రి శివపర మెన్నటికి గానేరదు,

పండి—ఏల?

ప్రతి—గాయత్రికి సావిత్రియని పేరుగలదు, సావిత్రియనగా, సవితృదేవతకు సంబంధించినది యనియర్థము, దాననే దీనికి సవితా దేవతా, అని చెప్పఁబడియెను, సవితు ర్దేవస్య అని యీమంత్రమునందే కలదుగదా?

పండి—ఇదంతయు నుండిననేమి?

ప్రతి—సూర్యపరమనిగదా తేలుచున్నది,

పండి— సూర్యపరమే ... [illegible]

ప్రతి—లేదు, లేదు.

పండి—ఇంక మీకేమిలాభము?

ప్రతి—సూర్యునకు నంతర్యామియైనవాఁడు నారాయణుఁడే కావున, శ్లో॥ ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః। కేయూరవాన్మకరకుండలవాన్కిరీటీహారీ హిరణ్మయవపుర్ధృతశంఖచక్రః॥ అని స్మృతికర్తలు చెప్పియున్నారు. దీనింబట్టి సావిత్రి నారాయణపరమని స్పష్టముగాలేదా?

పండి—ఈశ్లోకమున, నారాయణమూర్తిని సూర్యమండలమునందు ధ్యానము చేయవలయునని చెప్పఁబడియున్నది. ఇంతమాత్రమున సూర్యునకునంతర్యామి నారాయణమూర్తియేయని యేర్పడదు.

ప్రతి—ఏల యేర్పడదు?

పండి—ఉపాసనాప్రకరణమునందు సర్వదేవతలను సూర్యమండలమునందే ధ్యానము చేయవలయునని యున్నది. ఇంతమాత్రమున నీదేవతలందఱు సూర్యునకు నంతర్యాము లగుదురా? కారు. సూర్యునిమండలమైననో చాలపెద్దది. దానియందు నొకమూల నారాయణమూర్తియు ధ్యానింపఁబడనీ! దానిచే నేమిలాభము?

ప్రతి—సూర్యునకు నంతర్యామిని దేనినిబట్టి నిర్ణయింప వలయును?

పండి—సౌరమండలప్రస్తావమునందు సూర్యునకు నంతర్యామియగు దేవతకు నేయేలక్షణములుగలవని చెప్పఁబడియుండెనో దానిని బట్టి నిర్ణయింపవలయు.

ప్రతి—ఆదేవతకు నేమిలక్షణములు చెప్పఁబడియెను?

పండి—సఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషః, అనియు, హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వఏవ సువర్ణః అనియు మొద

లుగా, సూర్యమండలాన్తర్వర్తిపురుషుడు హిరణ్మయుడని చెప్పఁబడియున్నది, ఈలక్షణము నారాయణునందు నెట్లు పొసగును?

ప్రతి—ఏల పొసఁగదు?

పండి—నారాయణమూర్తి నీలవర్ణుఁడని ప్రసిద్ధముగాదా? నీలవర్ణుఁడు హిరణ్యవర్ణుఁ డనుటయెట్లు,

ప్రతి—శివునకుమాత్రము హిరణ్యరూపత్వ మెక్కడిది? ధవళదేహుఁ డనికదా? ప్రసిద్ధి కలదు,

పండి—శ్రీపంచాక్షరీధ్యానమునందు॥ ద్రుతకనకనిభం, అనియున్నది, అనగా, కరగినబంగార మేవన్నెతోనుండునో అట్టివన్నెగల వాఁడని యర్థము, దీనింబట్టి సూర్యమండలాన్తర్వర్తి పురుషుఁడు పరమేశ్వరుఁడని యేర్పడు చున్నది,

ప్రతి—అంతరాదిత్యవిద్యయందు॥ కప్యాసం పుండరీకమేవ మక్షిణీ॥ అనియున్నది. అనగా, సూర్యమండలమందున్న పురుషునకు సూర్యునిచే వికసించిన పుండరీకముతో తుల్యములగు రెండు నేత్రములు గలవని తెలియుచున్నది,

పుండరీకాక్షుఁడనుట శ్రీమన్నారాయణమూర్తికేగాక శివునకుఁ బ్రసిద్ధిలేదు, ఇదిగాక, రెండునేత్రములు గలవాఁడనియు సూర్యమండలాన్తర్వర్తి పురుషుడు వర్ణింపంబడియెను, శివునకు మూడునేత్రములు గలవని ప్రసిద్ధిగలదుగదా? ఇట్లుండ అంతరాదిత్యవిద్య శివునందు నెట్లు సమన్వితమగును,

అన్నం—ఆచార్యులవారూ! గొప్పపూర్వపక్షము చెప్పితిరి. ఆరాధ్యుల వారి సిద్ధాంతము దీనితో సాంతమగునని మెతోచెడిని, ఆరాధ్యులవారూ! ఆలస్యము చేయుచున్నారేమి?

పండి—మీసంభాషణవలననే ఆలస్యమయ్యెను. కాని కారణాంతరము

లేదు, (కప్యాసం అనువాక్యము శివపరత్వమునకు బాధకము గాదు.

ప్రతి—ఏకారణమున,

పండి—పుండరీకాక్షత్వము నారాయణునకు నసాధారణలక్షణ మైన ప్పుడుగదా? ఇది శివపరము గాకపోవును.

ప్రతి—ఇది నారాయణునకు నసాధారణలక్షణ మేలకానేరదు?

పండి—పుండరీకాక్షః పుమాన్, పుండరీకాక్షీనారీ, అనియిట్లు పుండ రీకాక్షత్వము బహుజనసాధారణలక్షముగా వ్యవహరింపఁబడు చున్నది. ఇట్లుండ నిది పరమేశ్వరు నం దేలవిరోధించును?

ప్రతి—అక్షిణీ అనిఅచట ద్వివచనము గలదు. దీనింబట్టి సూర్యమండ లములోని పురుషుడు రెండుకన్నులుగలవాఁడని స్పష్టముగా తెలియుచుండగా నతడు మూడుకన్నులుగల శివుడేయని యింత విపరీతముగా నెట్లు చెప్పఁగలరు?

పండి—సూర్యమండలములోనిపురుషుడు శివుడనుట యెంతమాత్రము విపరీతము గాదు.

ప్రతి—అది విపరీతమెట్లుగాదో మాకు దెలియనగుసిన దే.

పండి—అచ్చటిసందర్భము నాలించినచో మీకును బాగుగా తెలియును.

ప్రతి—ఆలించుచున్నాను. తెలుపుడు.

పండి—అచట (అక్షిణీ' అని ద్వివచన మున్నమాటనిజమే. వికసించి పుండరీకములంబోలు రెండునేత్రములు గలవాఁడనియె దాని కర్థము, అయినను నింతమాత్రమున మూడవకన్ను లేదని యేన్పడదు. ఒక బ్రాహ్మణునకు నిద్దఱుకొమరులు నిప్పవంటి వారు కలరు. అనగా మూడవవాఁడు లేడనియర్థము గాదు. ఇద్దఱు మాత్రము నిప్పువంటివారనియు, కడమవాఁడు మేదకుఁడనియు ...నన. ఇట్లే రెండుకన్నులు వికసించిన పుండరీకముఃః

బోలియుండు ననుటచే మూడవకన్ను మూయఁబడియున్నదని యేర్పడు చున్నదియున్నది, ఇట్లు లేర్పడుచుండగా సూర్యునకు నంతర్యామి యగు పురుషుఁడు శివుఁడనుట యెట్లువిపరీత మగును?

అన్నం—— సూర్యనారాయణుఁడని లోకప్రసిద్ధి యుండగా, సూర్యునకు నంతర్యామి శివుఁడనుట విపరీతము కాకుండునా?

పండి——సూర్యనారాయణుఁడను ప్రసిద్ధి వైష్ణవలోకముననో లేక శ్లో॥ సభామధ్యేతు వైష్ణవం॥ అనియున్నదానింబట్టి మీదగు సభా వైష్ణవలోకముననో యుండిన నుండునేమోకాని వైదిక లోకముననమాత్ర మిట్టి ప్రసిద్ధి యెంతమాత్రము లేదు,

ఇదిగాక, ఎంజేని నట్టిప్రసిద్ధి యున్నను- సూర్యనారాయణుఁడనగా, సూర్యుఁడె నారాయణుఁడని యర్థమగుచున్నదిగాన నాప్రసిద్ధి సూర్యనారాయణునకు నంతర్యామి శివుఁడను వేదప్రసిద్ధిని బాధింపనేరదు,

అన్నం——సూర్యునకు నంతర్యామి శివుఁడని వేదమువలన నెట్లు తెలియుచున్నది,

పండి——నారాయణమునందు॥ శ్రు॥ అదిత్యోవై తేజఓజోబలం, అని యారంభించి, బ్రహ్మైతదమృతఏష పురుషఏష భూతానామధిపతిః, అని యుపసంహారము చేయఁబడియున్నది, శ్రు॥ ఈశానస్సర్వవిద్యానా మీశ్వరస్సర్వభూతానాం, ఈ మొదలగు శ్రుతులనుబట్టి భూతాధిపతిత్వము పరమేశ్వరలింగమే గావున, ఈలింగమునుబట్టి, ఆదిత్యునకు నంతర్యామి పరమేశ్వరుఁడేయని నిర్ధారణమగుచున్నది. భూతాధిపతిత్వము నారాయణలింగమని శ్రుతియం దెచటను లేదుగదా!

ఇదిగాక, ఉపసంహారమునందె॥ శ్రు॥ నమోహిరణ్యబాహవే హిరణ్యవర్ణాయ హిరణ్యరూపాయ హిరణ్యపతయేఽంబికాపతయ

ఉమాపతయే పశుపతయే నమోనమః, అనియునున్నది, హిరణ్యబాహుత్వము, హిరణ్యవర్ణత్వము నీలవర్ణుడగు నారాయణునకు నుండుటయసంభవము గావునను ఆదిత్యునకు నంతర్యామి పరమేశ్వరుఁడేయని యేర్పడుచున్నది.

ప్రీతి—ఈశ్రుతివాక్యమును మావారు నారాయణ పరముగాను వ్యాఖ్యానము చేసియున్నారు.

అన్నం—అదియెట్లో తెలుపుదు.

ప్రతి—హిరణ్యబాహవే= హిరణ్మయములైన యాభరణములు బాహువులయందు గలవాఁడుగాన హిరణ్యబాహువు నారాయణుండగును.

అన్నం—ఆచార్యులవారూ! ఈయర్థము చాలబాగుగానున్నది. ఏలన, నారాయణమూర్తి బాహువులయందే హిరణ్మయాభరణములు గలవుగాబోలు? లోకమునఁ జూడగా, కోమటికుఱ్రవాండ్రి చేతులయందును దఱుచుగా నవికనఁబడుచున్నవి. కావున వీరలును నీమంత్రమునకు వాచ్యులగుదురా? లేక, సూర్యునకు నంతర్యాములగుదురా? అటుపైన సెలవిండు.

ప్రీతి—మీరు పరిహసించుచున్నారుగాన నింకమీద నేనుచెప్పజాలను.

అన్నం—మీరుచెప్పినయర్థము పరిహాసార్హముగా నున్నదా లేదా?

ప్రీతి—మీకునెట్లున్నను సరియే.

అన్నం—ఆరాధ్యులవారూ! మీరు సెలవిండు.

పండి—హిరణ్యవర్ణుఁడని చెప్పుటయెగాక, అంబికాపతి, ఉమాపతి, పశుపతియునని చెప్పుచున్నది. ఈలక్షణములు శివునకుగాక నారాయణునకు కల్పింపనగునా? సంభ

వింపవు. ఇట్లుండ సూర్యునకు సంతర్యామి శివుఁడగునో కేశవుఁడగునో యాలోచించుఁడు.

అన్నం—ఈమహామంత్రమునకు సావిత్రియని పేరుగలదుగానను, సవితా దేవతా ఈమంత్రమునకు సూర్యుఁడు దేవతయనిచెప్పఁబడుటను సూర్యుఁడే మంత్రప్రతిపాద్యుఁడని యేల గ్రహింపఁగూడదు?

పండి—ఈమంత్రమునందు సవితుః అని సవితృశబ్దము గలదుగాన దీనికి సావిత్రియని పేరు వచ్చెను, 'ఉద్బుధ్యస్వ' అను మంత్రమునందు బుధదాతువున్నమాత్రముననే ఆమంత్రమునకు బుధుఁడు దేవత యాయెను, శమగ్ని, అను మంత్రమునందు 'శం' అనియున్నమాత్రముననె యామంత్రమునకు శని దేవత యాయెను, మంత్రలింగములవలన నాయామంత్రములకు శన్యాదులు దేవతలైనను నాయామంత్రములకు ముఖ్యప్రతిపాద్యలు శన్యాదిగ్రహములేయని నిర్ణయింప నశక్యము, అట్లే గాయత్రికిని సూర్యుఁడు దేవతయైనను నతడు ముఖ్య ప్రతిపాద్యుఁడని గ్రహింప నుచితముగాదు,

అన్నం—గాయత్రికి సూర్యుఁడె ముఖ్యప్రతిపాద్యుఁడని గ్రహించిన నేమి?

పండి—బ్రహ్మగాయత్రియని దీనికి వ్యవహారము గలదు, ఇట్లుండ నీమంత్రమునకు ముఖ్యార్థము పరబ్రహ్మమనుట యుచితము గాని సూర్యుఁడనుట యెట్టులుచితమగును?

అన్నం—సూర్యుఁడే పరబ్రహ్మమని యంగీకరించిన నేమి?

పండి—సూర్యుఁడే పరబ్రహ్మమని సాధింపఁజాలినచో నట్లే యంగీకరింపవచ్చును,

అన్నం—సూర్యుఁడె పరబ్రహ్మమని యేలసాధింపఁగూడదు?

పండి—సౌరమతస్థులట్లే సాధించుకొని యుండిరిగదా?

అన్నం—మనమట్లేల యంగీకరింపఁగూడదు?

పండి—ఆమతము నంగీకరించినచో నట్లే గ్రహింపవచ్చును,

అన్నం—సూర్యుఁడు పరబ్రహ్మమనుటకు బాధకమేమి?

పండి—సూర్యుఁడు పరబ్రహ్మమనుటను శ్రీవేదవ్యాసమహర్షి యంగీకరింపలేదు,

అన్నం—ఆయన యంగీకరింపనట్లు దేనిఁబట్టి తెలియుచున్నది,

పండి—బ్రహ్మమీమాంస, అంత స్తద్ధర్మోపదేశాత్, అను నధికరణమునందు, సూర్యునకు నంతర్యామిగా నున్నవాఁడే పరబ్రహ్మముగాని సూర్యుఁడు పరబ్రహ్మము గానేరడని నిర్ణయించియున్నాఁడు,

అన్నం—ఈయర్థము నేభాష్యకర్త చెప్పియున్నాఁడు?

పండి—భాష్యకర్త లందఱును నిట్లే చెప్పియున్నారు, ఇంతియెగాని సూర్యుఁడె పరబ్రహ్మమని యేభాష్యకర్తయు నంగీకరించి యుండలేదు,

అన్నం—సూర్యుఁడు పరబ్రహ్మమని పూర్వాచార్యు లంగీకరింపకుండనీ? ఈమంత్రమునకు సావిత్రినామము గలిగియుండుట మొదలగు కారణములనుబట్టి సూర్యసంబంధము గనఁబడుచున్నది. సూర్యునకు నారాయణునకును సంబంధమున్నట్లు ప్రసిద్ధికలదు. కావున దీనికి ముఖ్యప్రతిపాద్యుడు సూర్యుడైన కావలయు? లేనిచో నారాయణమూర్తియైన కావలయు? ఇట్లుగాక, శివుఁడు ముఖ్యప్రతిపాద్యుఁ డెట్లగును?

పండి—సావిత్రి నామము మొదలగునవి సాధకములుగావని చెప్పియుంటిని. సూర్యునకు నారాయణునకును సంబంధమున్నట్లు ప్రసిద్ధి

గలదంటిరి. అది మూర్ఖప్రసిద్ధిగాని పండితప్రసిద్ధి గానేరదు. ఏలన, ఋగ్వేదమంత్రములు సూర్యుని పరమేశ్వర సంబంధి గానె తెలుపుచున్నవి.

అన్నం—అదియెట్లు?

పండి—ఋగ్వేదమునందు ‘శృణ్వన్తం పూషణం వయమనష్టవేదస మీశానం రాయ ఈమహే’ రథీతమం కపర్దినం ఈశానం రాధ సేమహే॥ ఇందు, ఈశానుఁడనియు, కపర్ది యనియు, జెప్పఁబడి యున్నది. మఱియు, రాయస్పఖాయ మీమహే॥ దీనింబట్టి కుబేరసఖత్వము స్పష్టమగుచున్నది. ఇదిగాక, ఉదస్యదేవ స్సవితా హిరణ్యయా బహూఅయన్త సవనాయసుక్రతు॥ దీనిచే హిరణ్యబాహుత్వము గలదని తెలుపఁబడియెను. సూర్యప్రస్తావమునందె॥ ఇమా రుద్రాయస్థిరధన్వనే గిరః॥ అని రుద్రుఁడు ప్రశంసింపఁబడియుండెను. ఈప్రమాణములనుబట్టి సూర్యునకు నంతర్యామి శివుఁడేయనియు సూర్యుఁడు శివునిసంబంధియే యనియు స్పష్టమగుచున్నది.

ఇదిగాక, అష్టమూర్తియగు పరమేశ్వరునకు శ్లో॥ సూర్యోముఖ్య శరీరం యచ్ఛివస్యపరమాత్మనః అనువచనమువలన సూర్యుఁడు ముఖ్య శరీరమని తెలియుట సూర్యుఁడు పరమేశ్వర సంబంధియెయనుట విశదమగుచున్నది.

ఈచెప్పినకారణములవలన గాయత్రిలోని భర్గశబ్ద మకారాన్తమే యనియు, ఈమహామంత్రమునకు ముఖ్యప్రతిపాద్యుఁడు పరమేశ్వరుఁ డేయనియు సిద్ధాంతితమైనది.

అన్నం—భర్గః అనుపదమును సకారాన్తముగానె గ్రహించి దానికి తేజమేయర్థమని గ్రహించునెడ నేమిదోషము?

పండి—భర్గః, అనుపదము శివవాచకమని యమరసింహాది సకలనిఘంటువులందుబట్టి ... నిఘంటువున

నెచటనో సకారాన్తభర్గః పద మొకటియున్నదని వెదకి యిదియదె యనుటచే క్లిష్టత్వదోషము మొదటిది,

ఏభర్గుఁడు మాబుద్ధులను ప్రేరణ చేయునో ఆభర్గునినే ధ్యానము చేయుచున్నారమని సమానాధికరణముగా నన్వయింపక, ఏసూర్యుఁడు మాబుద్ధులను ప్రేరణ చేయునో అసూర్యుని తేజమును ధ్యానము చేయుచున్నారమని వ్యధికరణార్థము గ్రహించుటచే వ్యధికరణదోషము రెండవది,

ఏభర్గుఁడు మాబుద్ధులను ప్రేరణచేయునో ఆబ్రహ్మమునే ధ్యానముచేయుచున్నారమని మంత్రములోని యత్తచ్ఛబ్దములకు సులువుగా నన్వయము గలిగియుండగా నీయన్వయము గ్రహింపక' ఏసూర్యుఁడు మాబుద్ధులను ప్రేరణచేయునో ఆసూర్యుననుటకై మంత్రమునలేని షష్ఠ్యంత తచ్ఛబ్దము నొకదానిని, సూర్యుని యేతేజము గలదో ఆతేజముననుటకై ప్రథమాంతయచ్ఛబ్దము నింకొకదానిని నధ్యాహారము చేయవలసివచ్చుటచే గౌరవదోషము మూడవది,

మైత్రాయణీయము మొదలగు శ్రుతులయందు 'భర్గాఖ్యః' అనుటచే భర్గపద మకారాన్తమని స్పష్టమగుచుండగా నదియంగీకరింపక సకారాన్తమని యంగీకరించుటచే శ్రుతివిరోధము నాల్గవది,

మైత్రాయణీయము మొదలగు శ్రుతులయందు శ్రు॥ యఏష రుద్రో భర్గాఖ్యః అనుటచే భర్గశబ్దమునకు రుద్రుఁడే యర్థమని నిర్ణయింపఁబడియుండగా నాయర్థము గ్రహింపక తేజమనియర్థము గ్రహించుటచే బహుశ్రుతి విరోధ మైదవది,

శ్వేతాశ్వతరోపనిషత్తునందు, శ్రు॥ శివఏవకేవలః తదక్షరం తత్సవితు ర్వరేణ్యం, అనుటచే, గాయత్రీమహామంత్రప్రతిపాద్యుఁడు శివుఁడేయని స్పష్టమగుచుండగా నీయర్థము నంగీకరింపని కారణమున మంత్రోపనిషత్తుతో విరోధ మాఱవది.

సిద్ధాంతమునందు, సవితుః = సూర్యునకు, వరేణ్యం= ఉపాస్య మైన యనియొక్కచోనున్నయీరెండుపదములను నన్వయము కుదురు చుండగా దీనిని వదలిపెట్టి, వరేణ్యం = శ్రేష్ఠమైన, సవితుః =సూర్యు డనే, దేవస్య = దేవునియొక్క, భర్గః = తేజమును ననియన్వయించు టచే దూరాన్వయ మేడవది

గాయత్రిలోని 'భర్గః' అనుపదమును అకారాన్తముగా నంగీక రింపక సకారాన్తముగా గ్రహించి దానికి, 'భర్గసీ శేతఆలోకా' అను వైజయన్తీ నిఘంటువునందు, శేతస్సు, వెల్తురనను రెండర్థము లలో వెల్తురను నర్థముగ్రహించుటంజేసి, వెల్తురు అచేతనమైనది గావున దీనికి చేతనుల బుద్ధిని ప్రేరణచేయుటగాని, చేతనులచే ధ్యానింపఁబడుటగాని సంభవింపదుగాన నీలక్షణములు సిద్ధించుటకై లక్షణచే వెల్తురనగా పరమేశ్వరప్రకాశమేయని కల్పింపవలయుగాన నిట లక్షణచే నర్థముగ్రహింపవలసివచ్చుట యెనిమిదవది.

వినుతమునందు సూర్యునియొక్కవెలుతురనుచోట షష్ఠికి స్వస్వామిభావరూపసంబంధ మర్థముగా గ్రహింపవలయు. ఈయర్థము గ్రహించునెడ సూర్యుఁడు స్వామియు, తేజము సొత్తును నగును, తేజమనగా పరమేశ్వరప్రకాశమని యర్థముగదా? అది యన్యశేషము గాదుగాన సూర్యునిసొత్తు గానేరదు, కాఁబట్టి యిచట సూర్యుఁడనే తేజమని గత్యంతరములేనిచో గ్రహింపఁదగిన యభేదము స్వీకరింప వలసివచ్చుట తొమ్మిదవది,

ఇట్లు షష్ఠికి దిక్కుమాలిన యభేదరూపార్థమును గ్రహించి సూర్యుఁడనే తేజమని చెప్పినను సూర్యుఁడు పరమేశ్వరుఁడు గామిం జేసి పరమేశ్వరతేజమని యేర్పడదుగాన సవితృశబ్దమునకు రూఢ్య ర్థమును వదలి లక్షణచేతగాని, కేవలయోగశక్తిచేతగాని పరమేశ్వరుఁ డని యర్థము చెప్పవలసివచ్చుట పదియవది, ఇట్లింక నెన్నియో దోషములుగలవు.

ఈమహామంత్రమునందు, పరమేశ్వరవాచకమైన భర్గపద మునుండియున్నను, ఈభర్గపదమునకు రుద్రుఁడె యర్థమని మైత్రా యణీయము, త్రిపురాతపనము, శ్వేతాశ్వతరము మొదలగు నుపని షత్తులు నిర్ణయించియున్నను, శ్రుతులను లెక్కసేయక, మహాదోష శతములకు వెఱచక పరమేశ్వరద్వేషమునే పరిధానీకరించుకొని, భర్గః అను పదమును సాంతముచేసి సకలవేదమాతయై ద్విజత్వప్రాప్తికిఁ బరమసాధనమైన సావిత్రి మహామంత్రదేవతను విపరీతార్థములచే సాంతము సేయఁదలపడిన కలిపండితమండలిదగు శక్తివైభవ మచిం త్యము నప్రమేయము నగును,

అన్నం—మేము గ్రహించినయర్థమును దెలుపు ధ్యానశ్లోకము శ్లో॥ యోదేవ స్సవితాస్మాకం అని మొదలుగా నున్నది, కాని మీరు నిర్ణయించినయర్థమును దెలుపుశ్లోక మెందేని గలదా?

ప డి—గాయత్రీ మంత్రార్థశ్లోకమును యోగయాజ్ఞ వల్క్యమహర్షి యిట్లు చెప్పియున్నాఁడు ఎట్లన,

శ్లో॥ దేవస్య సవితుర్మధ్యే యోభర్గో నోధియః క్రిమాత్ ప్రచోదయా త్తద్వరేణ్యం ధీమహీత్యన్వయక్రిమః॥

దేవుఁడగు సూర్యుని నడుమ నున్న యేభర్గుఁడు మాబుద్ధులను ప్రేరణచేయునో, ఉపాస్యుఁడగు నద్దేవుని నుపాసించు చున్నాము, అని యర్థము,

అన్నం—ఆచార్యులవారూ! ప్రతివాది భయంకరంగారు! ఇయ్యెడ మీరేమైన చెప్పవలసినది యున్నదా?

ప్రతి—మిమ్ముల నెవ్వరైనఁ జెప్పవద్దనిరా? మాసంగతి యేనికి?

అన్నం—మధ్యాహ్నమైనదిగాన నేటికి సభ చాలింతము, అని యందఱు నిష్క్రమించిరి.

ఇది

చతుర్థాహ్నికము.

శ్రీశివాయ గురువేనమః

శ్రీ

శివాయ గురవేనమః

# మతవినోదచర్చ

## పంచమాహ్నికము.

తిరుగ నందఱు సమావేశమైరి.

అన్నంభొట్లు—శ్లో॥ భారతః పచమో వేదః॥ మహాభారతము అయిదవవేదమని ప్రఖ్యాతిని గ్రహించియున్నదిగదా? ఈగ్రంథము శివపారమ్యమును చెప్పుచున్నదా? లేక విష్ణుపారమ్యమును చెప్పుచున్నదా?

ప్రతివాది భయంకరుడు—ఈప్రశ్నము దేనికి?

అన్నం—శ్రుతులకు నెవ్వరియిచ్చచొప్పున వారువారర్థములు చెప్పుచున్నారు. ఆయాయర్థములు పాండిత్య బలమునుబట్టి నిల్చుచును, పాండిత్యలోపమునుబట్టి యెగిరిపోవుచును నుండును. దానికి ॥శ్లో॥ బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరిష్యతి
ఇతిహాసపురాణాభ్యాం వేదా న్సముపబృంహయేత్
వేదార్థో యస్స్వయంజ్ఞాత స్తత్రాజ్ఞానం భవేదపి
ఋషిభిర్నిశ్చితే త్వర్థే కాశంకాస్యా న్మహాత్మనాం॥

కొంచెము శాస్త్రము చదివినవానింజూచి, వీఁడపార్థములు చేసి నన్ను బాధించునని వేదము భయపడుచుండును. గావున, పురాణములు నితిహాసములు వెదకి, వానియందు వేదార్థమెట్లు తెలుపఁబడియుండెనో అట్లు నిర్ణయింపవలయును, తమయంతనే వేదార్థమును దెలుసుకొనునెడ నందు ప్రమాదము సంభవింపనగును, మహర్షులు నిశ్చయించి తెలిపినపు డాయర్థమునందు మహాత్ములకు నేమిసంశయ

ముండునని స్మృతికర్తలె చెప్పియున్నారు. కావున, మహాభారతము నందు నేదేవతదగునాధిక్యము తెలుపఁబడియున్నదో అదియె వేదార్థమని గ్రహింపఁదగియుండును. దానింబట్టి యేనడిగినప్రశ్నము సార్థకమే యగును.

ప్రతి—భారతమునఁ బ్రతిపాదింపబడినదియె వేదార్థమని మీరలంగీకరింతురా?

అన్నం—తప్పక యంగీకరింతుము

ప్రతి—దీని నారాధ్యులవా రంగీకరింతురా?

అన్న—వారుమాత్రమేల యొప్పుకొనరు? ఆరాధ్యులవారూ! భారతమునజెప్పఁబడినదే వేదార్థమని మీరంగీకరింతురా?

పండి—మీరుభయులు నంగీకరించినప్పుడు నేనంగీకరింపకుండిన నెట్లు చెల్లును?

అన్నం—అట్లేని నేనడిగినదానికి సదుత్తరము తెలుపుడు.

ప్రతి—భారతమునఁజెప్పఁబడునదే వేదార్థమనుటకును మీరుభయులు నంగీకరించితిరిగాన మాసిద్ధాంతముదగు విజయధ్వజము మిన్నందెను.

అన్నం—(తనలో) భారతము పేరెత్తగానే యాచార్యులవారికిమహోత్సాహము పెరిగిపోవుచున్నది. దీనితో నైనఆరాధ్యగాని పొగరణగునా? (ప్రకాశముగా) అంతగర్వించుచున్నారు? ఆరాధ్యుల వారు సామాన్యులని తలంచితిరా? అది యెట్లో తెలుపుడు.

ప్రతి—సూతసంహితయందు శ్లో॥ కృష్ణద్వైపాయనంవ్యాసం విద్ధి నారాయణంస్వయం। కోహ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృద్భవేత్॥ శ్రీనారాయణమూర్తికన్న నితరుఁడునిట్టి మహాభారతమును జేయఁగలఁడా? చేయఁజాలఁడు. కావున శ్రీవేదవ్యా

సుడు శ్రీనారాయణమూర్తియే యగుచనియున్నది. భారతము రచించిన వేదవ్యాసుఁడు శ్రీనారాయణమూర్తియే కాఁడా?

అన్నం—ఆరాధ్యులవారూ! వ్యాసుఁడు నారాయణమూర్తియనుటను మీరంగీకరింతురా?

పండి—అంగీకరింపక సేయునదేమి? కూర్మపురాణమునగూడ నీయర్థము కలదు.

అన్నం—అందేమని యున్నది?

పండి—శ్లో॥ వ్యాసో నారాయణస్సాక్షాద్విష్ణురేవ సనాతనః।
కోహ్యన్యస్తత్వతో రుద్రం వేత్తితం పరమేశ్వరం॥

వేదవ్యాసుఁడు సాక్షాత్తు విష్ణువేగాని నేరుగాదు. ఏలందు లేని పురాణములయందు శివతత్త్వమునింత తేటగా దెలుప నింకొకఁడు శక్తుడెట్లగు? అనియున్నది.

అన్నం—ఆచార్యులవారూ! మీరుచెప్పునది వింటిరిగదా। వ్యాసుఁడు నారాయణమూర్తిగాననే పురాణాదులయందు శివతత్త్వము నట్లు తెలుపఁజాలెనట. దీనింబట్టి వ్యాసుడు నారాయణమూర్తియైనంతమాత్రిన నాయనజెప్పినగ్రంథములు నారాయణపరములని విశ్వసింప వీలులేదని తేలినది.

ప్రతి—భారతగ్రింథమును విమర్శించునెడ నందు నారాయణపారమ్యమే యేర్పడును. ఎట్లనిన, పాండవచరితమునుజెప్ప నారంభించి యందునంతటను శ్రీకృష్ణమాహాత్మ్యమునె దెలుపుచు తన్మూలమున శ్రీవిష్ణుపారమ్యమునె వివరించియుండెను, కావుననె,

శ్లో॥ వాసుదేవస్య మాహాత్మ్యం పాండవానాంచ సత్యతాం
దుష్టతాం ధార్తరాష్ట్రాణా ముక్తవాన్భగవా నృషిః॥

భగవంతుఁడగు వ్యాసమహర్షి శ్రీవాసుదేవుని మహిమమును,

పాండుపుత్రుల సౌజన్యమును, ధృతరాష్ట్రపుత్రుల దుష్టతను చెప్పెనని యున్నది. ఈగ్రంథము పాండవులను విషగానాయకులను జేసి వీర లను రక్షించునెడ జాగరూకుఁడుగానున్న శ్రీకృష్ణుని మహిమమును వర్ణింపనె ప్రవర్తించినది, పాండవులకు రాజ్యలాభము శ్రీకృష్ణు ననుగ్ర హముననెగదా? కలిగెను, ఆకారణమున, ఆరంభముననే సూతుఁడు,

శ్లో॥ నమోభగవతే తస్మై వ్యాసాయామి తతేజసే
యస్య ప్రసాదాద్వక్ష్యామి నారాయణకథామిమాం॥

ఎవ్వని యనుగ్రహంబున నీనారాయణకథను చెప్పుచున్నానో అమితమగు తేజముగల భగవంతుఁడైన యావ్యాసమహర్షికొఱకు నమస్కారము సేయుచున్నాను, అని భారతము మొదటనే యిదినారా యణకథ అనగా హరికథయని చెప్పియున్నాఁడు, దీనింబట్టి యందుఁ జెప్పఁబడినది నారాయణపారమ్యమే యని తెలియుటలేదా?

అన్నం.—ఇప్పు డారాధ్యులవారు చెప్పినది సహేతుకముగా నున్నది. ఆరాధ్యులవారూ! దీనివిషయమై మీరు చెప్పున దేమైనకలదా?

పండి.—వ్యాసుఁ డారంభముననె హరికథయని యారంభించి యంను శ్రీకృష్ణుని మహిమమును దెలిపెననుట నిజమేకాని, యందిం కొకవిశేషము గలదు. ఏమనిన, శ్రీకృష్ణునిమహిమమును దెలుపుచు శ్రీకృష్ణునకును పూర్వము పరిగ్రహింపబడిన యవ తారములకును మూలమగు పరవాసుదేవునకును పూజనీయు నిగా పరమేశ్వరు సచ్చటచ్చట తెలుపుటంజేసి పరమేశ్వరుఁడె పరంబ్రహ్మమని వ్యక్తీకరించెను ఎట్లనిన సౌప్తికపర్వమునందు। అశ్వత్థామ నుద్దేశించి యీశ్వరుఁడు చెప్పినవచనము.

శ్లో॥ సత్యశౌచార్జవత్యాగై స్తపసానియమేనచ।
క్షాన్త్యాభక్త్యాచ ధృత్యాచ కర్మణామనసాగిరా।

అహంయద్భనతా సాధ్యః కృష్ణేనా క్లిష్టకర్మణా
తస్మాదిష్టతమః కృష్ణాదన్యో మమ నవిద్యతే॥

సత్కర్మపరుండగు శ్రీకృష్ణమూర్తి సత్యము, శౌచము, నిష్కాపట్యము, త్యాగము, తపము, నియమము, ఓర్పు, భక్తి, ధైర్యము ననువానితో మనోవాక్కాయ కర్మములచే నన్నెల్లపుడు పూజించుచున్నాఁడుగాన నాకు నతనికంటె నింకొకఁ డతిప్రియుండు లేడు అని చెప్పియున్నాఁడు,

ఆదిపర్వమున, సుభద్రాపరిణయ ప్రస్తావమునందు సముద్రమధ్యమున నౌకానౌక ద్వీపమునందు శ్రీకృష్ణుఁడు శివునిపూజకై మహోత్సవము జరిపినట్లు వివరింపఁబడి యున్నది.

ఉపమన్యూ నుపదేశముచే శ్రీకృష్ణుఁడు పండ్రెండేడులు పాశుపతదీక్ష గ్రహించినట్లును, కైలాసయాత్రయందును, సమయాంతరములయందును పూజ, స్తుతి, తపము ననువానిచే శ్రీకృష్ణమూర్తి శివుని మెప్పించినట్లు చెప్పఁబడి యున్నది.

ద్రోణపర్వమునందు, ద్రోణుని వధించిన తరువాత, క్రోధముతో తాను ప్రయోగించిన యాగ్నేయాస్త్రము కృష్ణార్జునులయెడ విఫలమగుటను జూచి లజ్జపడి శస్త్రసన్యాసము దీసికొని, దక్షిణ దిశకు వెడలిపోవుచున్న యశ్వత్థామను జూచి వేదవ్యాసుఁడు చెప్పిన వచన మేమనిన,

శ్లో॥ దేవదేవ స్త్వచింత్యాత్మా అజేయో విష్ణురవ్యయః
సర్వరూపం భవంజ్ఞాత్వా లింగేర్చయతియః ప్రభుం
తస్మిన్నభ్యధికాంప్రీతిం కరోతివృషభధ్వజః

అజేయుండును, అవ్యయుండును, దేవదేవుండునగు విష్ణుండు శివుని సర్వాత్ముఁనిగాఁ దెలిసికొని లింగమునందుఁ బూజించుచుండును,

దానంజేసి పరమేశ్వరుండును నావిష్ణునందు నధికమగు ప్రేమగలిగి యుండునని చెప్పి, కృష్ణార్జునులు పూర్వజన్మమునందు నరనారాయణులను మహర్షు లగుదురు. వారు అఱువదివేల సంవత్సరములు శివునారాధింపగా నద్దేవుండు వారలకు నమితమగుపరాక్రమము మొదలుగాననేకవరములొసఁగియుండెనని చెప్పగావిని యశ్వత్థామ నేనుశివుని పూజించువాఁడనుగానా? అని యడుగగా, వ్యాసమహర్షి,

శ్లో॥ జన్మకర్మతపోయోగా స్తయో స్తవచపుష్కలాః
తాభ్యాంలింగేఽర్చితో దేవ స్త్వయార్చాయాం యుగేయుగే॥

జన్మకర్మంబులు, తపోయోగంబులును వారివినీయవి సమృద్ధంబులెయగును. అయినను వారలుప్రతియుగంబునను పరమేశ్వరుని లింగమునందుఁబూజించిరి. నీవు విగ్రహమునందు నర్చించితివి. ప్రతిమార్చనముకన్న లింగార్చన మధికఫలప్రద మగును. అదిగాక, శ్రీకృష్ణుండు మైనాకపర్వతమున తపముచేసి పరమేశ్వరునివలన ననేకములగువరములను గొనియుండెను. గాన కృష్ణార్జునులజయించుట నీకుశక్యముగాదని చెప్పియుండెను.

శ్రీకృష్ణుండు పారిజాతమును దేఁబోవునప్పుడు శివునిఁబూజించి స్తుతిసేయుచుండగా పరమేశ్వరుడు, హరివంశమునందు,

శ్లో॥ ఇతిసంస్తూయమానస్తు భగవాన్గోవృషధ్వజః।
ప్రసార్యదక్షిణంబాహుం వాసుదేవమథాబ్రవీత్।
మనీషితానామర్థానాం ప్రాప్తిఽస్తేస్తు సురోత్తమ॥
పారిజాతంచహర్తాసి మాభూత్తేమనసోవ్యథా।
పురామైనాకమాశ్రిత్య తప స్త్వమకరోర్యదా।
తదాప్రభృతి కృష్ణ [illegible]

అవధ్య స్త్వమజయ్య స్త్వం మ త్తశ్శూర తర స్తథా।
భవితాసీత్యవోచంయ త్త త్తథానతదన్యథా॥

భగవంతుఁడగుపరమేశ్వరుండు కృష్ణునిచే నిట్లుస్తవింపఁబడి ప్రస
న్నుండై కుడిచేయిసాచి వాసుదేవునితో నిట్లనియె. నీకు నభీష్టము
సిద్ధించును. పారిజాతముం గొనివత్తువు. విచారింపకుము. పూర్వము
నీవుమైనాకమున తపము గావించినప్పుడు నేనుచెప్పినమాట తలంచుకొని
ధైర్యమొందుము. నిన్ను వధించువాఁడుగాని, జయించువాఁడుగాని
లేడనియు, అవసరమైనచో నాకంటెను శూరుఁడవగుదువనియు, నేఁజెప్పి
నమాట చెల్లునెగాని యది యెన్నడు పొల్లుగానేరదు. అని చెప్పినట్లు
వర్ణింపఁబడి యున్నది.

ఈకనఁబరిచిన వచనములనలన శ్రీకృష్ణమూర్తియెగాక, కృష్ణావ
తారమునకుఁ బూర్వరూపములచేతను నాశివు నారాధించియున్నట్లు
స్పష్టమైనది. అవతారములకు నన్నిటికి మూలమగు పరవాసుదేవుం
డును శివుని పూజించి బహువరముల పొందినట్లు అరణ్యపర్వమున
తీర్థయాత్రావిధియందు గలదు, ఎట్లన,

శ్లో॥ తతోగచ్ఛేత్సువర్ణాక్షం త్రిషులోకేషు విశ్రుతం
యత్రవిష్ణుః ప్రసాదార్థం రుద్రమారాధయన్పురా
వరాంశ్చసుబహూన్లేభే దైవైరపిసుదుర్లభా
దత్తాంశ్చత్రిపురఘ్నేన పరితుష్టేనభారత

తరువాత మూఁడులోకములయందునుఁ బ్రఖ్యాతిమైన సువ
ర్ణాక్షమను తీర్థమునకుఁ బోవలయును, అచట తొల్లి విష్ణుండు శివు
నారాధించి సకలదేవతలకును దుర్లభములైన వరములను పొందె
నని యున్నది.

మఱియు నచటనే,

శ్లో॥ తీర్థంకురుకుల శ్రేష్ఠ త్రిషులోకేషు విశ్రుతం
ప్రమీతినామ్నా విఖ్యాతం సర్వపాపవిమోచనం

యత్రబ్రహ్మాదయోదేవా ఉపాసంతే మహేశ్వరం
తత్రస్నాత్వార్చ్య యిత్వాచ హయమేధమవాప్నుయాత్
జిహ్మగ్ యత్ర మహాప్రాజ్ఞ విష్ణునాప్రభవిష్ణునా
పురాశౌచం కృతంరాజన్ హత్వాదైవతకంటకాన్॥

సకలపాపములను పోగొట్టునదై ముల్లోకములయందుఁ బ్రసిద్ధమైన ప్రవిరాతియను నొకతీర్థము గలదు, అచట బ్రహ్మాదిదేవతలు మహేశ్వరు నుపాసించుచుందురు. అందు స్నానముచేసి పరమేశ్వరుని బూజించునెడ నశ్వమేధఫలము లభించును, పూర్వము మహావిష్ణువు దుష్టులగు రాక్షసులను వధించి యచ్చట శివారాధన రూపమైన ప్రాయశ్చిత్తమును చేసికొనియుండెను, అనియున్నది,

అనుశాసనికపర్వమునందు,

శ్లో॥ యస్య బ్రహ్మచవిష్ణుశ్చ త్వంచశక్రసహామరైః
అర్చయధ్వే సదాలింగం తస్మాచ్ఛ్రేష్ఠతమోహికః॥

ఓమహేంద్రా, బ్రహ్మ, విష్ణువు, సకలదేవతలతో నీవును నేదేవుని లింగమును నెల్లపుడు బూజించుచుందురో, ఆదేవునికంటె నధికుఁడెవఁడను నుపమన్యుని వచనముచేత బ్రహ్మవిష్ణ్వాది దేవతలందఱును శివారాధన పరులెయని తెలిసెడిని,

ఇట్లు సౌప్తికపర్వము మొదలుగాఁ బెక్కుచోట్ల అవతారరూపుఁడైన శ్రీకృష్ణుఁడు మూలభూతుడగు మహావిష్ణుండును శివుని బూజించి సకలవరములను బొందిరని చెప్పుటచేత భారతముననె నిరతిశయ మహిమగలవాఁడనియు, సాక్షాత్తు భగవంతుఁడనియు జెలుపంబడు మహావిష్ణునికన్న నద్దేవునకునుఁ బూజ్యుండగు శివుని పారమ్యము వ్యంజనావృత్తిచేత వేదవ్యాసుండు భారతమను కావ్యమునందు ధ్వనింపఁజేసెనని గ్రహింపవలయు, భారతము కావ్యమని దేనినిబట్టి

తెలియుచున్నదనిన, బ్రహ్మదేవు నుద్దేశించి వ్యాసమహర్షి నేనీకావ్యమును రచించితినని చెప్పఁగా,

శ్లో॥ త్వయాచ కావ్యమిత్యుక్తం తస్మాత్కావ్యం భవిష్యతి।

నీవీగ్రంథమును కావ్యమని చెప్పితివిగాన నిదికావ్యమగునని బ్రహ్మదేవుఁడు చెప్పుటచే నేర్పడుచున్నది. వాచ్యమునకుమించినవ్యంగ్యముండిన నేగాని యుత్తమకావ్యమనిపించుకొనదు. కావున నిందు వాచ్యములగు శ్రీకృష్ణమాహాత్మ్యాదులకన్న నతిశయమగునీశ్వరపారమ్యము ధ్వనించుచున్నదిగాన నిదియుత్తమకావ్యమని గ్రహింపవలయు.

ప్రశ్న — అవతారరూపుఁడగుశ్రీకృష్ణమూర్తి శివునారాధించినట్లున్నను మూలభూతుఁడగు పరవాసుదేవమూర్తి శివునిపూజించినట్లు ఎచటనున్నది?

పండి — లోగడ దెలిపిన తీర్థయాత్రావిధియందున్న వచనములలోనను — ఆనుశాసనిక వచనమునందును నట్టియర్థము స్పష్టముగానె యున్నది. ఇదిగాక, ద్రోణపర్వమునందు నారాయణమూర్తి మైనాకమున తపముసేసినట్లు చెప్పఁబడియున్నది. ఎట్లన,

శ్లో॥ ఊర్ధ్వబాహుర్మహాతేజా జ్వలనాదిత్యసన్నిభః।
షష్టిం వర్ష సహస్రాణి తపస్తేపే శతానితు।
వ్యశోషయత్తదాత్మానం వాయుభక్షోఽంబుజేక్షణః।
అథాపరం తపస్తప్త్వా ద్విస్తతోఽన్యత్పునర్మహత్।
ద్యావాపృథివ్యోర్వివరం తేజసా సమపూరయత్।
స తేనతపసాతత్ర బ్రహ్మభూతో యథాభవత్॥

సూర్యాగ్నులంబోలె మహాతేజస్వియగు మహావిష్ణుఁడు చేతులు పైనికెత్తికొని యఱువదియాఱువేల సంవత్సరములు తపముచేసెను. నిరాహారియై శరీరమును శుష్కింపఁజేసికొనెను. మఱియు నంతకాలంబును, నంతకిమ్మడిగాను, దానికంటె నత్యధికంబుగాను తపము చేసి భూమ్యాకాశముల వివరమంతయు తన తేజంబున నింపెను. ఆతపంబుచే నతండు బ్రహ్మభూతుండాయెను. [illegible] తము లేని

కాలము తపముసేయ నేయవతారంబున నింతకాలము నిలిచి యుం డెనో తెలియదు. కాఁబట్టి యాదివిష్ణువే యిట్టి తపము సేసెనని స్పష్టమగుచున్నది. ఇట్టితపముచే నిద్దేవుండు బ్రిహ్మాభూతుండయ్యె నని చెప్పఁబడియెను. బ్రిహ్మాభూతుఁడనగా బ్రహ్మాభావము గలిగె ననుట. ఇచట తపముసేయునప్పుడు శివుఁడనేనేనని భావించుటచే గల్గిన శివభావమె బ్రిహ్మాభావమని గ్రిహింపవలయు. అకారణముననే శివుఁడు ప్రత్యక్షమైనప్పుడు నారాయణుఁడు పరంబ్రహ్మ భావముతోనె శివుని స్తోత్రిము సేసెను. ఎట్లన,

శ్లో॥ సజ్జానుభ్యాం మహీంగత్వా కృత్వాశిరసిచాంజలిం
పద్మాక్షస్తం విరూపాక్ష మభితుష్టావ భక్తిమాన్ ॥
త్వద్భూతా వై భూతకృతోవరేణ్య
గోప్తారోయే భువనస్యగోపాః ।
ప్రవిశ్యేమాం ధరణీం యేహ్యరక్షన్
పురాపురాణీ తవదేవసృష్టిః ॥
శక్త్యాలోకాయథాయాఽన్తి పృథక్త్వాం
తాభిశ్చైక్యం సంక్షయే యాన్తిభూయః ॥
ఏవంవిద్వాన్ ప్రభవంచాప్యయంచ
త్వత్సంభూతం తవసాయుజ్యమేతి॥
భూతంభవ్యంభావి యచ్చాప్యదృష్టం
త్వత్సంభూతాస్తఇమేహి లోకాః॥
భక్తంచమాంభజమానం భజస్వ।
ప్రీత్యామాంవై లోకపితర్మహేశ।

ఆపద్మాక్షుండు భక్తితో మోకాళ్లు నేలకు మోపి శిరముననంజలిఘటించు కొని విరూపాక్షునిట్లని స్తుతించెను.

ఓ దేవా! జగమును సృజించినసృష్టికర్తలందఱును లోకముల రక్షించుసంరక్షకులందఱును నీచేసృజింపఁబడిరి. నీవనాదినుండియు సృష్టి చేయుచున్నాఁడవు. ఈలోకములు నీశక్తిచేనీవల్లనుండియె వెడలుచున్న

వనియు నవియన్నియు నీయందచేరుచున్నవనియు నిట్లుసృష్టియు లయం
బును నీవల్లఁ జరుగుచున్నవని తెలిసినవాఁడు నీసాయుజ్యము నొందు
చున్నాఁడు. పుట్టినది, పుట్టబోవునది, కనఁబడనదియునగు సకలవస్తు
జాతంబును, సకలలోకంబులును నీచేతనసృజింపబడియెను. లోకజనకుండ
నగు నోపరమేశ్వరా! నిన్ను సేవించునన్నుప్రేమచే భక్తునిగా పరిగ్రహిం
పుము. అని స్తోత్రముచేసియుండుటంబట్టి పరమేశ్వరుఁడె పరంబ్రహ్మ
మని విశదమగుచున్నది.

మఱియు. శివుఁడు త్రిమూర్తులను సృజించెనని యానుశాసనిక
పర్వమునందు గలదు. ఎట్లన,

శ్లో॥ సఏష భగవానీశః స్సర్వతత్త్వాది రవ్యయః।
సర్వతత్త్వవిధానజ్ఞః ప్రధానపురుషేశ్వరః।
సోఽసృజద్దక్షిణాదంగా ద్బ్రహ్మాణంలోకసంభవం।
వామపార్శ్వా త్తతోవిష్ణుం లోకరక్షార్థమీశ్వరః।
యుగాన్తేచైవ సంప్రాప్తే రుద్రింప్రభురథాసృజత్॥

సర్వతత్వంబులకు నాదిభూతుఁడును, సకలతత్త్వముల సృజించు
వాఁడును, ప్రధానపురుషులకు నీశ్వరుండును, భగవంతుఁడునగు పరమే
శ్వరుఁడు కుడిపార్శ్వమునుండి సృష్టికృత్యమునకై చతుర్ముఖుని ఎడమ
పార్శ్వమునుండి లోకరక్షకై విష్ణుని, సంహారమునకై రుద్రుని సృజిం
చెను. అనియున్నది,

వీరలకు సంభవించునాపదల దొలగించి వీరిని పరమేశ్వరుఁడు
రక్షించుననియు, శాంతి పర్వమునన్నది. ఎట్లన,

శ్లో॥ యంవిష్ణురింద్రశ్శంభుశ్చ బ్రహ్మాలోకపితామహః॥
స్తువన్తివివిధైస్తోత్రైర్దేవదేవం మహేశ్వరం।
తమర్చయంతియే శశ్వద్దుర్గాణ్యాతితరంతితే॥

బ్రహ్మవిష్ణు రుద్రులును, ఇంద్రుడును నెద్దేవుని స్తుతిసేయు
చుండురో. ఆపరమేశ్వరుని నర్చించినవారు సకల సంకటములనుండి
విముక్తులగుదురు. ఇట్లు శివారాధనము కష్టముల దొలగించు నది

యనుటంజేసి బ్రహ్మవిష్ణ్వాదులు స్తోత్రములు సేయుటయు నాపన్నివారణమున కేయని యేర్పడుచున్నది.

పరమేశ్వరుఁడు బ్రహ్మవిష్ణ్వాదుల సంహరించుననియు, శాంతిపర్వమునందె యున్నది. ఎట్లన,

శ్లో॥ ఈశ్వరశ్చేతనః కర్తాపురుషః కారణంశివః ।
విష్ణుర్బ్రహ్మశశీసూర్య శ్శక్రోదేవాశ్చ సాన్వయాః ।
సృజ్యతేగ్రస్యతేచైవ తమోభూతమిదం యదా ।
అపరిజ్ఞాతం జగత్సర్వం తదాదేవో మహేశ్వరః ।

చేతనులలోనెల్ల చేతనుండును, నీశ్వరుండునునగు శివుండె సర్వమునకు కారణ భూతుండగును. విష్ణువు, బ్రహ్మ, చంద్రుఁడు, సూర్యుఁడు, ఇంద్రుఁడు సకల దేవతలును నద్దేవుని చేసృజింపఁబడుచును, రక్షింపఁబడుచును, సంహరింపఁబడుచు నుందురు. ప్రళయమునందు నెల్లరను సంహరించి మహేశ్వరుండొక్కండు యుండుననుటచేనీయర్థము తెలియుచున్నది.

ప్రశ్న—భారతమునందుఁ బెక్కుచోట్ల శివుఁడు బ్రహ్మదేవునికంటెను, నారాయణునికంటెను దక్కువయని చెప్పఁబడియున్నది. అది యెట్లుకుదురును?

ఉత్తరం—త్రిమూర్తి కారణుఁడగుసాంబమూర్తియొక్క యంశములైన రుద్రులు కొందఱుగలరు, ఎట్లన, సంహారరుద్రుఁడులోకముల సృష్టికొఱకును, సంరక్షణకొఱకును స్వేచ్ఛచేత బ్రహ్మదేవుని వలననొకప్పుడును, అవాన్తరకల్పములయందు సంహారమునకై విష్ణుదేవునిక్రోధమువలన నింకొకప్పుడును నావిర్భవించియుండెను నీలలోహితరుద్రుఁడు మొదలగువారు మఱికొందఱు రుద్రులును గలరు.

మహాభారతమునను.

శ్లో॥ అనాదినిధనో దేవ శ్చైతన్యాదిసమన్వితః।
జ్ఞానానిచవశేయస్య తారకాదీన్యశేషతః।

అణిమాదిగుణోపేత మైశ్వర్యం నచకృత్రిమం ।
సృష్ట్యర్థం బ్రహ్మణః పుత్రో లలాటాదుత్థితః ప్రభుః ॥

సకలమగు జ్ఞానంబులు నెవ్వనియధీనంబున నుండునో, అణిమాద్యష్టైశ్వర్యంబులు నెవ్వానికి సహజంబులకాని కృత్రిమంబులు గావో అట్టివాఁడును, ఆద్యంతరహితుండును, నగు రుద్రుండు సృష్టినిర్వాహణార్థమై బ్రహ్మదేవునకుఁ బుత్రుఁడుగా నతని లలాటంబుననుండి యావిర్భవించెను. అని యున్నది, గాన దీనిచే రుద్రుఁడు బ్రహ్మాంగసంభవుఁ డాయెనని తెలియుచున్నది. అట్లే, కూర్మపురాణంబున,

శ్లో॥ అహంచ భవతో వక్త్రాత్ కల్పాన్తే ఘోరరూపధృత్ ।
శూలపాణిర్భవిష్యామి క్రోధజ స్తవ పుత్రకః ।

కల్పాంతమునందు నేను ఘోరరూపుండను, త్రిశూలధారినై నీముఖమువల్లనుండి నీక్రోధంబువలన నీకుఁ బుత్రుండనుగాఁ జన్మింతునని విష్ణునుద్దేశించి రుద్రుండు చెప్పినట్లున్నదానింబట్టి హరి క్రోధంబువలనరుద్రుం డొక్కమా రావిర్భవించినట్లు తెలియుచున్నది,

మహాభారతమున, కృష్ణార్జునులు కైలాసమునకు బోయిన ప్రస్తావమునందు,

శ్లో॥ తతః పార్శ్వే వృషాంకస్య బ్రహ్మచారీ వ్యవస్థిత ।
పింగాక్ష స్తపసా శ్రేష్ఠో బలవా న్నీలలోహితః ॥

బ్రహ్మచారియు, తపముచే శ్రేష్ఠుండును, బలవంతుండునగు నీలలోహితుండను రుద్రుండు పరమేశ్వరుని పార్శ్వమున నుండెనని చెప్పఁబడియున్నది.

లోకపాలరుద్రుఁ డీశానదిశయందు నుండునని కూర్మపురాణమునందు,

శ్లో॥ తతేశానస్య భవనం రుద్రాద్యష్టతనోశ్శుభం ।
గణేశ్వరస్య విపులంత త్రాస్తేసగణైర్వృతః ॥

ఈశానదిశయందు సప్తమూర్తియగు నీశానుని భవనంబు గలదు. అందు నాయీశానుండు ప్రమథ గణంబులంగూడి యుండును. అనియున్నది. దీనింబట్టి సంహారరుద్రాంశములగు రుద్రు లనేకు లుండి యున్నట్లు భారతాదులనల్లనె తెలియుచున్నదిగాన మహాభారతమునందు బ్రహ్మ విష్ణువులకంటె రుద్రునకు నికర్షము చెప్పినప్పుడు, ఆయపకర్షము బ్రహ్మవిష్ణ్వాదులవలన నుద్భవించినరుద్రులకు సంబంధించునని గ్రహింప వలయును. అట్లు గ్రహింపకుండునెడ బ్రహ్మవిష్ణువులకునుఁ బూజనీయుఁడని భారతముననె చెప్పఁబడిన పరమేశ్వరునాధిక్యము బాధింపఁ బడి యాగ్రంథమునకె యప్రామాణ్యము నాపాదించును.

కాఁబట్టి, మహాభారతమున సర్వోత్కృష్టుఁడుగాఁ జెప్పఁబడిన నారాయణునకును బూజనీయుఁడుగాఁ బెక్కుచోట్ల చెప్పఁబడిన పరమేశ్వరుఁడే పరబ్రహ్మమనియు, జగత్కారణమనియు నేర్పడుచున్నది.

అన్నం—ఈశ్వరుఁడే పరబ్రహ్మమనుటకు మహాభారతమున నింక నేమైన సాధకములు గలవా?

పండి—శ్రీకృష్ణార్జునులు పాశుపతాస్త్రమును ప్రయోగించు విధమును దెలిసికొనుటకై స్వప్నమున కైలాసయాత్రకుఁ బోయినప్పుడు శ్రీవేదవ్యాసుఁడు శివమహిమము నిట్లు దెలిపెను. ఎట్లన,

శ్లో॥ స్థాయమాసం స్వవైర్దివ్యైః ఋషిభిర్బ్రహ్మవాదిభిః ।
గోప్తారం సర్వలోకానామిష్ట్వా సవరమవ్యయం ।
వాసుదేవస్తు తం దృష్ట్వాజగామశిరసాక్షితిం ।
పార్థేనసహధర్మాత్మాగృణన్ బ్రహ్మసనాతనం ।
లోకాదివిశ్వకర్మాణ మప్రషిమీశానమవ్యయం ।
తమసః పరమంజ్యోతిఃఖంవాయుర్జ్యోతిషాంగతిం ।
స్రష్టారంవారిధారాణాం భువశ్చ ప్రకృతింపరాం ।
దేవదానవయక్షాణాం మనుష్యాణాంచ శాసకం ।

యోగినాంపరమంబ్రహ్మ వ్యక్తంవేద విదాంనిధిం।
పరాపరస్యస్రిష్టారం ప్రతిహర్తారమేవచ ।
కాలకేయం మహాత్మానం శక్రసూర్య గుణోదయం ।
వవందతుస్తదాకృష్ణౌ వాఙ్మనోబుద్ధికర్మభిః ।
యంప్రపశ్యన్తి విద్వాంస స్సూక్ష్మాధ్యాత్మనిదర్శనాత్ ॥
తమజంకారణాత్మానం జగ్మతుశ్శరణంభవం ॥

తా॥ బ్రహ్మజ్ఞులగు దివ్యమహర్షులచే స్తుతింపఁబడుచున్నవాఁడును, సకలలోకములకు రక్షకుఁడును, ధనుర్ధరులలో నగ్రేసరుఁడును చలనములేని పదవిగలవాఁడును నగు పరమేశ్వరుని దర్శించి ధర్మాత్ముండగు శ్రీకృష్ణుఁడు పార్థునితోఁగూడ శాశ్వతమగు నాబ్రహ్మమును స్తుతించుచు శిరముతో నేలవ్రాలెను.

మఱియు, లోకములకు మొదటి సృష్టికర్తయు, ఋషియు, ఈశానుండును, అవ్యయుండును, ప్రకృతికిఁ బరుండును, పరంజ్యోతిస్వరూపుండును, వాయ్వగ్న్యాకాశములకు గారణుండును, జలములను భూమిని సృజించినవాఁడును, దేవదానవయక్షులకు మానవులకును శాసకుండును, యోగనిష్ఠులకు దెలియదగిన పరంబ్రహ్మతత్వమైనవాఁడును, వేదవిదులకు నిధియు, పరాపర వస్తుజాత ములకు సృష్టిసంహారముల జేయువాఁడును, కాలమునకు నధిష్ఠాతయు, మహాత్మయు, సూర్యేంద్రాదులకు దేజము నొసఁగినవాఁడును నగునద్దేవుని శ్రీకృష్ణార్జునులువాక్కుచేతను, చిత్తముచేతను, బుద్ధిచేతను, కాయముచేతను బ్రణమిల్లిరి.

ఇదిగాక, ఏదేవుని జ్ఞాననిష్ఠులు జ్ఞానముచేత నాత్మయందు గాంచుచున్నారో కారణరూపుండును పుట్టుకలేనివాడునునగు నాభవుని శరణు జొచ్చిరి. అని యున్నది. ఇచ్చట యోగులకు పరంబ్రహ్మమని కంఠరవమున చెప్పఁబడియుండుటచే శివుఁడే పరంబ్రహ్మమని తెలియుచున్నది.

మఱియు, వేదవిదులకు నిధియనుటచే పరమానందరూపత్వము తెలుపఁబడియెను. ఎట్లన, అతిదరిద్రునకు నాకస్మికముగా దొరకిన నిక్షేపము బ్రహ్మానందమునకు నుపమానముగా లోకమునఁ గ్రహింపబడుచున్నది. నిజమాలోచింప నిది బ్రహ్మానందమునకన్న నెంతో హీనమైనదేయగును. ఐనను లోకదృష్టియందు దీనికన్న నింకొకటి యెక్కుడైనది లేమిం జేసి పెన్నిధియే బ్రహ్మానందమునకు నుపమానముగా గ్రహింపఁబడుచున్నది. ప్రకృతికి పరుఁడు పరంజ్యోతిస్స్వరూపుఁడు ననుటచే నిత్యము క్తత్వరూపమగు బ్రహ్మధర్మము దెలుపఁబడియెను. ఆకాశాదికారణత్వంబును నిందు గలదుగాన తటస్థమగు బ్రహ్మలక్షణంబు నిర్దేశింపఁబడియెను.

ఇట్లు, అధ్యాత్మవిదులకే తెలియువాఁడనియు, గోప్తయనియు శాసకుఁడనియు, బ్రహ్మధర్మంబులు వివరింపంబడియెను. దీనింబట్టి శివుఁడే పరంబ్రహ్మమని స్పష్టమగుచున్నది.

ఇదిగాక నింకొకచోట శ్రీకృష్ణుని వృత్తాంతముచేతను నీయర్థమేర్పడుచున్నది. ఎట్లన,

ద్రోణపర్వమున మైనాకపర్వతమునందు నారాయణమూర్తి తపము చేసినట్లు వర్ణింపఁబడియెను.

శ్లో॥ ఊర్ధ్వబాహుర్మహాతేజా జ్వలనాదిత్య సన్నిభః ।
షష్టివర్షసహస్రాణి తప త్సైవశతానితు ।
వ్యశోషయత్తదాత్మానం వాయుభక్షోంబు జేక్షణః ।
అథాపరం తప స్తప్త్వాద్వి స్తతో న్యత్పునర్మహత్ ।
ద్యావాపృథివ్యోర్వివరం తేజసాసమపూరయత్ ।
సతేనతపసాతత్ర బ్రహ్మభూతో యథాభవత్ ॥

తా॥ మహాతేజస్వియై అగ్ని సూర్యసన్నిభుండగు పుండరీకాక్షుండు వాయుభక్షుండై చేతులు పైనికెత్తికొని అరువదియాఱువేల

వర్షంబులు తపస్సు చేసి శరీరమును శుష్కింపఁజేసి, మఱియు నంతకు
నెన్నియో మడుంగులధికముగా తపముచేసి భూమ్యాకాశముల వివర
మును తన తేజముతో నింపి, యాతపముచే బ్రహ్మభూతుండై యుండెను,
అనియున్నది. నారాయణమూర్తికి పొందదగిన యింకొక బ్రహ్మభా
వము లేదుగాన నాయన తపము సేయునప్పుడు శివుఁడను నేనని భావించు
శివభావమే బ్రహ్మభావమని గ్రహింపవలయును.

ఇట్లు తపము సేయగా శివుఁడు ప్రత్యక్షమైనప్పుడు నారాయణ
మూర్తి పరబ్రహ్మ ధర్మములతో బెక్కువిధముల స్తుతి చేసినట్లుగలదు
ఎట్లన,

శ్లో॥ సజానుభ్యాం మహీంగత్వా కృత్వాశిరసిచాంజలిం ।
పద్మాక్షస్తం విరూపాక్ష మభితుష్టావభక్తిమాన్ ।
త్వద్భూతా వై భూతకృతో వరేణ్య గోప్తారో యే భువనస్యగోపాః ।
ప్రవిశ్యేమాంపృథివీం యేహ్యరక్షన్ పురాపురాణీతవదేవసృష్టిః ।
శక్త్యాలోకాయథాయాంతి పృథక్త్వాం
తాభిశ్చైక్యం సంక్షయే యాంతి భూయః ।
ఏవంవిద్వాన్ప్రభవం చాప్యయంచ
త్వత్సంభూతం తవసాయుజ్యమేతి ॥

శ్లో॥ భూతం భవ్యం భావి యచ్చాప్యదృష్టం
త్వత్సం భూతాస్సప్తఇమేహిలోకాః ।
భక్తంచ మాం భజమానం భజస్వ
ప్రీత్యామాంవైలోక పితర్మహేశ॥

తా॥ ఆపద్మాక్షుండు మోకాళ్లు నేలమోపి శిరమున నంజలిని
నిడికొని విరూపాక్షు నిట్లని స్తుతించెను.

ఓ దేవా! సృష్టికర్తలగు ప్రజాపతులును, జగమును రక్షించు
నట్టి లోకరక్షకులును నీవలననే సృజింపఁబడిరి. నీవొనరించినట్టి సృష్టి
పురాతనమైనది. ఈలోకంబులు నీశక్తిచే నీనుండి వెల్వడుచు తిరిగి

నీయందుఁ బ్రవేశించుచుండును. సృష్టిలయముల నిట్లు లెఱింగిన వాఁడు నీసాయుజ్యమును పొందగలఁడు. పుట్టినది, పుట్టుచున్నది పుట్టబోవునది సకలవస్తుజాతంబును, సకల భువనంబులును నీవలన జనించుచున్నవి. సర్వలోకజనకుండవగు సోమమహేశ్వరుఁడా! నీకు భక్తుఁడనై సేవించు నన్ను ననుగ్రహింపుము. అని యిట్లు పొగడినట్లును నద్దేవునివలన సకలవరములఁ బొందినట్లును గలదు.

ఇదిగాక, శివుఁడు త్రిమూర్తులను సృజించుచున్నాఁడనియు ఆనుశాసనికమునందుఁ జెప్పఁబడియున్నది. ఎట్లన,

శ్లో॥ సోఽసృజద్దక్షిణాదంగా ద్బ్రహ్మాణం లోకసంభవం ।
వామపార్శ్వాత్తథో విష్ణుం లోకరక్షార్థమీశ్వరః ।
యుగాన్తేచైవసంప్రాప్తే రుద్రింప్రభు రథాసృజత్ ॥

తా॥ ఆపరమేశ్వరుఁడు తన శరీరము కుడిభాగమునుండి లోక సృష్టికై బ్రహ్మదేవుని సృజించెను. అట్లేయెడమభాగము నుండి లోక రక్షణమునకై విష్ణుదేవునిసృజంచెను. కల్పాంత సమయమున లోక సంహారమునకై రుద్రునిఁ బుట్టించెను, అని గలదు.

మఱియు నీశ్వరుఁడు ఆపదలను తొలగించి యీముగ్గురను రక్షించుచున్నాఁడనియు శాంతిపర్వమునఁ జెప్పఁబడియున్నది. ఎట్లన,

శ్లో॥ యంవిష్ణురింద్రశ్శంభుశ్చ బ్రహ్మలోకపితామహః ।
స్తువన్తివివిధైస్తోత్రైర్దేవ దేవంమహేశ్వరం॥
తమర్చయన్తి యేశశ్వ ద్దుర్గాణ్యతితరంతి తే ॥

తా॥ దేవదేవుఁడగు నేమహేశ్వరుని విష్ణుండును, ఇంద్రుండును, రుద్రుండును బ్రహ్మదేవుండును పలువిధములగు స్తోత్రములచే స్తుతించుచుందురో ఆదేవునిఁ బూజించునట్టివార లాపదలనుండి విముక్తులగుదురు. అనియున్నది. ఇచట శివారాధనమాపదలను బోగొట్టునని చెప్పుటచే బ్రహ్మవిష్ణ్వాదులు పరమేశ్వరుని స్తోత్రము చేయుట

యాపన్నివృత్తికొఱకేయనియు, వీరుచేయు స్తోత్రముచే ప్రీతినొందిన పరమేశ్వరుఁడు వీరల రక్షించుచుండెననియు నేర్పడుచున్నది. ఇది గ్రంథకర్తయాశయముగానిచో విష్ణ్వాదులు పరమేశ్వరుని స్తోత్రము చేయుచున్నారనుట నిరర్థకము గాకమానదు.

ఇదిగాక, శివుఁడు త్రిమూర్తులను సంహరించుచున్నాఁడనియు శాంతిపర్వమున గలదు. ఎట్లన,

శ్లో॥ ఈశ్వరశ్చేతనఃకర్తాపురుషః కారణంశివః ।
విష్ణుర్బ్రహ్మాశశీసూర్యశ్శక్రోదేవాశ్చసాన్వయాః ।
సృజ్యంతేగ్రస్యతేచైవ తమోభూత మిదంయదా ।
అప్రజ్ఞాతం జగత్సర్వం తదాహ్యేకో మహేశ్వరః ॥

తా॥ ఈశ్వరుఁడును, జగమునకు చేతనకర్తయు, కారణ పురుషుండగు శివుఁడు విష్ణుని, బ్రహ్మను, ఇంద్రుని, సూర్యచంద్రులను సకలమును సృజించుచును ప్రళయకాలమున భక్షించుచుండును. సకల జగమును లయముసేసిన మహాప్రళయకాలమున పరమేశ్వరుఁ డొక్కఁడే యుండును. దీనింబట్టి సంహారరుద్రుండును భక్షింపఁబడుచున్నాఁడనియే గ్రహింపవలయు. కానిచోఒక్కఁడేయుండుననుటవిరోధించును.

ఈవిధమున బ్రహ్మవిష్ణురుద్రులకును సృష్టిస్థితిలయములను జేయువాఁడని చెప్పినప్పుడు సర్వజగమునకు సృష్టిస్థితిలయకర్తయను నెడనేమి సంశయముండును? దీనింబట్టి యెవ్వనివలన నీభూతములు పుట్టుచున్నవో ఎవ్వనివలన జీవించుచున్నవో ఎవ్వనియందు లయించుచున్నవో అను నర్థముగల శ్రు॥ యతోవాఇమానిభూతానిజాయన్తే అనుశ్రుతిచేతఁ జెప్పఁ బడినలక్షణములుగల బ్రహ్మతత్త్వముశివుఁడేయని నిర్ధారణము చేసెననియేర్పడుచున్నది. ఈయర్థమును దేనికై నిర్ణయింపవలసి వచ్చెననిన, శ్రీ వేదవ్యాసమహర్షి తానురచించిన బ్రహ్మమీమాంసయందు సూ॥ జన్మాద్యస్యయతః ॥ ఎవ్వనివలన నీజగమునకు సృష్ట్యాదులు గలుగుచున్నవో అది బ్రహ్మమని యతోవా అను

శ్రుతిసే విషయవాక్యముగా గ్రహించి చెప్పియుండెను. గానియంత మాత్రమున నాబ్రహ్మమెవ్వరైనది యేర్పడుటలేదు. దానింబట్టి తానె రచించిన మహాభారతమునందు నాసంశయము దొలగింపనెంచి జగజ్జన్మాదికర్త శివుండేయని నిర్ణయింపవలసి వచ్చెనని స్పష్టమగుచున్నది.

ప్రతి—అట్లైని శ్రీభగవద్గీతలయందు శ్రీనారాయణమూర్తియే పరబ్రహ్మమని చెప్పినది యెట్లుసరిపడును ?

అన్నం—ఇది ముఖ్యముగా నాలోచింపవలసినదే ? ఆరాధ్యులవారూ! శ్రీభగవద్గీత మీకు ప్రమాణమగునా ?

పం—కాదని యెన్నడైనం జెప్పితినా ?

అన్నం—భగవద్గీతయందు శ్రీనారాయణమూర్తియే జగత్కారణమని నిర్ణయింపంబడి యుండెగదా? అదిమీకు సమ్మతమగునా?

పండి—నారాయణమూర్తి జగత్కారణమని భగవద్గీతయం దెచ్చట కలదు ?

అన్నం—ఆచార్యులవారూ ! ఊరకున్నారేమి? ఆరాధ్యులవారడిగిన నికి సమాధానము చెప్పుడు.

ప్రతి—ఇదిగో చెప్పుచున్నానువినుడు. శ్రీభగవద్గీతయందు శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వంప్రవర్తతే॥ నేన సర్వజగమునకు కారణమైనవాండను. నావలననే యీజగమంతయుం బ్రవర్తించుచున్నది యని శ్రీభగవానుండు ఉపదేశించియుండెను. దీనింబట్టి శ్రీనారాయణమూర్తియే జగత్కారణమని యేర్పడుటలేదా ?

పండి—ఇంతమాత్రమున నారాయణమూర్తి జగత్కారణమని యెట్లు లేర్పడును ?

ప్రతి—ఏల యేర్పడదు ?

పండి.—అహం సర్వస్యప్రభవః అనుటకు గారణము భగవద్గీతయందే కలదు.

ప్రతి.—ఎట్లు ?

పండి.—వినుడు

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి
భ్రామయన్సర్వభూతానియంత్రారూఢానిమాయయా।
తమేవ శరణంగచ్ఛ సర్వభావేన భారత।
యోలోకత్రయమావిశ్యబిభ ర్త్యవ్యయ ఈశ్వరః ॥

అర్జునా! కర్మయంత్రము నధిష్ఠించియున్న సకల భూతములను మాయచే భ్రమింపఁజేయుచు సర్వభూతముల హృదయమునందును నీశ్వరుండు వసించియున్నవాఁడు. అవ్యయుండగు నేయీశ్వరుఁడు త్రైలోక్యము నావరించి భరించుచున్నాఁడో అప్పరమేశ్వరునే నీవన్ని విధముల శరణుజొచ్చుము. అని మొదలుగా నున్నది.

దీనింబట్టి పరమేశ్వరుఁడు సర్వాంతర్యామిగానుండుటచే నీశ్వర దృష్టితో నేనీ సర్వమునకు కారణభూతుఁడనని శ్రీకృష్ణమూర్తి చెప్పి నట్లు స్పష్టమగుచున్నది. గావున నారాయణమూర్తి జగత్కారణమని యేర్పడుటలేదు:

ప్రతి.—శ్రీభగవాఁనుడు నేన సర్వమునకు కారణభూతుఁడనని చెప్పు చుండగా దానికి నాకంతర్యామియైన యీశ్వరుఁడు జగత్కారణమని యర్థమును మీరు చెప్పుచున్నారు. ఇట్టి యన్యాయ్య మెందేని గలదా?

పండి.—కౌషీతబ్రాహ్మణమనే యుపనిషత్తునందు ప్రతర్దను నుద్దేశించి (ప్రాణోస్మిప్రజ్ఞాత్మాతంమామాయురమృతమిత్యుపాస్వ అని యింద్రుఁడు తన రూపమునే పరమాత్మనుగా భావించి యుపదేశించియుండెను.

ఇట్లే గర్భస్థ వామదేవుండును «అహంమనురభవం సూర్యశ్చ' నేనే మనువును, నేనే సూర్యుఁడనని యుపదేశించియుండెను. ఈయర్థమును బ్రహ్మమీమాంస,

సూ॥ శాస్త్రదృష్ట్యాతూపదేశోవామదేవవత్॥

అను సూత్రమునందు నంతర్యామిదృష్టితో నేన బ్రహ్మమునని గురువు శిష్యునకు నుపదేశించుట కలదని నిర్ణయింపఁబడియున్నది.

కావున, భగవద్గీతయందు శ్రీకృష్ణమూర్తి నేనే సర్వమునకు గారణభూతుఁడనని చెప్పినదియు నంతర్యామి దృష్టితో చెప్పినదే యగును. దానంజేసి యింతమాత్రమున నారాయణమూర్తికి జగత్కారణత్వము సంభవించుననుట కల్ల.

ప్రతి.—అంతర్యామి దృష్టితో నేనే సర్వమునని యుపదేశించుట యుపనిషత్తులలోనున్నను ఆన్యాయము భగవద్గీతలయందు నెట్లు లుపయోగించును?

పండి.—భారతఃపంచమోవేదః। మహాభారత మైదవ వేదమని చెప్పి, భగవద్గీతాసూపనిషత్సు, భగవద్గీతలనే యుపనిషత్తులయందు అని వ్రాసికొనుచుండనగునుగాని గురువు శిష్యునకు నుపదేశించునప్పుడు నేనే సర్వమునని యంతరాత్మదృష్టితో చెప్పునుపనిషత్తులలోని న్యాయము భగవద్గీతలందు నుపయోగించుట విరుద్ధమగునా? కాబట్టి భగవద్గీతలలో శ్రీకృష్ణమూర్తి నేనే సర్వమునకు కారణమని చెప్పినది యంతరాత్మదృష్టితో చెప్పినదే యగును. దీనింబట్టి భగవద్గీతలలోఁ జెప్పఁబడిన జగత్కారణత్వము శ్రీకృష్ణునకు నంతరాత్మయైన పరమేశ్వరునిదే గాని నారాయణమూర్తిది గానేరదు.

అన్నం.—ఆరాధ్యులవారూ! మీరుచెప్పినది బాగుగనేయున్నది గాని శ్రీకృష్ణునంతరాత్మ యీశ్వరుఁడని యేల గ్రహింపవలయు? నారాయణమూర్తియే యని గ్రహించి యందు జెప్పఁబడిన

జగత్కారణత్వము నారాయణమూర్తిదేయని యేలగ్రహింప గూడదు ?

పండి—అది న్యాయ్యమైనచో నట్లే గ్రహింపనగును.

ప్రతి—ఆయర్థము న్యాయ్యమేలకాదు ?

పండి—శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం, బిభర్త్యవ్యయ ఈశ్వరః, సర్వభూత మహేశ్వరం॥ ఈమొదలుగా భగవద్గీతలయందు ఈశ్వర మహేశ్వరాదిశబ్దములు ప్రయోగింపఁబడి యున్నవి. ఆశబ్దములు పరమేశ్వరునిదప్ప దేవతాంతరమును బోధింపనేరవు. అంతరాత్మను నారాయణునిగా గ్రహించునెడ నీశ్వరాది శబ్దములు బాధింపక మానవు, కావున నంతరాత్మ నారాయణుఁడని గ్రహింపననువుపడదు.

ప్రతి—ఈశ్వరాదిశబ్దములు నారాయణమూర్తిని బోధింపవనుట విరుద్ధము. విష్ణుపురాణములయందు నీశ్వరాది శబ్దములు నారాయణునియందు వ్యవహరింపఁబడుచున్నవి కావా ?

పండి—విష్ణుపురాణములయందు ప్రకరణమునుబట్టి యీశ్వరశబ్దము విష్ణుని బోధించుట యుచితమేయగు. లోకమునందు ప్రకరణమునుబట్టి యీశ్వరశబ్దము రాజునుగూడ బోధించును. అంతమాత్రమున నీశ్వరశబ్దము రాజవాచకమగునా ? కానేరదు,

ప్రతి—విష్ణుసహస్రనామములయందు ఈశ్వరాదిశబ్దములు విష్ణునందు ప్రయోగింపఁబడియున్నవి. ఈశబ్దములు విష్ణువాచకములు గానిచో విష్ణు సహస్రనామములయందు నేల ప్రయోగింపఁబడి యుండును? కావున నీశబ్దములు విష్ణువాచకములనుట నిస్సంశయము.

పండి—శ్లో॥ స్తువన్నామసహస్రేణ॥ అని సహస్రనామములు స్తోత్రార్థమై వినియోగింపఁబడుచున్నవి. స్తుత్యర్థములైన యర్థవా

దములకు స్వార్థమునందు తాత్పర్యములేదని పూర్వమీమాంస యందు నిర్ణయింపఁబడియున్నది. సహస్రనామములను బట్టి యర్థనిర్ణయము సేయదలంచినచో గణపత్యాది సర్వదేవతల సహస్రనామములయందును నన్ని దేవతల నామములును నుం డియే యున్నవి, గాన నర్థనిర్ణయమే యశక్యమగును. కాఁబట్టి స్తుత్యర్థముగాక లోకవేదసాధారణ నామార్థముల నిర్ణయింపఁ బ్రవర్తించిన నిఘంట్వాదులచేతనే శబ్దార్థము నిర్ణయింపవల యును. అట్టి నిఘంట్వాదులనుబట్టి యీశ్వరాది శబ్దములు పరమేశ్వరునిదప్ప దేవతాంతరమును బోధింపనేరవని లోగడఁ జెప్పియుంటిని, కావున నీశ్వరాదిశబ్దములు నారాయణ పరము లగుననుట భ్రాంతియేగాని నిజముగా నేరదు.

ప్రతి—గీతలయందు శ్రీకృష్ణమూర్తి నేనె సర్వజగమునకు గారణ భూతుఁడనని చెప్పియున్నదానికి నెచటనో యుపనిషత్తులలోని న్యాయమును దీసికొని వచ్చి యంతరాత్మ దృష్టితోఁ జెప్పె నని యర్థము సేయుట యుచితముగా గన్పట్టుటలేదు. గావున నిందున్న నేననుమాట శ్రీకృష్ణభగవానునే భోధించునని యెంచి శ్రీకృష్ణభగవానుఁడే జగత్కారణమని గ్రహించునెడ నేమి భాధ కలదు?

వండి—శ్రీకృష్ణమూర్తి నేనని చెప్పినదానికి నంతరాత్మయని యర్థము గ్రహింపనిచోఁ బెక్కు దోషములు గలవు. అవి పదంపడి తేటబడగలవు. శ్రీకృష్ణమూర్తి నేనంతకు గారణమునన్నదా నికి శ్రీకృష్ణమూర్తియే యని యర్థము గ్రహించునెడ లోక మున నెవరైన శాస్త్రిగారు గీతలను ప్రవచనము సేయుచు శ్లో॥ అహం సర్వస్య ప్రభవః నేనంతకు గారణ భూతుఁడనని చెప్పగానె యీశాస్త్రిగారె అంతకు గారణమని గ్రహింప వలసి వచ్చుగదా?

ప్రతి—అది యెట్లు వచ్చును? మొట్టమొదలు నేనని చెప్పినవారె యంతకు గారణమని యర్థమగుగాని నడుమనడుమ నేను నేనని ప్రవచనము సేయువారెల్లరు జగత్కారణమని యర్థమగునా? కానేరరు, కావున నిచట మీరు చెప్పినది యుచితముగా లేదు.

పండి—నేజెప్పినది యెట్లైన నగుగాక. గీతలలో నేననిన దానికి నర్థము మొదట నేనన్నవారెగాక, తర్వాతివారు కానేరరనియెగదా? మీయభిప్రాయము.

ప్రతి—అగును.

పండి—అట్లైని మొదట నేను జగత్కారణ మన్న వారెవరు?

ప్రతి—శ్రీకృష్ణభగవానుఁడేయని యందఱకు దెలియునుగదా?

పండి—అట్లుగాదు మొదటనేనని చెప్పినది యీశ్వరుఁడే.

ప్రతి—అట్లని యెచ్చట నున్నది.

పండి—కూర్మపురాణమున నీశ్వరగీతయందు పరమేశ్వరుఁడు తన మహిమమును సనత్కుమారాదులకు నుపదేశించినట్లు చెప్పుచు వేదవ్యాసుం డిట్లు పలికియుండెను. ఎట్లన,

శ్లో॥ సనత్కుమారోభగవాన్సంవర్తాయమహామునిః।
దత్తవానైశ్వరం జ్ఞానం సోపి సత్యవ్రతాయతు।
సత్యవ్రతోపి యోగీంద్రః పులస్త్యాయ మహర్షయే।
ప్రదదాగౌతమాయాథపులస్త్యశ్చప్రజాపతిః॥
అంగిరావేదవిదుషే భరద్వాజాయదత్తవాన్।
జైగీషవ్యాయ కపిలస్తథాపంచశిఖాయచ
పరాశరోపి సనకాత్పితామే సర్వతత్త్వవిత్।
లేభేతత్పరమం జ్ఞానం తస్మాద్వాల్మీకిరాప్తవాన్।
మామువాచపురాదేవ స్సతీదేహాభవాంగజః।
వామదేవోమహాయోగీరుద్రఃకిలపినాకధృత్।

నారాయణోఽపిభగవాన్దేవకీతనయోహరిః।
అర్జునాయస్వయంసాక్షాద్దత్తవానిదముత్తమం।
యదాహంలబ్ధవానుద్రాద్వ్యామదేవాదనుత్తమం।
విశేషాద్గిరిశే భక్తిస్తస్మాదారభ్యమేభవత్॥

తా॥ భగవంతుఁడగు సనత్కుమారుఁడీయీశ్వరగీతను సత్యవ్రతునకు నుపదేశించెను. సత్యవ్రతుఁడను యోగీంద్రుండును పులస్త్య మహర్షికిఁ జెప్పెను. ఆపులస్త్యప్రజాపతియు గౌతమునకు దెలిపెను. అంగిరుడు భరద్వాజునకు నొసగెను. కపిలుండీగీతను జైగీషవ్యునకు పంచశిఖునకుఁ జెప్పెను. నాతండ్రియగు పరాశరమహర్షి సనకునివలన నీగీతలను గ్రహించెను. నాతండ్రివలన వాల్మీకి దెలిసికొనియెను. తొల్లి పినాకధారియగు రుద్రుండు నాకీగీతల నుపదేశించియుండెను. భగవంతుండును దేవకీతనయుండునగు వాసుదేవుండీగీతలను నర్జునునకు నుపదేశించెను. రుద్రునివలన నేనీగీతలను గ్రహించినది మొదలు కొని నాకు పరమేశ్వరునందు భక్తి ప్రబలియుండెను. అనుటంబట్టియు మహాభారతముననె,

శ్లో॥ జ్ఞానంతదైశ్వరం దివ్యం యథావద్విదితంత్వయా।
స్వయమేవహృషీకేశః ప్రత్యువాచ సనాతనః॥
గచ్ఛగచ్ఛస్వకంస్థానం నశోకంకర్తుమర్హసి।
భజస్వపరయాభక్త్యా శరణ్యం శరణంశివం॥

తా॥ అర్జునా! నీవు ఈశ్వరజ్ఞానమును బాగుగ దెలిసికొంటివి వాసుదేవుండె నీకు సనాతనుఁడగు నీగీత నుపదేశించెనుగదా! నీయింటికినేగుము, శోకింపకుము. పరమభక్తితో శరణ్యుండగు శివుని శరణు జొచ్చుము. అని వేదవ్యాసుండు చెప్పిన దానింబట్టియు, మహాభారతములోనిదగు భగవద్గీత యీశ్వరగీతకు ననువాదరూపమైనదే యని యేర్పడుచున్నదిగాన మొదటిదగు నీశ్వరగీతయందు నేనని చెప్పిన వాఁడు పరమేశ్వరుఁడెగాన, తరువాతిదగు భగవద్గీతయందును నేనను

పదమునకు సర్వ మీశ్వరుఁడేయని గ్రహింపక తీరదుగాన జగత్కారణాను పరమేశ్వరుఁడేయని యేర్పడుచున్నది.

ప్రశ్న—భగవద్గీతలలోని నేనను పదమునకు నంతరాత్మయని యర్థము గ్రహింపక శ్రీకృష్ణభగవానుఁడేయని యర్థము గ్రహించునెడ నేమి దోషము?

పండి—గీతారంభమునందు,

శ్లో॥ నత్వేవాహం జాతునాసంనత్వం నేమేజనాధిపాః
నచైవ నభవిష్యామస్సర్వేవయమతఃపరం॥

నేను నీవు ఈరాజులును మనమందఱము పూర్వము లేనివారము గాము ముందు నుండకపోము అని యితరజీవులతోఁబాటు శ్రీకృష్ణమూర్తి తనకును కాలత్రయసంబంధమును జెప్పుటచే జీవత్వమే స్పష్టమగుచున్నదిగాన నేనే అంతకు గారణము ననుచోట నంతర్యామి పరముగా నన్వయింపనియెడ నుపక్రమము విరోధించుట యొక దోషము. ఇదిగాక, శ్రీకృష్ణమూర్తి యీయోగమును సూర్యునకు నుపదేశించితినని చెప్పగానె యర్జునుడు,

శ్లో॥ అవరంభవతోజన్మపరంజన్మవివస్వతః।

వాసుదేవా! నీవినడుమ నాతోఁబాటు పుట్టియుంటివి. సూర్యుం డెన్నడు పుట్టెనో యెఱుంగము. అట్టి సూర్యునకు నీవెట్లు గీతల నుపదేశించితివి అని యడుగగా శ్రీకృష్ణమూర్తి,

శ్లో॥ బహూనిమేవ్యతీతాని జన్మానితవచార్జున।
తాన్యహంవేదసర్వాణి నత్వంవేత్థ పరంతప॥

తా॥ మనమిద్దఱము మొన్ననె పుట్టినవారముగాము. నాకును నీకును పెక్కు జన్మములు గడచినవి. నేను వాని నన్నిటిని నెఱుంగుదును. నీవు వానినెఱుంగవు. గాన నిట్లడిగితివి. నేను పూర్వజన్మమున నుపదేశించితిననుటచే శ్రీకృష్ణమూర్తి తనకు బహుజన్మములు గతించినవని చెప్పిన జీవలక్షణము విరోధించుట రెండవదోషము. మఱియు,

నేనీయోగమును సూర్యునకు నుపదేశించితిననగానే సూర్యునకు నీవెట్లు చెప్పితినని యర్జునునకు సంశయము గలిగినప్పుడు నేనంతకు గారణమునని చెప్పినప్పుడు నీవెట్లు కారణమని యర్జునునకు సంశయము ఏలకలుగకుండును. గావున కారణమును దెలుపు నేననుచోట నెల్ల నంతరాత్మపరముగానె యర్జునుఁడు గ్రహించి యుండెనని యంగీకరింపక తప్పదు. గావున నేననుదానికి శ్రీకృష్ణమూర్తియేయని గ్రహించుట పూర్వోత్తర సందర్భమునకు విరుద్ధమగుట మూఁడవదోషము ఇదిగాక,

శ్లో॥ తతఃపరంతత్పరిమార్గితవ్యం
యస్మిన్గతానవర్తంతిభూయః
తమేవచాద్యం పురుషం ప్రపద్యే
యతఃప్రవృత్తిః ప్రసృతాపురాణీ॥

ప్రకృతి కంటె పరమైనదియు, వెదకదగినదియు, దేనియందుఁ జేరినవారు పునరావృత్తి నొందరో, ఎద్దానినుండి పురాతనమగు సృష్టి వెడలె అట్టిదియు, ప్రకృతికంటె పరమైనదియునగు నీశ్వరతత్త్వమును శరణు జొచ్చుచున్నానని శ్రీకృష్ణమూర్తి చెప్పియుండుటచే శ్రీకృష్ణమూర్తియేయీశ్వర తత్త్వమని చెప్పుట కృష్ణవచనవిరుద్ధమగుటవల్లన దోషము. మఱియు, ఈశ్వరాది శబ్దములకు యోగరూఢిచే ప్రాప్తమగు నర్థమును విడువవలసి వచ్చుట నైదవదోషము. ఇదిగాక,

శ్లో॥ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాంనమస్కురు।
మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోసిమే॥

నాయందు మనసు నిలుపుము. నాకు భక్తుఁడవగుము. నన్నుఁ బూజింపుము. నన్ను నమస్కరింపుము. నీవు నన్నే పొందుదువు. నాకు నీవు ప్రియుడవు గాన నిది నిజమని యొట్టుపెట్టుకొనుచున్నానని శ్రీకృష్ణమూర్తి యర్జునునితోఁ జెప్పియుండెను. నన్ను పొందుదువనుచోట నన్ననగా నంతరాత్మనని గ్రహింపనిచో నర్జునుఁడప్పటికె శ్రీకృష్ణుని పొందియున్నాఁడుగాన పొందుదువనుట విరుద్ధమగును.

నన్ను ననుపదమును నంతర్యామి పరముగా గ్రహింపక వక్తయగు శ్రీకృష్ణుని పరముగానె గ్రహించునెడ అర్జునుడు శ్రీకృష్ణుని పిశాచ తనువుతో పొందవలయునె గాని యాయనను పొందుటకు వేరు మార్గము కన్పట్టదు. గావున గీతాసందర్భ విరోధ మాఱవ దోషము, మఱియు,

శ్లో॥ మద్యాజీ మాంనమస్కురు ।

శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణంవ్రజ ॥

నన్నే పూజింపుము, నన్నే నమస్కరింపుము, సర్వధర్మములను విడచి నన్ను నొక్కనినె శరణు జొచ్చుము. అని గీతలయందు నన్నే పూజింపుమని శ్రీకృష్ణుఁడు పలుమారు బోధించియున్నను అర్జునుఁడు శివునినే పూజించి నట్లు మహాభారతమును బట్టి స్పష్టమగుచున్నది. దీనింబట్టి శ్రీకృష్ణమూర్తి నేను నన్ను అని చెప్పినచోటనెల్ల శ్రీకృష్ణునకు నంతర్యామియగు నీశ్వరుఁడనియె యర్జునుఁడు గ్రహించినట్లు దానికి శ్రీకృష్ణుఁడు సమ్మతించినట్లును విశదమగు చున్నది. గావున నేనను పదమును శ్రీకృష్ణమూర్తి పరముగా గ్రహించుట శ్రీకృష్ణాది తాత్పర్య నిరుద్ధము ఏడవదోషము. ఇదిగాక,

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోస్మి

నేను యాదవులలో శ్రీకృష్ణుండనని చెప్పియుండెను. నేనను పదము అంతరాత్మదృష్టితోఁ జెప్పఁబడినది గాక బాహ్యదృష్టితోఁ జెప్పినదే యగునేని తాను శ్రీకృష్ణుడైనది యెల్లరకు దెలిసినదేగాన నట్లుచెప్పుట హాస్యాస్పదము గాక మానదు. నేననుపదము శ్రీకృష్ణమూర్తి పరముగా నన్వయించుట గీతావచనమునకును విరుద్ధమగుట యెనిమిదవ దోషము.

మఱియు, పూర్వము చెప్పిన విధమున మహాభారతమునం దంతటను నీశ్వరునకే కారణత్వము చెప్పఁబడియున్నది గాన నదియం తయు విరోధమగుట తొమ్మిదవ దోషము.

ఇదిగాక నేననుపదమునంతర్యామిపరముగా నన్వయింపనిచో శ్రీకృష్ణ మూర్తి దేవకీగర్భమున జన్మించినవాఁడగుటను, జాతస్యహి ధృవో మృత్యుః అను న్యాయమునుబట్టి యాయనకు మరణంబును వర్ణింపఁబడి యున్నదిగాన శ్లో॥ అచ్ఛేద్యోయమదాహ్యోయం॥ ఆత్మ ఛేదింపఁదగిన వాఁడుగాని, కాల్పదగినవాఁడుగాని కానేరడని చెప్పిన ఆత్మలక్షణము విరోధించుట పదియవ దోషము.

ప్రతి—భగవద్గీతయందు నీశ్వరునకే కారణత్వము నంగీకరించునెడ శ్రీకృష్ణభగవానుఁడు విశ్వరూపమును గనఁబరచుటచే నాయ నకు విశ్వాత్మత్వము గలదని యేర్పడుటవలన ప్రాప్తించు జగ త్కారణత్వము విరోధింపఁకుండునా?

పండి—విశ్వరూపప్రదర్శనముచే శ్రీకృష్ణునకు విశ్వాత్మత్వముగాని, విశ్వకారణత్వముగాని యేర్పడదు గాన నీశ్వర కారణత్వము నకు బాధకము లేదు.

ప్రతి—తనకు విశ్వరూపత్వము లేనియెడ శ్రీకృష్ణుఁడద్దాని నర్జునున కెట్లు కనఁబరిచెను?

పండి—విశ్వరూప మీశ్వరునిదే యగును. అయినను శ్రీకృష్ణుఁడు యోగశక్తిచే దానిని గనఁబరిచి యుండెను. అంతమాత్రమున విశ్వరూపము శ్రీకృష్ణునిదే యని భ్రమింపఁగూడదు.

ప్రతి—యోగశక్తిచేతనే శ్రీకృష్ణుఁడు విశ్వరూపమును కనబరిచెననుట కేమి ప్రమాణము?

పండి—

శ్లో॥ నతుమాంశక్ష్యసేద్రష్టు మనేనైవస్వచక్షుషా
దివ్యం దదామితే చక్షుఃపశ్యమే యోగమైశ్వరం

అర్జునా! నీవీప్రాకృతదృష్టితో విశ్వరూపమును జూడఁజాలవు గాన నీకు దివ్యదృష్టి నొసఁగుచున్నాను. నాయీశ్వర యోగమును చూడుము.

శ్లో॥ ఏవముక్త్వాతతోరాజన్ మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాసపార్థాయ పరమం రూపమైశ్వరం

అని చెప్పి మహాయోగీశ్వరుఁడగు శ్రీకృష్ణమూర్తి యర్జునునకు నీశ్వర రూపమును కనఁబరచెననుటచే యోగశక్తిచే తనకు గలిగిన యీశ్వర రూపమునే కనబరిచెనని స్పష్టమగుచున్నది. ఇటు లంగీకరింపనిచో పశ్యమే యోగమైశ్వరం= నాయోగమును చూడుమను చోట యోగశబ్దంబును, మహాయోగీశ్వరుండను విశేషణంబును వ్యర్థములుగాక మానవు. ఇదిగాక, అశ్వమేధికపర్వమున, అనుగీతోపక్రమమునందు,

శ్లో॥ విదితంతే మహాబాహో సంగ్రామే సముపస్థితే।
మాహాత్మ్యం దేవకీపుత్రతచ్చతే రూపమైశ్వరం।
యత్తుతద్భవతాప్రోక్తం తదా కేశవసౌహృదాత్ ।
తత్సర్వం పురుషవ్యాఘ్రనష్టం మేవ్యగ్రచేతసః।
మమకౌతూహలం త్వస్తితే ష్వర్థేషు పునఃపునః।
భావాంశ్చద్వారకాంగత్వానాచిరాదేవ కేశవః

శ్రీకృష్ణా! యుద్ధము సంప్రాప్తమైనప్పుడు నీమహిమము దెలిసికొంటిని. నీయీశ్వరరూపమునుగాంచియుంటిని అప్పుడునీవునాయందుఁ బ్రేమచే చెప్పినదంతయు వ్యాకులజిత్తుండనగుటచే మరచితిని. ఆయర్థంబుల దిరుగదెలిసికొన గోరుచున్నాఁడగాన దెల్పుమని యర్జునుండడుగగా,

శ్లో॥ శ్రావితస్త్వం మయాగుహ్యం జ్ఞాపితశ్చసనాతనం।
ధర్మస్వరూపిణం పార్థసర్వాన్ లోకాశ్చశాశ్వతాన్
అబుధ్యాయన్నగృహ్ణీథాస్తన్మే సుమహాదప్రియం।
నూన మశ్రద్ధధానోసి దుర్మేధాశ్చాసి పాండవ।
సహిధర్మస్సు పర్యాప్తో బ్రహ్మణః పదవేదనే॥

అర్జునా! నీకు సనాతనమగు రహస్యమునంతను దెలిపియుంటిని. నీవద్దానిని గ్రిహింపకుండుట శోచనీయము. నీవందు శ్రిద్ధలేమిచే చిత్తంబు నిలుపవైతివి. పరతత్త్వంబు దెలిసికొన నదియ చాలియుండు గదా? అని చెప్పి,

శ్లో॥ నశక్యం తన్మయాభూయ స్తథావక్తుమ శేషతః ।
పరం హిధర్మం కథితం యోగయుక్తేన తన్మయా ॥

నేనప్పుడు యోగనిష్ఠుండనై పరమధర్మము నుపదేశించి యుంటిని గాన నిప్పుడది యంతయు దిరుగఁ జెప్పఁజాలననుటచే గీతోపదేశమే యోగశక్తిచే గావించినట్లు విశదమైనది దీనింబట్టి గీతోపదేశం బును విశ్వరూప ప్రిదర్శనంబును యోగశక్తిచేతనే కనఁబరిచెననియుఁ ఆవిశ్వరూపము పలుమరు ఐశ్వరం, ఈశ్వరుని దేయని చెప్పంబడుటచే త నది కాదనియు స్పష్టమగుచున్నది.

ప్రతి—ఈవిశ్వరూపము శివునిదే యగునెడ, ఆవిశ్వరూపమున నగపడు వారిలో శివుఁడెక్కుండును? విశ్వరూపమునందు నొకచోట శివుఁడునున్నట్లు గీతలయందు నున్నదిగాన నారూపము శివునిది గాదని గ్రిహింపవలయు.

పండి—విశ్వరూవమున నొకచోట శివుఁడున్నాడని చెప్పుశ్లోకమేది,

ప్రతి— శ్లో॥ బ్రిహ్మాణమీశంకమలాసనస్థ
మృషీంశ్చసర్వానురగాంశ్చదివ్యాన్ ॥

పద్మాసనమున నున్నబ్రిహ్మదేవుని, ఈశ్వరుని, మహర్షులను, సర్పములను జూచుచున్నానని యర్జునుఁడుచూచి చెప్పియుండెగదా?

పండి—అర్జునుడుచూచినట్లు మీరు చెప్పుచున్నారు. గాని ఆశ్లోకమున నాయర్థము లేదు.

ప్రితి—ఈశబ్దమునకు నర్థమేమి?

పండి—ఈశ్లోకమునందు ఈశశబ్దము బ్రిహ్మకు విశేషణమగును. గాన ప్రిభువైన బ్రిహ్మయని యర్థము గ్రిహింపవలయు,

ప్రతి—ఎందుచేత?

పండి—ఇట్లు గ్రహింపక యీశశబ్దమునకు శివుఁడని యర్థము గ్రహించినచో పెక్కుదోషములు ప్రాప్తించుగాన నీశశబ్దము బ్రహ్మదేవునకు విశేషణముగానె గ్రహింపవలయు,

ప్రతి—ఆదోషము లెవ్వి?

పండి—ఈశ్లోకమునందు॥ బ్రహ్మాణం=బ్రహ్మదేవుని, ఈశం=శివుని అని యర్థము గ్రహించునెడ దానికి పైననున్న కమలాసనస్థం=అను పదము నెచట నన్వయింపవలయు? కమలాసనస్థం=పద్మాసనమున నున్నవాఁడని గదా యర్థము, ఇది బ్రహ్మదేవునియందు గదా యన్వయింపవలయు? విశేష్య విశేషణముల నడుమ దేవతాంతర వాచకమును ప్రయోగించునెడ, సందిగ్ధార్థత్వమను దోషము కాదా? అదిగాక ఈశ్లోకమున బ్రహ్మాణమీశం అని చెప్పిన తరువాత, ఋషీంశ్చసర్వానురగాంశ్చదివ్యాన్॥ అని ప్రతివస్త్వంతరమునకును సముచ్చయమును దెలుపు చకారములు ప్రయోగింపఁబడి యున్నవి. దీనింబట్టి చకారముతో గూడినదే సముచ్చయమని యేర్పడుచున్నది. ఈశశబ్దమునకు దేవతాంతరమే యర్థమగునెడ నావిధమున నిచటను చకారము ప్రయోగింపఁబడియే యుండును. ఋషీంశ్చ, అని మొదలుగా ఈశంచ, అని చశబ్దము లేకుండుటను, ఈ యీశశబ్దము సుప్రసిద్ధ విశేష్యవిశేషణములైన బ్రహ్మాణం కమలాసనస్థం, అను రెండుపదముల నడుమనుండుటను నీశబ్దము బ్రహ్మకు విశేషణాంతరమే యగుగాని దేవతాంతర వాచకము గానేరదని స్పష్టమగుచున్నది.

ప్రతి—ఐశ్వరం అనుటచేగదా? విశ్వరూపము శివునిదని మీరు సాధించుచున్నారు. అట్లైన, అన్వయేతర పక్షమునందు,

శ్లో॥ ద్రష్టుమిచ్ఛామి తేరూపం వైష్ణవం తన్నిదర్శయ
విష్ణుసంబంధమైన నీరూపమును జూడఁగోరుచున్నాను దానిని కనఁబరుపుమని యుదఁకుఁ డడుగగా, శ్రీకృష్ణమూర్తి,

శ్లో॥ తత స్తస్మై ప్రసన్నాత్మా దర్శయామాస తద్వపుః।
శాశ్వతం వైష్ణవం ధీమాన్దదృశే యద్ధనంజయః॥

సుప్రసన్నుండై పూర్వము ధనంజయునకు గనఁబరిచిన శాశ్వతమైన వైష్ణవరూపమును కనఁబరిచెను. అని యున్నదిగాన వాసుదేవుండు పార్థునకు కనఁబరిచినది వైష్ణవరూపమేయని యేర్పడుచున్నదిగాదా?

పండి.—ఆశ్వమేధికమునందు శ్రీకృష్ణమూర్తి కనఁబరిచిన విశ్వరూపము వైష్ణవమని యున్నను అనుపసంజాత విరోధిన్యాయముచేత ఉపక్రమము ప్రబలమని పూర్వమీమాంస యందుగలదుగాన భగవద్గీతలోని ఐశ్వరం అనుదానికే ప్రాబల్యము నంగీకరించి ఆశ్వమేధ పర్వములోని వైష్ణవశబ్దమునకే యీశ్వర సంబంధమని యర్థము చెప్పక తప్పదు.

ఇదిగాక, త్రివిక్రమోపాసనచే హనుమంతుఁడు కనబరిచిన విశ్వరూపమునకు త్రైవిక్రమమనియు, హానూమతమనియు రెండుపేర్లును గలిగియున్నవి. హనుమంతుఁడు త్రివిక్రమోపాసనచే సాధించిన కతన నావిశ్వరూపము త్రైవిక్రమంబును, హనుమంతుఁడు సాధించినందున హనుమతంబునునగును. అట్లే శ్రీకృష్ణమూర్తి కనబరిచిన విశ్వరూపము ఈశ్వరోపాసనచే సాధింపఁబడినది గాన ఐశ్వరంబనియు, విష్ణునిచే సాధింపఁబడుటచే వైష్ణవంబనియు రెండు పేర్లతో వ్యవహరింపఁబడుట యుచితమేయగును.

ఇట్లుచెప్పిననే,

శ్లో॥ తమేవచాద్యం పురుషంప్రపద్యే

ఆపరమేశ్వరునినే నేను శరణుజొచ్చుచున్నానని గీతలయందే శ్రీకృష్ణమూర్తి చెప్పినది సరిపడుచున్నది. ఇట్లు గ్రహించిననే శ్రీమహా

భారతమున ననేకపర్వములయందు శ్రీకృష్ణమూర్తియే గాక మూల భూతుండగు మహావిష్ణుండును పరమేశ్వరు నారాధించినట్లు చెప్పినది యనుగతమగును. లేనిచో మహాభారతమంతయు విరోధింపకమానదు.

ఈచేసిన విమర్శముంబట్టి శ్రీమహాభారతము శివుడే పరాత్పరుఁడని ప్రతిపాదించుచున్నదని యేర్పడినది. శ్రీమహాభారతమైననో

శ్లో॥ అష్టాదశపురాణాని కృత్వాసత్యవతీసుతః ।
భారతాఖ్యాన మతులంచక్రే తదుపబృంహణం॥

పదునెనిమిది పురాణములను సంగ్రహించిన తరువాత సర్వపురాణార్థ సంగ్రహరూపముగా శ్రీ వేదవ్యాసునిచే రచింపఁబడియె నని చెప్పఁబడియెను. గాన శ్రీమహాభారతములో నిర్ణీతమగు నర్థము నందే సర్వపురాణముల ముఖ్యతాత్పర్యమని గ్రహింపవలయు. దీనింబట్టి,

శ్లో॥ ఇతిహాస పురాణాభ్యాం వేదాన్సముపబృంహయేత్ ।

పురాణేతిహాసములను బట్టియే వేదార్థమును నిర్ణయింపవలయునని యున్నదిగాన పురాణేతిహాసములయందు నిర్ణీతమగు శివపరాత్పరత్వమునందె సకలవేదములకును మహాతాత్పర్యమని విస్పష్టమైనది.

అన్నం—ఆరాధ్యులవారూ? ఇప్పటికి మాధ్యాహ్నిక సంధ్యయతిక్రమించుచున్నది గాన నేటికి సభముగింతము,

(అందఱు నిష్క్రమించిరి)

మతవినోదచర్చ

పంచమాహ్నికము

ముగిసెను

శివము.

శ్రీశివాయ గురవేనమః

# మతవినోదచర్చ.

## షష్ఠాహ్నికము.

తిరుగా నందఱు సభా వేశమైరి.

అన్నంభొట్లు—శ్రీరామాయణ మాదికావ్యము. ఆగ్రంథ మిరువది నాలుగువేలు గ్రంథసంఖ్యగలిగి, యొక్కొక వేయికిని మొదట వరుసగా గాయత్రీమహామంత్రములోని యొక్కొక యక్షరము గలిగియుండుటచే వేదసమ్మతమైయున్నది. ఆ మహాగ్రంథ మెవ్వరి పారమ్యమును జెప్పునో యద్దేవుఁడే పరాత్పరుఁడని నిర్ణయమగును. కావున నందెట్లు గలదో తేల్చుట యుచితము.

ప్రతివాదిభయంకరం—శ్రీమద్రామాయణము సంగతి ఆలోచింప వలసిన దేమున్నది?

అన్నం—ఎందుచేత?

ప్రతి—ఆగ్రంథము శ్రీరామచంద్రుని మాహాత్మ్యమును చెప్పుటకై యేర్పడినది. రామచంద్రమూర్తి శ్రీమన్నారాయణు నవతారమేగదా. దానింబట్టి శ్రీమన్నారాయణమూర్తియే జగత్కారణమని స్పష్టమగుచున్నదిగదా!

అన్నం—ఆరాధ్యులవారూ! ఇది నిజమేనా?

పండి—కడమ సంగతులు నిజమే యగుగాని శ్రీరామాయణము వలన నారాయణమూర్తి జగత్కారణమని యేర్పడుచున్నదనుట నిజము గానేరదు.

ప్రతి—అది యెట్లు?

పండి—నారాయణమూర్తి జగత్కారణమని రామాయణమున నెచట నున్నది?

ప్రతి—శ్రీరామచంద్రుని మాహాత్మ్యప్రకటనమునుబట్టి నారాయణ మూర్తియే పరాత్పరుఁడని యేర్పడును. పరాత్పరుఁ డెవరో వారే జగత్కారణమని స్పష్టమగునుగదా!

పండి—అదియైన నెచట నున్నది?

ప్రతి—బాలకాండమునందు పూర్వము దేవతలు హరిహరులకు కలహము కల్పించి యందు శ్రీనారాయణమూర్తి జయించుటచే, శ్లో॥ అధికంమేనిరేవిష్ణుం=విష్ణువే అధికుండని నిర్ణయించి నట్లు చెప్పఁబడియున్నది. దానింబట్టి పరాత్పరుఁ డెవరైనది యేర్పడుటలేదా?

పండి—మహావిష్ణువు శివు నుద్దేశించి పెక్కుకాలము తపముసేయఁగా నీశ్వరుఁడు ప్రసన్నుండై సకలవరముల నొసఁగి ౹అపిచేత్సమరం ప్రాప్యభవిష్యసిమమాధికః॥ నీకు నాతో సంగ్రామము సంభవించినపుడు నీకే జయము గలుగునని యనుగ్రహించినట్లు ద్రోణపర్వమున చెప్పఁబడియున్న కారణమున నీశ్వరుఁడు తన వరమునుబట్టి తానోడినట్లు నటించియుండనగును. అంతమాత్ర మున నారాయణునకు పరాత్పరత్వ మెట్లు లభించును?

ప్రతి—రామాయణ విచారము నడుమ మీరుభారతమును ప్రస్తావించుట యుచితమగునా!

పండి—భారతము ప్రమాణముకాదా? దాని నేల యుదాహరింప గూడదు?

అన్నం—భారతము ప్రమాణము కాదని యెవ్వరన్నారు! రామాయ

ణమున గలశంకలు రామాయణమునుబట్టియె సమాధానపర చుట యుచితము.

పండి—అట్లేని మీరుచెప్పినట్లు సమాధానము చెప్పెదనువినుడు. రామాయణము నుత్తరకాండమునందు శ్రీరామచంద్రుఁడు లవణాసురుని వధార్థమై శత్రుఘ్ను నంపునపు డాతనిచేతికి నారాయణాస్త్రమునిచ్చి లవణునిచేతియందు రుద్రిదత్తమగు శూలమున్నపు డీయస్త్రము ప్రయోగింపకుము. అదియున్నప్పు డిదియుపయోగపడదనిచెప్పి, 'అదియే' లని శత్రుఘ్నుడడుగగా శ్లో॥ శ్రీమతో నీలకంఠస్య కృత్యంహిదురతిక్రమం॥ అత్యంత పూజ్యుఁడగు శ్రీనీలకంఠు నేర్పాటు నతిక్రమింప నెవ్వరికిని శక్యము గాదనిచెప్పెను. నారాయణాస్త్రము నారాయణమూర్తి రూప మైనదని దానిమహిమము రామాయణమున నెంతో వర్ణింపం బడియున్నది. దీంబట్టి శివుని మహిమంబధికమని తెలియుట లేదా?

అన్నం—బాలకాండమునందు విష్ణుఁడధికుఁడనికలదు. ఉత్తరకాండము నందు నారాయణరూపమగు నారాయణాస్త్రముకన్న రుద్రిదత్తమగుశూల మధికమనుటచే రుద్రుఁడే యధికుఁడని యున్నది. ఇందు దేనింబట్టి నిర్ణయము తేలవలయును?

పండి—బాలకాండలోని వచనము పరశురాముడు చెప్పినది. పరశు రాముఁడైననో గర్వించి యున్నవాఁడెగాక కోపముచే మతి చెడియునున్నవాఁడు. ఉత్తరకాండలోని వచనము శ్రీరామచం ద్రునిది. శ్రీరామచంద్రుఁడన్ననో శ్లో॥ రామోవిగ్రహవాన్ధర్మః అను వచనమునుబట్టి ధర్మవిగ్రహుఁడని ప్రశస్తిగన్నవాఁడు. గావున శ్రీరామచంద్రుని వచనమునుబట్టి రుద్రుండధికుఁడను టయే యథార్థము. ఇదిగాక అశ్వమేధ సమయమునందు,

శ్లో. తేతు రామవచశ్శ్రుత్వా నమస్కృత్వా వృషధ్వజం॥
అశ్వమేధేన దేవేశం పూజయన్తిస్మ నిత్యశః॥

ఋత్విజులు శ్రీరామచంద్రుని మాటవిని వృషధ్వజునకు నమస్కరించి అశ్వమేధముచే నద్దేవునిఁ బూజింప నారంభించిరి. అనుటచే శ్రీరామచంద్రుఁ డశ్వమేధమును శివప్రీత్యర్థమే యాచరించినట్లు స్పష్టమైనదికదా. దీనికి ముందు రాజసూయము చేయనగునని లక్ష్మణుఁడు చెప్పగా రాజసూయము వలదు. అశ్వమేధమే చేయుదమని చెప్పుచు శ్రీరాములవారు,

శ్లో॥ నాన్యం పశ్యామి భైషజ్యమంతరేణ వృషధ్వజం
నాశ్వమేధాత్పరోయజ్ఞః ప్రియస్తస్యైవ మహాత్మనః॥

వృషధ్వజునికన్న సంసారరోగవైద్యుఁడు లేఁడు. ఆద్దేవునకు నిష్టమైనది యశ్వమేధముకన్న వేరొక క్రతువులేదు. అని చెప్పుటచేతను దీనిమీఁద లక్ష్మణుఁ డశ్వమేధముచేత పూర్వకాలమున నొకండు విష్ణు నారాధించెనని చెప్పగా విని శ్రీరాముండు, అశ్వమేధముచే తొల్లి యొకండు శివు నారాధించెనని చెప్పుటచేతను శ్రీరామునకు పరమేశ్వరునందు భక్తి యధికముగా నున్నట్లు స్పష్టమగుచున్నది. దీనిఁబట్టి పూర్వము తనమూలరూపమగు విష్ణురూపమున నీశ్వరు నారాధించి యద్దేవునివలన సకలవరములు పొందెనని భారతమునఁ జెప్పినదియు సరిపడుచున్నది. దీనింబట్టి, శ్లో॥ అధికం మేనిరే విష్ణుం అను బాలకాండవచనముచే విష్ణుపారమ్యము శివపత్త్వపరమూలమెయనిస్పష్టమగుచున్నది.

ప్రతి—శ్లో॥ బ్రహ్మాస్స్వయంభూశ్చతురాననో వా
రుద్రస్త్రిణేత్రస్త్రిపురాన్తకో వా
ఇన్ద్రో మహేన్ద్రస్సురనాయకో వా
[illegible]

నాల్గు ముఖములుగల బ్రహ్మదేవుఁడుగాని, మూఁడు కన్నులుగల రుద్రుఁడుగాని, దేవనాయకుఁడగు మహేంద్రుఁడుగాని రాముడు జంపఁబూనినవాని రక్షింపఁజాలరని హనుమంతుఁడుచెప్పినదానిం బట్టి రుద్రునికంటె రామచంద్రునకు నాధిక్యము సిద్ధించుట లేదా?

పండి—ఈమాట రావణునకు భయము గలిగించుటకై హనుమంతునిచే నిట్లు పలుకబడియెగానను, పూర్వవచనములకు విరుద్ధమైనదిగానను, దీనికి స్వార్థమున తాత్పర్యము లేదు.

ప్రతి—ఇట్లెందేని గలదా?

పండి—సీతాదేవిని చూచి హనుమంతుఁడు చెప్పు మాటలలో

శ్లో॥ మత్తః ప్రత్యవరః కశ్చిన్నాస్తి సుగ్రీవసన్నిధౌ
అహం తావదిహ ప్రాప్తః కింపునస్తే మహాబలాః
నహి ప్రకృష్టం ప్రేష్యన్తే ప్రేష్యన్తే హీతరంజనాః॥

సుగ్రీవునొద్ద నాకంటె దక్కువవాఁడొక్కఁడును లేడు. నేన యిచ్చటికి వచ్చితిని. ఆమహాబలులగు వానరులిచటికి వచ్చునెడ సంశయ మేమిగలదు? ఎవ్వరనైనను తక్కువవాని నంపుదురుగాని యెక్కువవాని నంపుదురా? అని చెప్పియున్నాఁడు. నిజముగా వానరులలో హనుమంతునికన్న నెక్కువవాఁడింకొకడు లేకున్నను వానరులు తప్పక లంకకుఁ జేరి రావణుని జంపగలరని సీతాదేవికి నమ్మకముగలుగుటకై యిట్లు చెప్పియుండెను. ఇట్టిమాటలకు స్వార్థమునందు తాత్పర్యముండ నేరదు.

ప్రతి—సుందరకాండమునందు రావణుడు హనుమంతునిజూచి,

శ్లో॥ కింవైష్ణవం వా కపిరూపమేత్య
రక్షోవినాశాయ పరంసు తేజః।
అచింత్యమవ్యక్తమనంతరూపం
స్వమాయయా సాంప్రతమాగతం వా।

అచింత్యము, అవ్యక్తము, పరమునగు వైష్ణవతేజము తనమాయా శక్తిచే రాక్షసులనశింపఁజేయ తానంతనే వెడలివచ్చెనా! అనువచనమునుబట్టి వైష్ణవతేజమునందు బ్రహ్మలక్షణములు సమన్వయించుటచే విష్ణువే పరబ్రహ్మమని యేర్పడుటలేదా?

పండి.—ఈశ్లోకమునుబట్టి విష్ణునకు పరత్వమేర్పడుటయు నసంగతమే యగును. ఏలన, ఈశ్లోకమునందు కింవైష్ణవంవా, అనుచోట నొకటియు, ఆగతంవా అనుచోట నేరొకటియు రెండు వా శబ్దములు గలవు. దీనింబట్టి యీశ్లోకమున రెండు వాక్యములుగా సమన్వయము చేయవలసినట్లు లేర్పడుచున్నదిగాన, వైష్ణవతేజముగాని, అచింత్యాది బ్రహ్మలక్షణలక్షితమగు పారమేశ్వర తేజముగాని రాక్షసనాశనమునకై తన మాయాశక్తిచేత నిట్లు కపిరూపమునుపొంది వచ్చెనా అని యర్థమగుచున్నది. అచింత్యత్వాది లక్షణంబులైననో కైవల్యమునందు శ్రు॥ అచింత్యమవ్యక్తమనంతరూపం శివం ప్రశాంతమమృతం బ్రహ్మయోనిం... స్వమాయయాకల్పిత విశ్వధామ॥ అను శ్రుతివాక్యము ఈశ్లోకమున ననువాదింపఁబడియెను. దానింబట్టి యీశ్లోకములో చెప్పఁబడిన బ్రహ్మలక్షణములు శివునివేయనిస్పష్టమగుచున్నది

అన్నం.—ఈలక్షణములు నిర్గుణబ్రహ్మమున నన్వయింపగూడదా?

పండి.—నిర్గుణబ్రహ్మమునగాని నిష్ప్రయోజనబ్రహ్మమునగాని మీర లన్వయించుకొనవలసినదె. నిర్గుణబ్రహ్మమునకు రాక్షసుల నశింపజేయవలయునని సంకల్పమెట్లు కలుగును? ఈలక్షణములను వేరు విధమున నన్వయింప నెంతమాత్రము వీలులేదు. ఏలన, విష్ణునందుగాని లేక శివునందుగాని గదా యన్వయింపవలయు. ఆశ్లోకమున రెండు వా శబ్దములుగలిగియుండుటచే విష్ణునకంటె నితరదేవతయందే యన్వయింపవలయునని స్పష్టమగు

చున్నది. విష్ణునందే యన్వయించినచో నేకవాక్యమే యగు గాన వా శబ్దము నిరర్థకమే యగును. దానంజేసియు, కైవల్య శ్రుతివాక్యమే యాశ్లోకమునననువాదింపఁబడియున్నది గానను కైవల్యశ్రుతి శివపరత్వప్రతిపాదకమేగానను నీశ్లోకము శివపరాత్పరత్వప్రతిపాదనముననే వినియోగించుచున్నదని స్పష్టమైనది. ఇదిగాక ఈగ్రంథము మొదటినుండి శివపారమ్యమునేబోధించుచున్నది. ఎట్లన, బాలకాండమున పుత్రకామేష్టియందు,

శ్లో॥ మహాతేదేవతా యాజ్యం జుహావజ్వలితేఽనలే॥

ప్రజ్వలించుచున్న యగ్నియందు మహాదేవునుద్దేశించి యాజ్యమును హోమము చేసెననియున్నది.

ప్రతి—మహాదేవాయ అని సమస్తముగానుండిననే శివుఁడని యర్థమగునుగాని మహాతే-దేవతాయ అనివ్యస్తముగానున్నప్పుడుఆపదములకు శివుఁడని యర్థము గాదని గోవిందరాజులుగారు సిద్ధాంతము చేసియున్నారు.

పండి—అట్లని మహాపురుషశబ్దమునకు నారాయణుఁడని యర్థము గ్రహించు మీరు పురుషసూక్తమునందు॥ పురుషం మహాన్తం॥ అనుచోట వ్యస్తముగానుండుటయేగాక వ్యత్యస్తముగాఁగూడ నున్నప్పుడు నారాయణుఁడే యర్థమని యెట్లు గ్రహించితిరి? ఇదిగాక, మహాతేదేవతాయ అనుచోట మహాదేవుఁడని గ్రహింపనిచో నే దేవునికొఱకని యర్థము గ్రహింతురు? ప్రజ్వలించు నగ్నియందు అని యున్నది గాన నగ్నియందు నగ్నికొఱకనుట యుచితము గాదుగాన నింక నెవరికొఱకు తేల్చవలయును? అగ్నికొఱకని చెప్పినను మీకగులాభము లేదు. కావున నీవచనమునకు శివునికొఱకనుటయే యుచితమైయున్నది. మఱియు, అయోధ్యకాండమునందు,

శ్లో॥ కృతాభిషేక స్సురరాజరామ
స్సీతాద్వితీయ సహలక్ష్మణేన।
కృతాభిషేకో గిరిరాజ పుత్ర్యా
రుద్రస్సవిష్ణు ర్భగవానివేశః

శ్రీరామచంద్రుండు స్నానముచేసి యొకవైపున సీతాదేవితోను, నింకొకవైపున లక్ష్మణునితోను గూడి, ఒకప్రక్క పార్వతీదేవితోను వేరొకప్రక్కన విష్ణునితోను గూడిన భగవంతుఁడగు రుద్రునివలె ప్రకాశించెను. అనియున్నది.

ఇందు శ్రీరామునకు రుద్రుం డుపమానముగా గ్రహింపఁబడియెను. ముఖమునకు చంద్రుని నుపమానముగా గ్రహించినపుడు ముఖముకన్న చంద్రుఁడెన్నిమడుంగు లాహ్లాదకరుఁడుగా నుండునో రసికులకు దెలిసినదే. దానంజేసి యుపమేయముకన్న నుపమానము కోటి గుణాధిక మని యాలంకారికు లంగీకరించి యున్నారు. దీనింబట్టి విష్ణునికన్న రుద్రుండెంత యధికుఁడైనది వ్యక్తమగు చున్నది.

మఱియు నిందు శ్రీరామునకు లక్ష్మణుఁడేస్థానమున నుండునో ఆస్థానమున రుద్రునకు విష్ణుం డున్నట్లును నీశ్లోకము నుబట్టి విశదమగు చున్నది. దీనివలన లక్ష్మణునకు శ్రీరామచంద్రుండు పూజ్యుడైనట్లు విష్ణునకును రుద్రుండు పూజ్యుండని స్పష్టమగుచున్నది.

ప్రతి—రుద్రస్సవిష్ణుః అనుపాఠము సరియైన కోశములయందులేదు. రుద్రస్సనందీయనియె కలదని గోవిందరాజులవారు చెప్పి యున్నారు.

ండి—మీగోవిందరాజులవారు సవిష్ణుః అనుపాఠము నొప్పుకున్న పోనిండు. ఈశ్లోకము నైన నుండనిచ్చిరి. ఇందు సవిష్ణుః అను పాఠము గోవిందరాజులవారు రుద్రస్సనందీ, అనిదిద్దుటయగాక వ్యాఖ్యానమునందు రుద్రస్సవిష్ణురితిపాఠఃకుత్రాపికోశేనదృశ్యతే

రుద్రిస్సవిష్ణుః అనుపాఠము దొరికిన పుస్తకములలో లేదని చెప్పెను. ఆయనకు దొరకిన పుస్తకములలో నీమాటలేనప్పుడు ఇదిలేదని యాయన యేలచెప్పవలసివచ్చెను? ఇది గుమ్మడికాయ దొంగయెనడన బుజము తడువుకొనినట్లున్నదిగదా? దీనింబట్టి ఆపాఠము మార్పుచేసినది యాతఁడేయని తెలియుచున్నది. ఈయనకుదొరకిన పుస్తకములలోలేనియెడ పూర్వము నన్నూరు సంవత్సరములనాడు శ్రీమదప్పయదీక్షితులవారి కెట్లుదొరకెను. ఇదిగాక, గోపీనాధ వెంకటకవి వ్రాసిన రామాయణమునందు నిచ్చోట.

"సీతాలక్ష్మణసహితుండగు శ్రీరామచంద్రుండు కృతావగాహనుండై పార్వతీవిష్ణుసహితుండై యభిషిక్తుండైన భగవంతుండగు రుద్రునిం బోలి యని యున్నదిగాన సవిష్ణుః అను పాఠము వెంకటకవి కెట్లు దొరకియుండెను. ఇందు విమర్శించునెడ ‹రుద్రస్సనందీ› అనునది తెలివితక్కువవానిచే కల్పితమైనట్లు విశదమగును. ఏలన, రుద్రునకు నంది యెదురుగానుండునుగాని ప్రక్కన గూర్చుండువాఁడుగాడు. ఇట్టి నంది రుద్రునకు, శ్రీరామునకు లక్ష్మణుండు వసించుచోట నుండునట్లు వచింప వాల్మీకి యెట్లు సాహసించును? కావున నీశ్లోకమున పాఠము మార్పుచేసి యావ్యాఖ్యాత తన బుద్ధికౌశలమునె వెల్లడించుకొనియెను. మఱియు, రావణవధయైన తరువాత లంకనుండి వచ్చునప్పుడు శ్రీరాములవారు సీతాదేవితో

శ్లో॥ అత్రపూర్వం మహాదేవః ప్రసాదమకరోద్విభుః

ఇచ్చట పూర్వము మహాదేవుండనుగ్రహించెను. అని చెప్పుటచే పరమేశ్వరు ననుగ్రహముననె రావణవధాదికము నాచరించినట్లు తెలియుచున్నది. ఇదియు శివుఁడె పరాత్పరుఁడను నర్థమునె విశదీకరించుచున్నదిగదా!

ప్రతి—ఆశ్లోకమునకు నర్థ మది కాదండీ. ఏమనిన, హేఅత్రిపూరు= ఓసీతా! అమ్మహాదేవః=సముద్రుఁడు, ప్రసాదం= అనుగ్రహ మును, అకరోత్=చేసెను.

అన్నం—సీతకు అత్రపూరు అని పేరుగలదా?

ప్రతి—లేదు. లేదు. త్రపు అనగా సీసము. అది కానిది అత్రపు అనగా బంగారము. బంగారమువోలె మెఱయుచున్న యూరు వులు, తొడలు గలదానా! అని యర్థము.

పండి—ఇందు త్రిపువుగాని లోహములెన్నో యుండగా బంగారమును గ్రహించుట మొదట యప్రసిద్ధము. ఎందైన బంగారమును శరీరమునకు పోల్చుట ప్రసిద్ధముగాని తొడలకు పోల్చుట ప్రసి ద్ధముగాదు. అరటికంబములో, ఏనుగు తొండమో, కరభమో పోల్చుటయె ప్రసిద్ధము. గాన యిది రెండవఅప్రసిద్ధి. బంగారమును తొడలకు పోల్చినచో శరీరమట్టిదిగాదని యనర్థాపత్తియు చేకూ రును.ఇదిగాక శ్రీరాముని అష్టమూర్తియగు పరమేశ్వరుఁడనుగ్ర హించుట యనిష్టమై యష్టమూర్తులలోనేకమూర్తియగు జల తత్వములోను నల్పాంశమగు సముద్రుఁడనుగ్రహించుట మీకు పరమాభీష్టమైనను నిద్ది పూర్వగ్రంథమునకు నిషిద్ధము. ఎట్లన శ్రీరామచంద్రుఁడాగ్నేయాస్త్రమును ప్రయోగింపఁబోవగా సముద్రుండు భయపడి దారియిచ్చినట్లు పూర్వగ్రంథమున నున్నది. దీనికి సముద్రుండనుగ్రహించెననుట విరుద్ధము గదా? మఱియు, అత్ర, పూర్వాం, అని యన్వయింపక, అత్ర పూరు అమ్మహాదేవః అని భేదించుట ఆదికావ్యమునకు నాదికవి కిని నెంతసుగుణాధాయకమో అది సహృదయులకే యెఱుక.

అన్నం—ఈయర్థము చాలశాస్త్రవిరుద్ధమౌగ్యముగానె యున్నది. గాన దీని విమర్శనమింతటితో చాలింపుము.

పం:డి.— ఇదిగాక రావణ యుద్ధసమయమునందు

శ్లో॥ తతోయుద్ధ పరిశ్రాన్తం సమరే చింతయాస్థితం।
రావణంచాగ్రతో దృష్ట్వాయుద్ధాయ సముపస్థితం॥
దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణం
ఉపగమ్యా బ్రవీద్రామ మగస్త్యోభగవానృషిః॥

శ్రీరామచంద్రుఁడు యుద్ధమునసలసి చింతాగ్రస్తుఁడై యుండగా రావణుండెదురుగా యుద్ధమునకుసన్నద్ధుఁడై యుండుటనుజూచి యచ్చటికి దేవతలతోనరుదెంచిన భగవంతుఁడగు నగస్త్యమహాముని ఆదిత్యహృదయము నుపదేశింపగా నిద్దానిమహిమంబున శ్రీరాముండు రావణునివధించినట్టు రామాయణముననే యున్నది. ఆదిత్యహృదయ మెట్లున్నదనిన,

శ్లో॥ బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే।
భాస్వతేసర్వభక్షాయ రౌద్రాయ వపుషేనమః

బ్రహ్మ విష్ణు రుద్రులకునధీశుండును, దివ్యతేజస్వియు, సర్వభక్షుండును, రుద్రుని శరీరంబునునైన సూర్యునికొఱకు నమస్కారము అని యున్నది, దీనింబట్టి త్రిమూర్తులకు నధీశుండగు శివునినే బోధించుచున్నదని స్పష్టమగుచున్నది. దీనింబట్టి రామాయణమునందు గాయత్ర్యర్థమే ప్రతిపాదింపఁ బడియెనని యేర్పడుచున్నది. రామాయణమున నొక్కొక వేయిగ్రంథము మొదటను గాయత్రి మహామంత్రములోని యక్షరముల వరుసగాజేర్చిన వాల్మీకి యాశయము స్పష్టమగుచున్నది. ఇట్లు మొదటనుండి గ్రంథకర్త వచనములను బట్టియు శ్రీరామచంద్రుని వాక్యములనుబట్టియు పరమేశ్వరుఁడె పరాత్పరుఁడను సర్వవేద సిద్ధాంతమే యీగ్రంథమునకు వ్యంగ్యమగును, దానంజేసి యీగ్రంథము శ్రుతిసమ్మత మనియు, ఉత్తమకావ్య మనియు ప్రశస్తిని వహించినది.

ప్రతి—ఈగ్రంథమునకు ప్రధానమైన దిదికానేరదు. ఇంక నెద్దియనిన భగవంతుని ప్రపత్తి ముఖ్యము. భరన్యాసవిద్య అని దానికి పేరు? నన్ను దరింపఁజేయు భారము నీదియని సర్వభారమును భగవంతుని మీఁదనె యునుచుట. ఇది యొక్కమారు గావించినను తనదేహావసానమునందు గతిగాని, స్మృతిగాని యేదియు లేకయె ముక్తి లభించును. ఇది కడమ యన్ని యుపాయముల కన్న సులభమైనది. దీనిని విభీషణుఁ డాచరించియున్నాఁడు. గాన విభీషణ శరణాగతియె రామాయణమునకు ముఖ్యమని మామతస్థు లంగీకరించియున్నారు.

అన్నం—(గుండెలు గొట్టుకొనుచు) అమ్మల్లో ఇది మంచియుపాయమే ఆచార్యులవారూ! స్వామీ! నన్ను కడతేర్చు భారమంతయు నీదేయని యొక్కమారు చెప్పి జీవితకాలమెల్ల యథేచ్ఛముగా విహరించినను కొనకు ముక్తి వచ్చునండీ!

పండి—ఏదైన రానిండు. అది మనకు ప్రకృతముగానేరదు. విభీషణ శరణాగతి వాచ్యముగాని వ్యంగ్యముగాదు. శ్రీరామాయణ ముత్తమకావ్యము కాకున్న పోనీ యని వాచ్యమగు విభీషణశర ణాగతినే ప్రధానప్రతిపాద్యముగా నంగీకరింపనెంచినను విభీషణ శరణాగతి యాకావ్యమునకుఁ బ్రధానము కానేరదు.

ప్రతి—అదియేల?

పండి—ఈకావ్యమునందు మూఁడు శరణాగతులు గలవు. వానిలో విభీషణుఁడు శ్రీరాముని శరణుజొచ్చినది యొక్కటి, సుగ్రీవంశర ణంగతః అనుటచే శ్రీరామచంద్రుఁడు సుగ్రీవుని శరణుజొచ్చి నది యొక్కటియు, శ్లో॥ త్రీఁల్లోకాన్ సంపరిక్రమ్యతమేవ శర ణంగతః॥ కాకము రామాస్త్రభయమున ముల్లోకములు దిరిగి

శ్రీరామచంద్రునినే శరణుజొచ్చెననుటచే కాకముదగు శరణాగతి యొక్కటియు నగును. వీరిలో విభీషణుఁడు రాజ్యార్థమై శ్రీరాముని శరణుజొచ్చెను. శ్రీరాముఁడు భార్యారక్షణార్థమై సుగ్రీవుని శరణుజొచ్చెను. కాకమైననో ఆత్మరక్షణార్థమై శ్రీరాముని శరణుజొచ్చెను. రాజ్యము, భార్య, ప్రాణము నను వానిలో పూర్వపూర్వముకన్న నుత్తరోత్తరము శ్రేష్ఠముగాన భార్యారక్షణార్థమైన శ్రీరాముని శరణాగతియో, ఆత్మరక్షణార్థమైన కాకముదగు శరణాగతియో ముఖ్యమగును.

ప్రశ్న—ఈ మూటిలో నుత్తరోత్తరము శ్రేష్ఠమనుట యెట్లు?

ప్రతి—శ్లో॥ రాజానం ప్రథమం విందేత్తతోభార్యాంతతోధనం।

తన సంరక్షణమునకై ముందు మంచిరాజుగల దేశమును వెదకికొనవలయు. తరువాత నందు గృహము నేర్పరుచుకొని సుఖంబుండుటకై భార్యను గ్రహింపవలయు. అట్టి భార్యను పోషించుటకై ధనము నార్జింపవలయు, ననుటచే నన్వయముఖమునను

శ్లో॥ ఆపదర్థం ధనంరక్షే ద్దారాన్ రక్షేద్ధనైరపి।
ఆత్మానం సతతం రక్షేద్దారైరపిధనైరపి॥

ఆపన్నివృత్తికై ధనము కాపాడవలయును. ధనములచేత భార్యను రక్షించుకొనవలయును. భార్యచేతను, ధనముచేతను తనను రక్షించుకొనవలయుననుటచే వ్యతిరేక ముఖమునను ధనము, భార్య, శరీరము ననువానిలో నుత్తరోత్తరము శ్రేష్ఠమని నీతిశాస్త్రములయందు స్పష్టీకరింపఁబడియున్నది. దీనింబట్టి భార్యారక్షణార్థమైన శ్రీరామశరణాగతియు, ఆత్మరక్షణార్థమైన కాకముదగు శరణాగతియు రాజ్యార్థమగు విభీషణుని శరణాగతికన్న ప్రధానములుగాన విభీషణశరణాగతి ప్రధానము గాదని యేర్పడినది.

ప్రశ్న—విభీషణుఁడు శ్రీరాముని శరణుజొచ్చినది ముక్త్యర్థముగాదు. రాజ్యార్థమే యని దేనిచే తెలియును?

పండి—విభీషణుఁడు రాగానె హనుమంతుఁ డిట్లని యెను.

శ్లో॥ ఉద్యోగం తవసంప్రేక్ష్యమిథ్యావృత్తంచ రావణం
వాలినంచహతం శ్రుత్వాసుగ్రీవంచాభిషేచితం॥
రాజ్యంప్రార్థయమానశ్చబుద్ధిపూర్వమిహాగతః॥

విభీషణుఁడు నీయుద్యమమును, రావణుని దుర్ణయమునుగని పెట్టి నీవు వాలిని జంపి రాజ్యమున సుగ్రీవుని నభిషిక్తునిచేసితివని తెలిసికొని రాజ్యముగోరి బుద్ధిపూర్వకముగా నిచటి కరుదెంచెను. అనుటచేత విభీషణుఁడు రాజ్యముగోరియే శ్రీరామునాశ్రయించినట్లు తెలియుచున్నది. అప్పుడే సుగ్రీవాదుల నవలోకించి శ్రీరాముఁడు

శ్లో॥ నవయంతత్కులీనాశ్చరాజ్యకాంక్షీచ రాక్షసః।
పండితాహిభవిష్యంతి తస్మాద్గ్రాహ్యోవిభీషణః॥

మనము రావణుని రాజ్యము నపహరింప నాతని కులమువారము కాము. విభీషణుఁడు రాజ్యము గోరివచ్చినవాఁడు. ఈతనివలన మన మచ్చటిమర్మముల దెలిసికొన నగును. కావున నాతనిని రాబట్టుటయ యుచితమగును. అని పలికెను. శ్రీరామచంద్రుని వచనమును బట్టియు విభీషణుఁడు రాజ్యకాంక్షియనియె తెలియుచున్నది. ఇదిగాక, నాగపాశ బద్ధుఁడైనప్పుడు శ్రీరామచంద్రుఁడు,

శ్లో॥ యన్మయానకృతోరాజా రాక్షసానాంవిభీషణః।
మిథ్యాప్రలాపినం మాంచ ప్రవక్ష్యంతి నసంశయః॥

నేను విభీషణుని రాక్షసులకు రాజునుగా జేయనైతిని. నన్నసత్యవాదినిగా జనులు చెప్పికొందురనియు శోకించియుండెను.

ప్రతి—విభీషణుఁడు మోక్షమును ప్రధానముగాఁగోరి శ్రీరామచంద్రుని శరణుజొచ్చినను రాజ్యము ఆనుషంగిక లాభముగా నుండ నగును. దానింబట్టి యీవచనములు సరిపడును. ఇట్లుండ నీవచనములనుబట్టి విభీషణుఁడు రాజ్యమునుమాత్రము గోరియె శరణు జొచ్చెనని దేనినిబట్టి యేర్పడును?

పండి—రామలక్ష్మణులు నాగపాశ బద్ధులైనప్పుడు విభీషణుఁడు,

శ్లో॥ యయోర్వీర్యంసమాశ్రిత్య ప్రతిష్ఠాకాంక్షితామయా।
తావుభౌ దేహనాశాయ ప్రసుప్తౌపురుషర్షభౌ॥

నేనెవ్వారల పరాక్రమము నాశ్రయించి నిలువబడ నాశించితినో ఆపురుషశ్రేష్ఠులు దేహనాశమునకై బడియుండిరని శోకించెను. దీనిం బట్టి ముక్తినొందుకోర్కి విభీషణునకు లేనట్లే స్పష్టమగుచున్నది. ఏల నగా, శ్రీరాముడు విష్ణువనుభావము విభీషణునకు నుండినప్పుడుగదా విభీషణుఁడు మోక్షముగోరి శ్రీరాము నాశ్రయించెనని కల్పింపనగును. ఈశ్లోకమునుబట్టి విభీషణునకు నిట్టిభావము లేనట్లే ధ్రువమగుచున్నది. శ్రీరాముడు విష్ణువనుభావ మాతనికి నుండునెడ నాగపాశ బంధముచే మూర్ఛితులగువారింజూచి యీతఁడట్లేల ప్రలపించును? విష్ణునకిట్టి యాపద యెుకప్పుడును సంభవింపదు. కొంచెముకాల మిట్టులభిన యించుటమాత్రమని యాతని కేలతోపకుండును? కావున విభీషణ శరణాగతి మోక్షార్థముకాదని విశదమగుచున్నది.

ప్రతి—అదిమోక్షార్థముకానిచో విభీషణుఁడు,

శ్లో॥ పరిత్యక్తా మయాలంకా రాజ్యానిచ సుఖానిచ।
లంకను, రాజ్యమును, సుఖమును నన్నిటిని వదలిపెట్టితినని విరక్తితోఁ జెప్పుట యెట్లుసంభవించును? కావున విభీషణుఁడు ముక్తిగోరియె శరణు జొచ్చెను.

పండి—లంకాదులను వదలిపెట్టితినని విభీషణుఁడు చెప్పినది వానియందు కేవలము విరక్తితోఁగాదు; రామచంద్రుఁ డనుగ్రహించి యిచ్చునెడ గ్రహింపవలయు ననియు, లేనిచో విడువవలయు ననియు నభిప్రాయము గ్రహింపవలయు.

ప్రతి—ఈయభిప్రాయము దేనినిబట్టి యేర్పడును?

పండి—శ్లో॥ పరిత్యక్తా మయాలంకా రాజ్యానిచ సుఖానిచ॥ అను శ్లోకమున నుత్తరార్థమునుబట్టి యీయర్థము తెలియుచున్నది. అదియేదనిన,

శ్లో॥ భగద్గతంమేరాజ్యంచ జీవితంచ సుఖానిచ॥

మహారాజా! నారాజ్యము, నాజీవితము, నాసుఖము మొదలుగా నంతయు నీచేతిలోనున్నదని పలికెను. దీనింబట్టి నీవనుగ్రహించి యిచ్చునెడ గ్రహింతునను రాజ్యకాంక్ష వ్యక్తమగుచునె యున్నది. కావుననే యాతనిభావమును గనిపెట్టి 'క్రియా కేవలముత్తరం' అను న్యాయమునుబట్టి యాతనికి లంకా రాజ్యాభిషేకము గావించెను. అప్పుడు రావణుని చేతిలోనున్న రాజ్యమును తాను విభీషణున కొసఁగుట యయుక్తమని లోకులు భావింతురని యెంచి

శ్లో॥ అహత్వా రావణంసంఖ్యే సపుత్రం సహబాంధవం।
అయోధ్యాం నప్రవేక్ష్యామి, త్రిభిస్తైర్భ్రాతృభిశ్శపే॥

నేను రణరంగమున పుత్రమిత్రాదిసహితుఁడగు రావణుని వధిం పక అయోధ్యానగరమును బ్రవేశింపను. నాముప్వురు తమ్ములతోడని యొట్టుపెట్టుకొనియెను. రావణుని బలాబలములను దెలిసికొనక యిట్టి ప్రతిజ్ఞసేయుటయుననుచితమని లోకులు శంకింతురని యెంచి ముందుగనే

శ్లో॥ ఆఖ్యాహిమమతత్త్వేనరాక్షసానాంబలాబలం।

రాక్షసుల బలాబలములను నున్నరూపున నాకు దెలుపుమని యదియంతయు నాతనివలనం దెలిసికొనియెను. విభీషణుఁడు చెప్పిన

దానింబట్టి రావణుని గట్టెల్ల దెలిసికొని శ్రీరామచంద్రుఁడు రావణుని గెల్చినట్లె భావించి విభీషణుడు తనయందు దృఢవిశ్వాసము గలిగి జరుగబోవు సంగ్రామమున దనకుఁ దగు సాహాయ్యకము సేయుటకై ముందుగనే యాతనిని లంకారాజ్యమునకు నభిషిక్తుని గావించెను. ఇందు గనఁబరిచిన వచనములంబట్టి విభీషణుడు రాజ్యార్థి యేయని విశదమగుచుండ నతఁడు మోక్షార్థియనియు నాతని శరణాగతి ముఖ్యమనియు వచించుట నిర్మూలము.

వెనుక జెప్పిన రామాయణ వచనములంబట్టి శ్రీరామచంద్రునకు పరమేశ్వరునందు భక్త్యతిశయ మున్నట్లు స్పష్టమైనది. దీనింబట్టి పరమేశ్వరుండె పరాత్పరుండను సర్వవేద సిద్ధ సిద్ధాంతమే శ్రీవాల్మీకి రామాయణమునకుఁ బ్రధాన ప్రతిపాద్యమగు వ్యంగ్యమనియు— దానంజేసియే యీ గ్రంథము శ్రుతి సమ్మతమనియు నేర్పడియెను.

అన్నం—ఆచార్యులవారూ! విమర్శించు నెడ కొనకు వాల్మీకి రామాయణముగూడ మీ మతమునకు ననుకూలము గాదని యే యేర్పడియె గదా?

ప్రతి—అదియేల?

అన్నం—ఉత్తర కాండమున శ్రీరామచంద్రుఁ డశ్వమేధము నీశ్వర ప్రీతికై చేసి నట్లును, నారాయణమూర్తి భృగు శాపమున దశావతారముల నెత్తినట్లును గలదుగాన నా కాండము వాల్మీకి కృతము గాదని చెప్పి ప్రమాణము గాదని యంగీకరించు చున్నారుగదా?

ప్రతి—ఉత్తరకాండను ప్రమాణము గాదు నిజమే.

అన్నం—పూర్వ రామాయణమున నైనను ఆదిత్య హృదయము నంగీకరింతురా?

ప్రతి—అది ప్రక్షిప్తము.అనగా ఇతరులు చేసి కలిపినదే.

అన్నం—కడమ చోట్లనైనను దిద్దకుండ రామాయణమును గ్రహించితిరా?

ప్రతి—ఎక్కడ దిద్దితిమి.

అన్నం—అయోధ్యా కాండమున 'రుద్రస్సవిష్ణుః' అనుచోట 'రుద్రస్సనందీ' అని దిద్దవలసి వచ్చెనుగదా?

ప్రతి—మతాంతరులె 'రుద్రస్సవిష్ణుః' అని దిద్దినందున దానిని మాయాచార్యులవారు సవరించిరి.

అన్నం—అదిగాక—కడమచోట్ల నపార్థములు చెప్పితిరి గదా?

ప్రతి—అది యెక్కడ?

అన్నం—మహాతేదేవతాయాజ్యం. అనుచోటను, 'అతపూర్వం మహాదేవః' అను చోటను గ్రంథకర్త పరమేశ్వరుని మహాదేవ పదముతో గ్రహించి యాపదమునఁ దనకుగల యభిరుచిని వెల్లడించియుండ నాపదమునకు నగ్నియని యొకచోటను, అమ్మహాదేవః, అని ఛేదించి దానికి సముద్రుఁడని వేరొకచోటను నిట్టి యపార్థమును చెప్పితిరి గదా?

ప్రతి—సదర్థములె.

అన్నం—సదర్థము లెంతమాత్రముగావు. ఇవి పెడర్థములేయని విను వారికి విశదమగుచునె యున్నది.

ఇట్లు కొంత గ్రంథము వాల్మీకి చేయనే లేదనియు మఱి కొంత ప్రక్షిప్తమనియు మఱికొంత యసంగతార్థమనియు, మఱికొంత క్లిష్టార్థమనియు, వాల్మీకి చేసిన యాదికావ్యమును బీభత్సముసేయక మొదలేయిది శివపురాణములవోలె మాకుఁ బ్రమాణము గాదనిననో యెంత బాగుండును? మీకథ యుండనిండు. ఇపుడిచట సారాధ్యులవారిని [illegible] వలసియున్నది.

యాపన్నివృత్తికొఱకేయనియు, వీరుచేయు స్తోత్రముచే ప్రీతినొందిన పరమేశ్వరుఁడు వీరల రక్షించుచుండెననియు నేర్పడుచున్నది. ఇది గ్రంథకర్తయాశయముగానిచో విష్ణ్వాదులు పరమేశ్వరుని స్తోత్రము చేయుచున్నారనుట నిరర్థకము గాకమానదు.

ఇదిగాక, శివుఁడు త్రిమూర్తులను సంహరించుచున్నాఁడనియు శాంతిపర్వమున గలదు. ఎట్లన,

శ్లో॥ ఈశ్వరశ్చేతనఃకర్తాపురుషః కారణంశివః ।
విష్ణుర్బ్రహ్మశశీసూర్య శ్శక్రోదేవాశ్చసాన్వయాః ।
సృజ్యతేగ్రస్యతేచైవ తమోభూత మిదంయదా ।
అప్రజ్ఞాతం జగత్సర్వం తదాహ్యేకో మహేశ్వరః ॥

తా॥ ఈశ్వరుఁడును, జగమునకు చేతనకర్తయు, కారణ పురుషుండగు శివుఁడు విష్ణుని, బ్రహ్మను, ఇంద్రుని, సూర్యచంద్రులను సకలమును సృజించుచును ప్రళయకాలమున భక్షించుచుండును. సకల జగమును లయముసేసిన మహాప్రళయకాలమున పరమేశ్వరుఁ డొక్కఁడే యుండును. దీనింబట్టి సంహారరుద్రుండును భక్షింపఁబడుచున్నాఁడనియే గ్రహింపవలయు. కానిచో ఒక్కఁడేయుండుననుటవిరోధించును.

ఈవిధమున బ్రహ్మవిష్ణురుద్రులకును సృష్టిస్థితిలయములను జేయువాఁడని చెప్పినప్పుడు సర్వజగమునకు సృష్టిస్థితిలయకర్తయను నెడనేమి సంశయముండును ? దీనింబట్టి యెవ్వనివలన నీభూతములు పుట్టుచున్నవో ఎవ్వనివలన జీవించుచున్నవో ఎవ్వనియందు లయించుచున్నవో అను నర్థముగల శ్రు॥ యతోవాఇమానిభూతానిజాయన్తె అనుశ్రుతిచేతఁ జెప్పఁబడినలక్షణములుగల బ్రహ్మతత్త్వముశివుఁడేయని నిర్ధారణము చేసెనని యేర్పడుచున్నది. ఈయర్థమును దేనికై నిర్ణయింపవలసి వచ్చెననిన, శ్రీ వేదవ్యాసమహర్షి తానురచించిన బ్రహ్మమీమాంసయందు సూ॥ జన్మాద్యస్యయతః ॥ ఎవ్వనివలన నీజగమునకు సృష్ట్యాదులు గలుగుచున్నవో అది బ్రహ్మమన్ని యతోవా అను

పండి—అధ్యాత్మరామాయణము ముద్రణమునకు వచ్చినప్పుడు ఈ గ్రంథము కర్తృనష్టముగానుండిన కతన నప్పటి పండితులు యోజించి యీ గ్రంథము విశ్వామిత్ర సృష్టిగా నడుము నేర్పడియె నని గ్రహించి బుద్ధిమంతులీ రహస్యముగనిపెట్టుదురని భావించి యిది విశ్వామిత్ర కృతమని ప్రచురించిరి. అది మొదలుకొని తమవాదమునకు ననుకూల ముగానున్న కారణమున నిది నిజముగా విశ్వామిత్ర కృతమేయని కొందఱు విశ్వసించు చున్నారు. ఈరహస్యమును శ్రీకాళహస్తి నగర వాస్తవ్యులును తత్సమాస్థాన మహా పండితులునగు బ్రహ్మశ్రీ లక్ష్మీనృసింహ శాస్త్రిలవారు సెలవిచ్చి యుండిరి. ఇట్లు వ్యాసప్రోక్త ముగాక విశ్వామిత్ర సృష్టిగా నేర్పడిన గ్రంథమునుబట్టి పరమేశ్వరుడు పార్వతీదేవికి రామతారకము నుపదేశించెననుట యెట్లు విశ్వాసార్హ మగును?

అన్నం—ఆరాధ్యులవారూ! మీవాదమంతయు విపరీతమే. అధ్యాత్మ రామాయణము విశ్వామిత్ర సృష్టిగా నేర్పడియెనని మీరు సాధించు కొనగలరా?

పండి—అట్లుగాక, ఇది యార్షమేయని మీరు సాధించుడు.

అన్నం—ఇది యార్షముగాదని మీరెట్లు సాధింతురు?

పండి—మహాభారతమును వేదవ్యాసుఁడు రచించెనని బహు గ్రంథ ములయందు గలదు. అట్లే శ్రీమద్రామాయణమును వాల్మీకి రచించినట్లును పెక్కుచోట్ల నుడువఁబడియున్నది. ఇట్లె యధ్యాత్మరామాణమును విశ్వామిత్రుడు రచించెనని ఆర్ష గ్రంథములలో నొక్కచోనైనను నుడువఁబడియుండలేదు. దానంజేసి యిది విశ్వామిత్రకృత మనుట విశ్వాసార్హము గాదు.

అన్నం—గ్రంథాంతరములందు బ్రస్తావింపఁబడిన మాత్రన విశ్వామిత్ర కృతము గాదననగునా ?

పండి—అంతమాత్రముననే గాక ఈ గ్రంథము పరస్పరవిరుద్ధముగా నున్న కతనను ఇది యార్ష మని యంగీకరింప నర్హముగాదు.

అన్నం—అది యెట్లు ?

పండి—శివుడు శ్రీరామమంత్రమును పార్వతికి బోధించినట్లును శ్రీరాముడు రావణుని వధించి తన్మూలమగు బ్రహ్మహత్య నివర్తింప శివలింగమును బ్రతిష్ఠించినట్లును నా గ్రంథమునందు గలదు. ఇది పరస్పరవిరుద్ధము. ఇదిగాక రామేశ్వరపదమునకు నర్థమేమని యింద్రాదులు మహావిష్ణు నడుగగా, రామస్యేశ్వరః= రామునకుఁ బ్రభువు శివుడని చెప్పెననియు శివుని నడుగగా రామః ఈశ్వరోయస్య నాకు రాముఁడే ప్రభువని చెప్పెననియు బ్రహ్మదేవుని నడుగగా రాముడు శివుడు నీ యిద్దఱును ప్రభువులే యని చెప్పెననియు నీ గ్రంథమున నున్నది. ఇంతకన్న విరుద్ధవాదము లెందును లేవు. రాముడె నాకు దేవుడని శివుఁడును శివుఁడె నాకు దేవుఁడని రాముడును చెప్పినట్టు లొక్క గ్రంథముననె యుండుట వాఙ్మయమున నెందును లేదు. ఇట్టి విరుద్ధవాదము విష్ణుపురాణములయందుగాని, శివపురాణములయందుగాని, భారతమునగాని, భాగవతమునగాని, శ్రీమద్రామాయణమునగాని యెందును గనబడదు. ఇట్టి విరుద్ధగ్రంథమార్ష మనినచో తత్కర్తయగు ఋషిదైన యవ్యక్తత హాసావహము గాకుండదు. కావున నిది యార్ష మన నెంతమాత్రము జెల్లదు.

అన్నం—ఆర్షముగానిచో దీని నెవ్వరు రచించిరి ?

పండి—పురుషులలో నెవ్వరో రచించిరి. గాన నిది పౌరుషేయము.

అన్నం—పౌరుషేయమైనచో నంగీకారార్హముగాదా?

పండి—పౌరుషేయమైనను పరస్పరవిరోధము లేకున్నను యుక్తి యుక్తముగానైన యున్నను నంగీకరింపనగును.

అన్నం—అధ్యాత్మరామాయణము యుక్తియుక్త మేలకాదు?

పండి—శివుడు పార్వతికి రామమంత్రము నుపదేశించె ననుట యుక్తి విరుద్ధము.

అన్నం—అది యెట్లు?

పండి—పరమేశ్వరుని పత్నియగు పార్వతి యే కాలమునాటిది? శ్రీరాము డేకాలమునాటివాఁడు? గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించె ననునట్లు శ్రీరాము డవతరించుదనుక పార్వతీదేవి మంత్రోపదేశము నొందక యేయున్నదా? పార్వతీదేవి మంత్రమునె యెఱుంగక పరమేశ్వరు నుద్దేశించి తపమెట్లు చేసెను? దీనింబట్టి పార్వతీదేవి రామ మంత్రము నుపదేశము నొందెననుట యుక్తియుక్తముగాదు.

అన్నం—ఆరాధ్యులవారూ! రామమంత్ర ప్రతిపాద్యుఁడు దశరథ రాముఁడేయని తలంచుచున్నారు గాబోలు? అట్లుగాదుసుడీ?

పండి—రామమంత్ర ప్రతి పాద్యుఁడు దశరథరాముడుగాక మఱి యెవ్వరు? పరశు రాముడా? లేక, బలరాముఁడా?

అన్నం—శ్రీరామావతారమునకు మూలరూపమగు పరంబ్రహ్మము.

పండి—శ్రీరామావతారమునకు మూలమైనవాడు మహావిష్ణువు. ఆయనకు శ్రీరాముడను నామములేదు. ఆయనకు బ్రతిపాదకమైనది నారాయణాష్టాక్షరము, అట్లుండ రామమంత్రము మహావిష్ణు నెట్లు బోధించును.

అన్నం...రామమంత్రమునకు ప్రతిపాద్యము విష్ణువని చెప్పితినా? అట్లుగాదు. విష్ణునకుగూడ మూలమైన పరబ్రహ్మతత్వమె రామ మంత్రప్రతిపాద్యము.

పండి...అటులేని సీతమ్మ దశరథరాముని పత్నియా? లేక మూల మైన పరబ్రహ్మము పత్నియా? లక్ష్మణుడు దశరథరాముని తమ్ముడా లేక పరబ్రహ్మము తమ్ముడా? వనవాసముచేసినది రావణుని బరి మార్చినది దశరథరాముడా? లేక పరబ్రహ్మతత్త్వమా? అధ్యాత్మ రామాయణమున దశరథరాముని చరిత్రము గన్పట్టుచుండ నది యంతయు పరబ్రహ్మము చరిత్ర మనుట యెట్లు?

అన్నం...చరిత్రము దశరథరాముని జే. అయినను నారామునకు మూల మైనది బ్రహ్మతత్వమే గావున రామమంత్రమునకు బ్రతిపాద్యము బ్రహ్మతత్వమే యగును.

పండి—పరబ్రహ్మ తత్వము శ్రీరామునకు మాత్రమే మూలమగుగాని డమ వారైన పరశు రామాదులకుగాని బ్రహ్మ విష్ణ్వాదులకుగాని మూలమెట్లుగాదు? అందఱకు మూలమైనచో దశరథరామ వాచక మగు రామ మంత్రమే పరబ్రహ్మ ప్రతిపాదక మగుగాని తక్కువ వతారములకు వాచకములైన మంత్రములుగాని బ్రహ్మాది వాచకము గు మంత్రములుగాని, దశరథరామునకును మూలమైన విష్ణువును ల్పు నారాయణమంత్రముగాని పరబ్రహ్మ ప్రతిపాదకము గాదని హించి పరమేశ్వరుడు పార్వతికి రామమంత్రమునే యుపదేశింప లసి వచ్చిన కారణమేమి?

న్నం—మాకు హేతువాదముతో పనిలేదు. అధ్యాత్మ రామా ణము ప్రమాణము. దానియందట్లు కలదుగాన మేమువిశ్వసింతుము. డి...మీరు బాగుగా విశ్వసించుడు. దానికి మాయభ్యంతరము ను గాని విమర్శించినచో నిది మాత్రము ప్రమాణ సమ్మతముగాదు.

అన్నం—అదియేల?

పండి—సర్వప్రమాణ విరుద్ధమైనందున,

అన్నం—అదియెట్లు?

పండి—వెనుక జెప్పిన విధమున పరమేశ్వరుఁడె సర్వాధికుఁడని సర్వవేద సిద్ధమైయుండగా నాపరమేశ్వరుఁడు తనకన్న రాముఁడధికుఁడని యెంచి తన భార్యకు రామమంత్రము నుపదేశించెనని యీగ్రంథమున నున్నది. గాన నిది సర్వవేద విరుద్ధము.

మఱియు, మహాభారతమునందు నాదివిష్ణువే, పరమేశ్వరు నుద్దేశించి పలుమారు ఘోరతపము సేసెనని చెప్పియుండగా నావిష్ణు వవతారమైన శ్రీరాముని బరమేశ్వరుఁడె కొలిచెనని యిందు గలదుగాన నీగ్రంథము మహాభారత విరుద్ధము.

ఇదిగాక, వాల్మీకి కృతమై శ్రుతిసమ్మతమైన శ్రీమద్రామాయణమునందు, శ్రీరాముఁడశ్వమేధముచే శివునారాధించి నట్లును, శ్లో॥ అత్రపూర్వం మహాదేవః ప్రసాద మకరోద్విభుః॥ అను వచనమును బట్టి శివానుగ్రహమును బొంది యున్నట్లును, నుండగా నీగ్రంథమునందు పరమేశ్వరుఁడు శ్రీరామునిఁ దనకంటె నధికునిగా భావించెనని యున్నదిగాన నీగ్రంథము శ్రీమద్రామాయణ విరుద్ధము.

మఱియు, శ్లో॥ నరకాన్ద్ర శయాస్యసి॥ అను శ్రీమద్రామాయణ వచనమునుబట్టి భృగుశాపవశమున సంభవించిన శ్రీవిష్ణుని దశావతారములలో నొక్కటి శ్రీరామావతారమని యుండగా నీశ్రీరాముడు కడమ యవతారముల కంటెను, త్రిమూర్తుల కంటెను కొనకు పరమేశ్వరునికంటెను నధికునిగా నీగ్రంథమునఁ జెప్పఁబడియున్నది. గాన నీ యధ్యాత్మ రామాయణము శ్రీమద్రామాయణమునకు పరమ విరుద్ధము.

ఇట్లు సర్వప్రమాణ విరుద్ధమగు నీ యధ్యాత్మ రామాయణ మునుబట్టి శివుఁడు పార్వతీదేవికి రామమంత్రము నుపదేశించె ననుట ప్రామాణికులకు విశ్వాసార్హముగాదు.

అన్నం... రామమంత్రము తారకమని ప్రసిద్ధికలదు. దానింబట్టియే పరమేశ్వరుఁడు పార్వతికి నీమంత్రము నుపదేశించెనని నమ్మదగి యున్నది.

పండి... రామమంత్రము తారకమని యెందుగలదు?

అన్నం...అధ్యాత్మ రామాయణమున గలదు.

ప్రతి... మృత ప్రాయమైన యాగ్రంథము నే తిరుగ నుదహరింపనేల?

అన్నం... అట్లని—కలిసంతరణోపనిషత్తునందు॥

హరేరామ హరేరామ రామరామ హరేహరే।

హరే కృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే॥

అని చెప్పఁబడియున్నది. రామనామము తారకము గానిచో రామ కృష్ణాది నామములు స్మరింపఁదగినవని యుపనిషత్తునందేల చెప్పఁ బడును.

పండి... రామకృష్ణాది నామములు తారకము లైనచో శివుడు పార్వతికి కృష్ణతారకము నేలచెప్పలేదు. ఇదిగాక నీయుపనిషత్తు నందు॥ హరేరామ అని మొదలుగా జెప్పిన తరువాత

ఏతత్షోడశకం నామ్నాం కలికల్మషనాశనం॥ అని యున్నది. దానికి ఈ పదునారు నామములు కలికల్మషమును బోగొట్టునని యర్థము. దాననే యీయుపనిషత్తునకు కలిసంతరణోపనిషత్తు అనిపేరు

మహాపురుషుల నామస్మరణము కలికల్మష నాశకమనుట వింతకాదు. ఎట్లన,

శ్లో॥ కార్కోటకస్యనాగస్య దమయంత్యానలస్యచ।

ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనం॥

కర్కోటక నాగము దమయన్తి నలుడు రాజర్షియగు ఋతుపర్ణుఁడు ననువారిని గీర్తించునెడ కలి నశించునని యర్థము. కలినశించు ననగా కలి కలుషము నశించు ననియె భావము.

తారకమను సంజ్ఞయైననో మోక్షప్రదమైనదానికేగాని యింకొకదానికి సంభవింపదు. మోక్షమన సంసారమును దరించుట. సంసారమునుండి తరింపఁ జేయుదానికే తారకమని పేరు.

ఈసంజ్ఞ శివనామములకే చెల్లును. ఎట్లన

అవిముక్త జాబాలమను నుపనిషత్తునందు ॥

శ్రు॥ కింజప్యేనామృతత్వం నోబ్రూహి॥ ఏనామములను జపము చేసినచో ముక్తిగలుగునో చెప్పుమని యాజ్ఞవల్క్యు నుద్దేశించి బ్రహ్మచారులడుగగా యాజ్ఞవల్క్యుడు

శ్రు॥ శతరుద్రీయేణేతి॥ శతరుద్రీయముననగా నమకమును జపింతురేని ముక్తి గలుగునని చెప్పి వేదమున నెన్నియో పన్నములుండ నీయొక శతరుద్రీయమును జపించిననే మోక్షము గలుగుననుట యెట్లనిశంకించి,

శ్రు॥ అమృతస్య హావా నామధేయాని॥ నమకమునందు భవాయచ రుద్రాయచ, అనిమొదలుగా వినఁబడినవి యమృతుని నామధేయములు అమృతుఁడనగా మృతిలేనివాఁడు మృత్యుంజయుఁడను ప్రసిద్ధ పరమేశ్వరునకేగాని యన్యులకు లేదు. ఈ నమకాధ్యాయములోనివి పరమేశ్వరుని నామధేయములు గాన వీనికి మోక్షప్రదత్వము కలదు. అనినుడివి.

పరమేశ్వరుని నామధేయములె గాక ఇతర దేవతల నామ ధేయములు ముక్తిప్రదము లేలకానేరవు? అని శంకించి,

శ్రు॥ ఏతైర్వై వా అమృతో భవతి

మీరు అమృతత్వ మెట్లు గలుగునని నన్నడిగితిరి. అమృతుని నామధేయముల నుచ్చరించిననే యమృతత్వము గలుగుగాని యిత రుల నామములను స్మరింపగా నదియెట్లు లభించును. అమృతుఁడను నామము శివునకు దప్ప యన్యులకులేదు. అమృతుఁడనగా మృతిలేని వాఁడని యర్థము. ఇట్టిపరమేశ్వరుని నామముల స్మరించిననే యమృ తత్వము—మృతిలేకపోవుట. అనగా మోక్షముగలుగు గాని యిది యితర నామములచే నెట్లు గలుగునని నుడువఁ బడియెను.

ఇదిగాక నమకమునందు నమస్తారాయ అనుటచే తారకసంజ్ఞ శివనామములకే కలదని విశదీకరింపఁబడియెను, ఈ వాక్యమునుబట్టి తారమనుపేరు శివునకే గలదనియు వ్యక్తమగుచున్నది. కావుననే అధర్వశిరమునందు మహేశ్వర మహాదేవాదినామములతో బాటు తార ప్రణవాది పదములును శివవాచకములని నిర్వచనము సేయఁబడియెను. ప్రణవము శివవాచకమని లోగడ నిరూపింపఁబడియెను. తారకమను సంజ్ఞ ప్రణవమునకు గలదని కొన్నిచోట్ల నున్నను తారకప్రణవాది పద ములు పరమేశ్వర వాచకములని యుపనిషత్తులందు స్పష్టీకరింపఁబడి యుండుటచే తారకసంజ్ఞ శివునకు నిర్వివాదమైనది. ఇట్లు తారకసంజ్ఞ శివునకు నున్నట్లు ప్రమాణసిద్ధమగుటచే శివనామములకే తారకమను పేరు న్యాయ్యమని యేర్పడుచున్నది. ఇట్టి సర్వప్రమాణసిద్ధమగు పరమసిద్ధాంతము నాదరింపక నిరాధారముగా రామనామమునకే తార కసంజ్ఞ కలదని మీరంగీకరించినమాత్రన బహుప్రమాణ సమ్మతమగు టచే ప్రబలమైన శైవసిద్ధాంతమునకుఁ గొరంత యావంతయు నుండదు.

అన్నం...ఆరాధ్యులవారూ ! మీరు చెప్పిన యీ యుపన్యాసమును

బట్టి శివనామమునకు తారకమని సంజ్ఞకలదని తేలుచున్నదిగాని రామ నామము తారకము గాదని తేలుట లేదు. ఇక నీయుపన్యాస మంతయు దేనికి?

పండి...మీ సిద్ధాంతిమును సాంతము సేతునే.

అన్నం...రామనామము తారకము గాదని తేలనప్పుడు మా సిద్ధాంత మెట్లు సాంతమగును?

పండి... మీరు రామనామము తారకమనుటకు శ్రుతి ప్రమాణము నొక్కదాని నైన గనఁబరుపఁజాలరైతిరి. శివనామమే తారకమనుటకు బెక్కు శ్రుతిప్రమాణములు మాచే నిందు నుదహరింపఁ బడియెగదా? దీనింబట్టి రామనామము తారకమనుట శ్రుతి విరుద్ధమని యేర్పడ లేదా? ఇంకేమిగావలయు?

అన్నం...రామనామమహిమము మీకేమి తెలియును?

శ్లో॥ సహస్రనామతత్తుల్యం రామనామవరాననే ।

రామనామము సహస్రనామతుల్యమని శివుడు జెప్పెనుగదా?

పండి...అట్లుచెప్పెనని యెందున్నది?

అన్నం...అధ్యాత్మరామాయణమునందు

ప్రతి...ఈయధ్యాత్మరామాయణముకన్న మీకు వేరొకగతియే లేదా? ఇది సర్వవిరుద్ధమని పలుమారు ఖండించినను దీనినేయుదాహరింపనేల?

అన్నం...అట్లేని నది యుండనిండు. రామనామము తారకమనుటకు నింకొక గొప్పకారణము దెలిపెదను వినుడు.

పండి...బాగుగ విని యెద సెలవిండు.

ష్ణం—ఆచార్యులవారూ! ఇటు చూడుడు.

శి—మీపంకనే చూచుచుందును. చెప్పుడు.

ష్ణం—నారాయణాష్టాక్షరములోని 'రా' అను వర్ణమును శైవపం క్షరములోని "మ" అను వర్ణమును గూడి "రామ" అను నామ ర్పడియెను. ఇట్లు రెండును చేరుటచే రామనామము శివకేశవుల మము లకంటె నధికమని తెలియుచున్నది.

నమో నారాయణాయ-అను మంత్రమున 'రా' అను నక్షరము వేయుచో 'నాయనాయ' అని యగును. అప్పుడు ఈ మంత్రము యనాయ=మోక్షము కొఱకు, న=ఉపయోగింపదని యర్థమగును.

నమశ్శివాయ, అను శైవమంత్రమున 'మ' అను నక్కరము వేయునెడ 'నశివాయ' అని యగును. అప్పుడీమంత్రము 'శివాయ= గళముకొఱకు 'న= ఉపయోగింపదని యర్థమగును.

దీనింబట్టి నారాయణ మంత్రమున రా అను నక్షరంబును, మంత్రమునందు మ అను నక్కరంబును ముఖ్యములైనవని తెలియు న్నది.

ఇట్లు శివవిష్ణు మంత్రములలో ముఖ్యములైన యక్షరములచే కినదిగాన రామమంత్రము శైవవైష్ణవ మంత్రములకన్న నధిక ము, దానంజేసి యిదియె తారకమనియు ధ్రువమగుచున్నది.

—ఆరాధ్యులవారూ! దీనికి దగిన సమాధానము సెలవిండు.

—ఆచార్యులవారూ! భట్టాచార్యులవారు చెప్పిన యంశము గీకరింతురా?

ప్రతి—రామమంత్రము గొప్పదియనుట సంగీకరింతుము ఇంతియగాని నారాయణ మంత్రముకన్న రామమంత్ర మధికమను నెట్లంగీకరింతుము? నారాయణ మంత్రము మూలవిష్ణువును బోధి చును. రామ మంత్రమైననో ఆదివిష్ణు నవతారమైన దశరథరాము బోధించును. మూలరూపమునకు నవతారమునకుగల యంతరమి రెండుమంత్రములకు న్యాయసిద్ధము. ఇట్లుండ నారాయణ మంత్రమ కన్న రామమంత్ర మధికమనుటయెట్లు ప్రమాణ సమ్మతమగును? ఇ గాక, నారాయణ మంత్రములోని రా అనునది, యింకొక మంత్రమ లోని మ అనునది చేరి రామమంత్రమయ్యెననుట చమత్కార కరమై కల్పనా కథగాని యీ రెండు మంత్రములలోని రెండక్షరములు గూ రామమంత్ర మయ్యెననుట విశ్వాసార్హముగాదు.

అన్నం—ఆచార్యులవారూ! విశ్వాసార్హ మేల కాదు? రామమంత్ర ప్రేమపాత్రమెగాని దానియందు శైవపంచాక్షరములోని మకార వచ్చి కలసినదనగానే ఆయక్షరము మీఁగొంతుపట్టుకొని సంద మీకు విశ్వాసార్హముకాదయ్యె కాబోలు? దాననేకదా శివపంచా ములోని మని యనవొల్లక యింకొక మంత్రములోనియని పలికి

ప్రతి... మీకుఁ దగిన సమాధానము నారాధ్యులవారే చెప్పుద నాకేమి?

పండి—భట్టాచార్యులవారూ! శైవవైష్ణవ మంత్రములలోని యక్ష లుచేరిరామమంత్రమయ్యెననుట కవికల్పనముగాక నిజమేయని నమ్మకము గలదా?

అన్నం— ఇందుమాకు నమ్మకము లేకేమి? గాని మీకు నవ గలుగమికి కారణము గలదు.

పండి... ఏమది?

అన్నం... ఇది నమ్మినచో మీ మీ మంత్రములకు ప్రాశస్త్యము తగ్గునని.

పండి...మీరుచెప్పినది ధ్రువపరచు కుందురేని మీ రామమంత్రమునే మేమును గ్రహింతుము, ఇఁక మామంత్రములకుఁ ప్రాశస్త్యము తగ్గిన నేమి?

అన్నం—అట్లేని తప్పక ధ్రువపరుతును.

పండి—నారాయణ మంత్రములోని రా అనునది శైవమంత్రములోని మ అనునది యీ రెండువర్ణంబులును వానియంతన నవియె కూడెనా లేక వాని రెంటిని నెవరైనఁ గూర్చిరా?

అన్నం—ఎట్లయిన నేమి?

పండి—ఈ రెండును నసంభవములే.

అన్నం—అది యెట్లు?

పండి—అక్షరము లచేతనములుగాన నవి వాని యంతనగూడవు.

అన్నం—వాని నెవరైనఁ గూర్పఁగూడదా?

పండి—బాగుగా గూర్పవచ్చుగాని యాట్లెవఁడైన నక్కరములనుగూర్చి రామ అని నామకరణము గావించియున్నచో నట్లు రామునకు నా[illegible] కరణము గావించినవాఁడే రామునికన్న నధికుఁడగును.

లోకమున నెవనికైన నామకరణము గావించునపుడు వెంక[illegible] శ్వరుని పేరు, రాముని పేరు, కృష్ణుని పేరు చేర్చి వెంకటరామకృష్ణు[illegible] అని పేరుపెట్టుట సంభవించును. గాని యంతమాత్రమున నీతడు వెం[illegible] రామకృష్ణులకన్న నధికుఁడు గాజాలడు. వీని పేరొక్కొక మహనీయ[illegible] పేరుకన్న చదువుటకుఁ బెద్దదేయైనను వెంకట రామ కృష్ణులను న[illegible] ములకన్న నధికఫలప్రదము గాజాలదు. అదిగాక, రామ కృ[illegible]

పదము లాయా మహనీయుల జెప్పునపుడు సార్థకములగుగాని వానిం గొన్నిటి జేర్చి యన్యులకు బేరుపెట్టినప్పుడు సంజ్ఞావాచకములె యగు గాని యన్వర్థము లెన్నటికి గానేరవు. అట్లై శైవవైష్ణవ మంత్రములలోని యక్షరముల నొక్కొకదానింగూర్చి వేరొక్కనికి నామకరణము జేసినం తన నీ నామధారి శివవిష్ణులకన్న నధికుఁడనిగాని యీ నామము శివ విష్ణు నామములకన్న నధిక ఫలప్రదమనిగాని నుడువజెల్లదు. మఱియు నారాయణ అను వర్ణసముదాయమునకు నర్థము కలదుగాని దానియం దున్న రా అను వర్ణమునకు నర్థమే లేదు. అట్లే నమఃపదములోని మకారంబును నిరర్థకమే. ఇట్లు నిరర్థకములైన యక్షరముల జేర్చినం తన దీనికి మహార్థ మెట్లు సంభవించును? ఎట్లును సంభవింపదు.

ఇదిగాక, లోక వేదములందు గల పదములు వ్యుత్పన్నములుగనో లేక అవ్యుత్పన్నములుగనో వాని యంతన సహజసిద్ధములై నిత్యములు గానున్నవి. ఇట్లుండ శైవవైష్ణవమంత్రములలోని రెండక్షరములు చేరి రామమంత్రమయ్యెననుట యెట్లు? ఈ సిద్ధాంతము నంగీకరించునెడ శైవ వైష్ణవమంత్రము లనాదిసిద్ధములనియు రామమంత్రము నడుమ నేర్పడిన కృత్రిమమంత్రమనియు తేలునుగదా? ఎట్లైన తేలనిండు. ఈపద్ధతి నేల యంగీకరింపగూడదనిన, యుక్తియుక్తముగానందున నంగీకరింప గూడదు.

అన్నం— ఇదియేల యుక్తియుక్తము గాదు?

పండి— నారాయణమంత్రములోని రా అను నక్షరమును దీసికొనిన వాడు శివమంత్రములోని అకారమునో లేక వకారమునో తీసికొనవ లయుగాని మకారము దీసికొనుట యుచితముగాదు. ఏలన- శివ మంత్రములోని మకారము నమఃపదములోనిదిగాని, దేవతావాచకము లోనిది గానేరదు.

ఆదిగాక, నారాయణమంత్రములోని రా అనునది తీసికొనిన వాడు మకారమందు లేనియెడ గదా శివమంత్రములో వెదకికొన

డలయు. నమో నారాయణాయ అనుదానిలో మకారముగూడ యుండి
ప్పుడు దానినే యేల తీసికొనగూడదు.

ఇదిగాక, నమః అను పదము సకలమంత్రములలో నుండుగాన
ి మకారము కడము మంత్రములలోనిదిగా దన నేమి ప్రమాణము
కలదు?

మఱియు, ఈ రెండక్షరములు శివ విష్ణు మంత్రములలోని వే
గాని రాక్షస క్షామదేవతల మంత్రములలోనివి గావని యెట్లు నిర్ణ
యింపనగును?

అట్లుగాక, అభ్యుపేత్యవాదమున నీరెండక్షరములు శివవిష్ణు
మంత్రములలోనివే యని యొప్పినను నీ సిద్ధాంతమునుబట్టి రావణనా
మము దీనికన్న నెక్కుడని యొప్పక తప్పదు. ఎట్లన-

రామనామమునందు నారాయణమంత్రములోని రా అను నక్షర
మొక్కటియే చేరెనుగాని రావణనామమునందు నారాయణనామము
లోని రా ణ అను రెండక్షరములు చేరియున్నవి. మఱియు, రామ
నామమునందు శివమంత్రములోనిదగు నమఃపదములోని నిరర్థకమగు
మకారము చేరియున్నదిగాని రావణనామమున నైననో అట్టి మకా
ముకన్న శ్రేయమైనదియు, నమృతబీజమైనదియు, శివనామములోని
యు నగు వకారము చేరియున్నది. మీరు చెప్పిన మార్గమునిజమని
హించునెడ రావణనామమే యత్యుత్తమము గాకమానదు.

రామనామమునందు సహజముగా గల యుత్కర్షము మాకు
రమ సమ్మతమే. అయినను మీ రానామము దగు నుత్కర్షము
ాధింప నంగీకరించిన పద్ధతి యనుచితమని తెల్లముసేయనే రావ
ాది నామము లుదాహరింపఁబడియెను. మీరు యథార్థపద్ధతి నవలం
ంచి శ్రీరామునందు గల సత్వగుణాతిశయము ధర్మవిగ్రహత్వము

మున్నగు నుత్తమగుణములనుబట్టి యమ్మహానీయునామము పరమపావన మని బలుకుచో నీ నిర్ణయమును శిరసావహింపని వారుండరు.

అట్లుగాక శివకేశవులకంటెను నీ మహాపురుషుని నధికునిగా సాధించు కుతుకంబున మీరు కల్పించిన యీ కల్పన మమ్మహానీయుని యుత్కర్షసాధనమునకుఁ బనికిరాకపోగా నికర్షమునకే యుపయోగించె డినని తెలుపక తప్పినదిగాదు.

అన్నం—అట్లైనిశ్రీశంకరాచార్యాదులు రామనామముశివకేశవమంత్ర ములలోని యక్షరములతో గూడిన దని యేలచెప్పిరి ?

పండి—రామనామమును బ్రశంసింప నీ యుల్లేఖమును చెప్పిరి. గాని యీ నామ మీ రెండక్షరములచేతనే కల్పితమని వారి యాశయము గాదు.

అన్నం...రామనామము శివవిష్ణుమంత్రములలోని యక్షరములచేతనే యేర్పడియె ననుటకుఁ బెద్దకారణము గలదు. అది యెద్దియనిన వినుడు.

హరిహరు లిద్దరును జేరి రామావతారము నొందినట్లు గొన్ని ప్రమాణములయందు గలదు. దానింబట్టి రామనామము హరిహర మంత్రములలోని యక్షరములచేతనే యేర్పడియెననుట నమ్మదగి యున్నది.

పం—కల్పవిశేషములయందు రామావతారములు కొన్ని రుద్రాంశములుగను కొన్ని శక్త్యంశములు గన, మఱికొన్ని నారాయణాంశములుగను, సంభవించినట్లు ప్రమాణముల యం దుగలదు. ఇంతియగాని యెుకప్పుడే హరి హరులయిద్దఱి యంశ ములచే రామావతారము గల్గినట్లు ప్రామాణికగ్రంథములయందు నెందునులేదు. ఇట్లుండ రామనామము హరిహరుల మంత్రగతాక్షర ములచే నిర్మితమని యెట్లు గ్రహింపనగును?

న్నం—కొన్ని సంహితలయందు రామ రహస్యాద్యుపనిషత్తులందును
ొకప్పుడే రామావతారము హరి హరుల యంశములచే నేర్పడినట్లు
ెప్పఁబడి యున్నది.

ండి—ఆసంహితలు నా యుపనిషత్తులును నధ్యాత్మ రామాయణము
ోలె విశ్వామిత్ర సృష్టిలోనివేయని నమ్మవలయు.

న్నం—ఏకారణమున?

ండి...స్మార్త సంఘమునకు దేవుని సాధింప నేర్పడినవిగాన.

న్నం...స్మార్తసంఘమునకు క్రొత్తగ దేవునినేల యేర్పరుప వలసి
చ్చెను.

ండి...అద్వైత మూలాచార్యులవారు శైవ వైష్ణవాది సంఘ
ములలో గొందఱను జయించి స్వమతమున జేర్చిన పదంపడి యీ
ంఘమునకు బూజనీయమగు దేవతను నిర్ణయింపనెంచి శివవిష్ణ్వాదుల
న్న నితర దేవత యప్రసిద్ధమగుటను, శివవిష్ణ్వాదులొక్కొక మత
వతలుగా నున్నకతన సర్వమత సముదాయమునకు వీరిలోనేదొక్క
వతను బూజింపుమన్నను నందు పలువురకసమ్మతమగునని యోజించి
స్వమత దేవతలైన శివవిష్ణ్వాదుల నొక్కచోఁజేర్చి పూజింపుడని
చాయతనము నేర్పరచిరి.

అట్టులేర్పరచియు, స్మార్తమునకు నుపాస్యమగు దేవతయేది?
ప్రశ్నవచ్చినప్పుడు అయిదుగురు దేవతలు నుపాస్యులని యుత్త
ు చెప్పుట సరిగా నుండలేదనియెంచి ప్రశ్నోత్తర మాలికయందు
'దేవః' దేవుఁడెవరు అను ప్రశ్నమునకు హరిహర రూపుడొక్కడె
ఁడని యుత్తరము చెప్పియుండిరి.

అంతకన్న నేమి చెప్పవలయు? హరి యొక్కడే దేవుఁడనినచో శైవమతమునుండి వచ్చి కలసినవారు మెచ్చరు. హరుఁడొక్కడే దేవుఁడనినచో వైష్ణవ సంఘమునుండి వచ్చి కలసినవారు వప్పుకొనరు. అంతయు నొక్కటేయని యద్వైతమును సిద్ధాంతముసేసి దేవత లైదుగురని బదులు సెప్పనెడ నగుబాటగును. కాఁబట్టి యీఁ యేగురలో బ్రధాన దేవత లిద్దఱిని గ్రహించి యిద్దఱు దేవత లుపాస్యు లన్నను సంతృప్తి కరముగాదని యెంచి వారిద్దఱ నొక్కటిచేసి శంకరనారాయణ రూపుఁడొక్కడే దేవుఁడని బదులు చెప్పెను.

అన్నం...హరి హరుల నిద్దఱ నొక్కటి చేసినిది మా యాచార్యుల వారేయగునా?

ప్రతి- పౌరోహిత్యము మొదటనుండి మీకుఁగులవృత్తియేగాన మీయాచార్యులవారు హరిహరులయిద్దఱకు బ్రహ్మ ముడులుపెట్టిరి కావలయు?

అన్నం...అట్లుగాదు అంతకు మున్నె హరిహరులిద్దఱు నొక్కటియై యున్నారు.

పండి...అంతకు మున్ననగా, నారాయణమూర్తి మోహినీరూపము నొందినప్పు డనియేకదా మీయాశయము.

అన్నం—ఆచార్యులవారూ! వీ రేమనుచున్నారో వినుచుంటిరిగదా?

ప్రతి—ఈయుల్లికట్టి మాటలతో నేమి? తొలుత మీ సిద్ధాంతము నిలుపుకొనుడు. తరువాత సంగతి చూతము.

అన్నం—మాయాచార్యులవారు హరిహర రూపుఁదొక్కఁడె దేవుఁడని చెప్పినమాట నిజమే, అట్లుచెప్పిన నేమి?

పండి—హరిహరరూపు నొక్కని సాధింపనే శ్రీరాము నట్టివానిగా వివరింపవలసివచ్చెను. ఏలన హరిహరరూపు డొక్కఁడని మాట చెప్పినను హరిహరులిద్ద ఱనుట సుప్రసిద్ధముగాన నా మాట విరుద్ధముగా

దోపకమానదు. దానంజేసి హరిహరాత్మకు నొక్కని నేర్పరువవలసి యుండెను. అప్పుని దీర్పనే శ్రీరాముడు హరిహరుల యిద్దఱ యవతారమనియు శివవిష్ణుమంత్రములలోని యక్షరములుచేరి రామనామ మేర్పడియెననియు వచించుచు నీయర్థమును నిలుపుకొననే వీరిచేసెనో సంహితలు అధ్యాత్మరామాయణాదీతిహాసములు రామరహస్యావని షత్తులు విశ్వామిత్రసృష్టిగా సంఘటింపఁబడియెను.

శైవులు శ్రు॥శివమద్వైతంచతుర్థంమన్యన్తే" శ్రు"బ్రహ్మవిష్ణురుద్రేంద్రా స్సంప్రవమాయన్తే" ఈ మొదలగు శ్రుతిప్రమాణములనుబట్టి మూర్తిత్ర యాతీతమై త్రిమూర్తి కారణమైనశివతత్త్వమె పరబ్రహ్మమని నిర్ణయించి యదియె యుపాస్యమని గ్రహించిరి.

వైష్ణవులైననో శ్రు॥ నారాయణాద్బ్రహ్మాజాయతే నారా యణాద్రుద్రోజాయతే" ఈ మొదలగు శ్రుతిప్రమాణములనుబట్టి మూర్తిత్రయాన్తర్భూతమై ద్విమూర్తికారణమైన విష్ణుతత్త్వమే పర బ్రహ్మమని నిర్ణయించి యదియె యుపాస్యమని గ్రహించిరి.

మీరైననో శివ విష్ణ్వాదులలో నొక్కని నుపాస్యముగా నంగీక రించునెడ శైవాది మతములలోననె చేరునని యెంచి శ్రీరామునినే పరబ్రహ్మముగా నంగీకరించితిరి.

శైవులు విష్ణుని శివభక్తునిగాను వైష్ణవులు శివుని విష్ణుభక్తుని గాను నెంచుదానికి బదులుగా శివుని రామభక్తునిగా బ్రకటించితిరి. దీనింబట్టి శివమత విష్ణుమతములవలె మీది రామమతమని తెల్ల మయ్యెను.

బ్రతి—ఆరాధ్యులవారూ! వీరి సిద్ధాంతమున చిమదోమయు పర బ్రహ్మమే. అట్టియెడ వీరు రామచంద్ర పరబ్రహ్మణేనమః అనుచు

శ్రీరాముని పరబ్రహ్మముగా నెంచిన మాత్రన యమ్మహానీయునకు వచ్చిన యతిశయ మేమి?

పండి—వీరు శ్రీరాముని నంతరిక్షమునకు గొనిపోయినది యా యాన ఘుని మహిమాతిశయమును నిలుపనేయని యెంచుచుంటిరా? అట్లు కాదు. దేని కనిన, శివుడు రామతారకము నుపదేశించెనని చెప్పినది. శివమహిమమును గ్రుంగ జేయనే, శివ మహిమ యొక్కని యత్నమున గ్రుంగునది కాదు. యథేచ్ఛముగా శివమహిమమును నణప యత్నించుచు రుగాక. శ్రీరాముని నున్నత స్థానమున నుండనిచ్చినను నదికొంత మేలెగదా?

అన్నం—అట్లుండనీయక మేమేమి చేసితిమి?

ప్రతి—దిగువకుఁ బడద్రోసితిరి.

అన్నం—ఎట్లు?

ప్రతి—రావణవధ మూలమగు బ్రహ్మహత్యవారించు కొననెంచిశ్రీరాముడు శివలింగ ప్రతిష్ఠ చేసెననియుఁ జెప్పితిరి గదా? శ్రీరామ చంద్రు గౌరవము నేమి నిలిపితిరి? దీనింబట్టి మీకల్పనా కథలకు నర్థము లేదని తెలియుచున్నది.

అన్నం—భేదవాదములయెడ నభిమానము వహించి ఇట్లు మీరెల్లపుడు కొట్టుకొనుచుండుడు. అభేద వాదులమగు మాకు నీయభిమానము లేదు గాన శివుడు రాముని గొల్చినను, రాముడు శివుని గెల్చినను, మాకెట్టి బాధకంబును లేదు.

ప్రతి—కావుననే మీవాదమంతయు నద్వైతముగానేయున్నది.

అన్నం—అట్లుండుటమాకు నలంకారమే.

ఇప్పుడు మధ్యాహ్నమయ్యెనుగాన చర్చముగింతము.

షష్ఠాహ్నికము.

# మతవినోదచర్చ.

## సప్తమాహ్నికము.

తిరుగ సందలు సమావేశమైరి.

ప్రతివాది భయంకరం—భట్టాచార్యులవారూ! మామతస్థులు నారాయణమూర్తిని పరతత్త్వముగా సంగీకరించి నారాయణాష్టాక్షరమును జపించుచున్నారు. రామతారకమన్ననో మీమతస్థు లభిమానించినదిగాన నద్దాని నిలుపుకొనుభారము మీయదియే.

అన్నం—ఆచార్యులవారూ! రామతారకమునకు వచ్చిన లోపమేమి?

ప్రతి—ఆరాధ్యులవారు రామతారక ప్రాశస్త్యమును నిలుపనధ్యాత్మరామాయణము నధ్యాన్నము చేసిరిగదా! ఇఁక రామతారకమునకుఁ బ్రాశస్త్య మెట్లు లభించును?

అన్నం—ఆరాధ్యులవా రధ్యాత్మరామాయణము నంగీకరింపకున్నంతన రామతారకమంత్రప్రాశస్త్య మెట్లులోపించును? పెక్కు నుపనిషత్తులు రామతారక ప్రాశస్త్యమును బోధించుచున్నవిగదా?

ప్రతి—అవి యేవి?

అన్నం—రామరహస్యము, రామతాపిని, రామోత్తర తాపిని, తారసారము మున్నగునవి యెన్నో కలవు.

ప్రతి—వానియం దేమియున్నది?

అన్నం—రామతాపినియందు॥ గాణాపత్యేషు శైవేషు శాక్త సౌరేష్వభీష్టదః॥ శైవశాక్త సౌరగాణాపత్యాది సకలమంత్రములలో రామమంత్రము శ్రేష్ఠమనియున్నది. ఇంతకన్న నేమికావలయు?

ప్రతి—ఆరాధ్యులవారూ! వినుచున్నారా?
అన్నం—వినుచునేయున్నాను?
ప్రతి—దీనికేమి చెప్పెదురు?

పండి—వ్రతానాముత్తమం వ్రతం॥ అనునట్లు దీనిచే రామమంత్రము దగు ప్రశంసచేయఁబడుచున్నది. ప్రశంసింపఁబడుగాక! ఇది యప్రశస్తమని యెవ్వరు నుడివిరి?

అన్నం—మంత్రయోగ రహస్యమను మంత్రశాస్త్రమునందు శ్లో॥ రాశబ్దోచ్చారణాదేవ ముఖాన్నిర్యాతి పాతకం। పునః పాపప్రవేశాయ మకారస్తత్కవాటవత్॥ 'రా' అని నోరు తెఱువగనే నోరినుండి పాపము వెడలిపోవును. అది తిరుగా లోనప్రవేశింపకుండుటకై తలుపువేసినట్లు 'మ' అనునది నోరికి మూతవేయును. అని యున్నది. ఇట్టి మహిమ మే మంత్రమునకుఁ గలదు?

పండి—ఇట్టివి స్తోత్రరూపములుగాన నర్థవాదములు. వీనిచే నీమంత్రమునకు వైదికత్వముగాని, ముక్తిప్రదత్వముగాని యెట్లు లభించును? ఎట్లును లభింపదు.

అన్నం—రా అనగానే పాపము వెడలిపోవునని మొదలుగా సరియయిన యర్థము కనఁబడుచుండ నిది యర్థవాదమనుట యెట్లు?

పండి—ఈవిధమగు విచారార్థములు సేయఁబూనినచో నెన్నియేనిఁ గల్పింపనగు.

అన్నం—అదియెట్లు? దీనికింకొక యర్థము చెప్పుడు.

పండి—మీనిర్బంధముచే నింకొకయర్థము వచింప సాహసింపవలసె. ఇది నాయభిప్రాయమని తలపకుఁడు.

అన్నం—చెప్పుడు,

పండి.--రా-ఆదానే. అనిథాత్వర్థము. దీనింబట్టి రాశబ్దము బైటి వానిని లోపలగ్రహించుటను బోధించుగాని లోపలివానిం బైటికి బోగొట్టుటను బోధింపదు. లోకమందైనను రా అనగనే రమ్మనియర్థ మగుగాని పొమ్మని యర్థముగానేరదు. కావున రా అని నోరుతెఱువ గనే బైటనున్న పాపములు లోన బ్రవేశించుననియు, అంతట మ అన గానే లోనినుండియవి వెలుపటకుఁ బోనేరవనియు నర్థమేలకాఁగూడదు?

అన్నం—ఇది యనర్థమే.

పండి——ఈయనర్థము మంత్రమునకు వికారార్థములఁ జెప్ప సాహసించిన మీరు దెచ్చిపెట్టుకున్నదే గాని మేము తెచ్చినది కాదు. మీరు చెప్పినవిధమున మంత్రములోని యక్షరములకు విశే షార్థముల గల్పింపఁ బూనినచో మీరు చెప్పినదానికన్న నిదియే సద ర్థమని తోపకమానదు.

ఇట్లు మంత్రాక్షరములకు విశేషార్థము గల్పింప నంగీకరించితి రేని యనర్థము రాకమానదు. మంత్రాక్షరములకు విశేషార్థ ముల గల్పింప నంగీకరింపరేని మంత్రయోగరహస్యమునఁ జెప్పిన మహిమము లభింపనేరదు. రెంటిలో నేమిచేతురో తెలుపుడు.

అన్నం—ఇది సాధకముగానిచో పోనిండు. రామోత్తరతాపిని యను నుపనిషత్తు నెఱుంగుదురా?

పండి——దానియం దేమియున్నది?

అన్నం—అందేమియున్నదో బాగుగ వినుడు.

రామోత్తరతాపినియందు॥ శ్రీరామస్యమనుం కాశ్యాం జజా పవృషభధ్వజః । తతః ప్రసన్నో భగవాన్ శ్రీరామః ప్రాహశంకరం । వృణీష్వయదభీష్టం తద్దాస్యామి పరమేశ్వరేతి । అథ సచ్చిదానందా త్మానం శ్రీరామమీశ్వరః పప్రచ్ఛ॥ మణికర్ణ్యాం మమక్షేత్రే గంగా యాంవాతటే పునః । మ్రియతే దేహితజ్జంతోర్ముక్తిం నాతోవరాన్తర

మితి॥ అథ సాహ్లాదం వాచ శ్రీరామః॥ క్షేత్రేఽస్మిన్తవ దేవేశ యత్రకు త్రాపివామృతాః। క్రిమికీటాదయోప్యాశు ముక్తాస్సంతు నచాన్యథా। అవిముక్తేతవక్షేత్రే సర్వేషాంముక్తిసిద్ధయే । అహం సన్నిహితస్తత్ర పాషాణప్రతిమాదిషు। క్షేత్రేస్మిన్యోర్చ యేద్భక్త్యామంత్రేణానేనమాం శివ । బ్రహ్మహత్యాది పాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః। త్వత్తో వా బ్రహ్మణోవాపియేలభన్తే షడక్షరం। జీవన్తో మంత్రసిద్ధాస్స్యుర్ముక్తామాం ప్రాప్నువన్తి తే। ముమూర్షోర్దక్షిణే కర్ణేయస్య కస్యాపి వాస్వయం। ఉపదేక్ష్యసిమన్మంత్రం సముక్తోభవితాశివేతి॥ కాశీనగరమునందు వృషధ్వజుఁడు శ్రీరామమంత్రమును జపముసేయఁగా శ్రీరామచంద్రుఁడు ప్రసన్నుఁడై శంకరునిజూచి నీయిచ్ఛవచ్చిన వరము వేడుమని యడిగినట్లును నంతట నీశ్వరుఁడు శ్రీరామునుద్దేశించి నానగరమున మణికర్ణికయందుఁగాని, గంగాతీరమునఁగాని మృతినొందిన ప్రాణి ముక్తిపొందునట్లు వరమిమ్మని యడిగినట్లును, దానికి మెచ్చి శ్రీరాముఁడు శంకరునిజూచి నేనీనగరమున నెల్లపుడు సన్నిహితుఁడనై యుందును. ఇచ్చట మృతినొందిన జంతువులెల్లను ముక్తినొందఁగలవు. నీవుగాని చతుర్ముఖుఁడుగాని, యిచ్చట చనిపోవునట్టి యేజంతువు దగు చెవియందు నామంత్రము నుపదేశింతురో ఆయాజంతువులన్నియుఁ దప్పక ముక్తినొందఁగలవని వచించినట్లున్నది.

దీనింబట్టి కాశీనగరమున జనిపోవువారి చెవియందు విశ్వేశ్వరుఁడు రామమంత్రమునే యుపదేశించుననియు, నామంత్రముదగు ప్రభావముననే వారు ముక్తినొందుదు రనియు విశదమగుటలేదా? దీనికి మీరేమి చెప్పుదురు?

పండి—ఇట్టివాని కన్నిటికిఁగలిపి లోగడనే చెప్పియుంటిని.

అన్నం—ఏమని?

పండి—ఇవన్నియు నధ్యాత్మరామాయణము వోలె విశ్వామిత్ర సృష్టిలోనివేయని.

అన్నం—కాశీనగరమునఁ జనిపోవువారి చెవిలో విశ్వేశ్వరుఁడుప దేశించు మంత్రమేది

పండి—అవిముక్త జాబాలమునందు నామంత్రము తారకమని యున్నది.

అన్నం—తారకమన నెద్ది?

పండి—శైవషడక్షరము

అన్నం—రామోత్తర తాపినీవచనమును బట్టి శ్రీరామషడక్షర మని యేలవిశ్వసింపఁ గూడదు.

పండి—పూర్వాచార్య సమ్మతి లేనందున నట్లు లంగీకరింప గూడదు.

అన్నం—హి హి హి! ఇది యెంత యోగ్యముగానున్నది? గంగాస్నానమునకు నెల్లిపోట్ల యాజ్ఞవలయునన్నట్లు ఉపనిషత్తులో గంట గొట్టినట్లు వినఁబడుచున్న దానికిఁ బూర్వాచార్యుల యనుమతివల యునా? దీనికి మీ నీలకంఠాచార్యుల సమ్మతి లేదా?. అది యెట్లుండును?

పండి—మీశంకరాచార్యుల సమ్మతి యున్నను జాలును.

అన్నం—విశ్వేశ్వరుఁ డుపదేశించు మంత్రము రామతారకము గాదని మాయాచార్యులవా రెచ్చటఁ జెప్పిరి?

పండి—శ్రీ శంకరాచార్యకృతమగు కాశీసారమునుజూచితిరా?

అన్నం—పలుమార్లు జదివితిని. అందేమున్నది? రామతారకముగాదని యున్నదా?

పండి—కాశీనగరమునందు శరీరమువదలి ముక్తినొందినవారికి నేవిధమగు రూపము వచ్చునని శంకరాచార్యులవారు కాశీసారమందుఁ జెప్పియున్నారు?

అన్నం—

శ్లో॥ కాశ్యామవశ్యం త్యజతాం శరీరం । శరీరిణాం నాస్తి పున
శ్శరీరం । యద్యస్తి కంఠే గరళం లలాటే త్రిలోచనం చంద్ర
కళాచమౌళౌ॥

తా॥ కాశీనగరమునందు శరీరము విడిచిపెట్టినవారలకు తిరుగ శరీ
రము రానేరదు. ఒకవేళ వచ్చునెడ శిరమునఁ జంద్రకళ,
నొసట నగ్నినేత్రము, కరమున త్రిశూలముగల రూపము
వచ్చును.

మూ॥ అధి కాశి కాల పరిపాకమీయుషా।
మురగీభవేయు రుపవీత తాంతవః॥
వసనందిశో నివసనం వశేతభూ
రశనం విషంచ యదిగచ్ఛరోచతే॥

తా॥ కాశీనగరమునందు మృతినొందిన వారలకు సర్పములు
యజ్ఞోపవీతములుగాను, దిక్కులు వస్త్రములుగాను, శ్మశానము నివా
సముగాను, విషము ఆహారముగాను వర్తించును. ఇష్టమగునేని నచ్చ
టికిఁ బొమ్ము.

మూ॥ అధి కాశి మహచ్చిత్రమహినా కబళీకృతః।
మండూకస్తేన బధ్నాతికపర్దం దృఢమాత్మనః॥

తా॥ కాశీనగరమునందు పాముచే మ్రింగఁబడిన కప్ప తనజటా
జూటము నాపాముచేతనే గట్టిగ బిగించుచున్నది. ఇదిగొప్పచిత్రము.

మూ॥ కాశ్యాంనవీనరుద్రాణాం భూషాయై భోగిమండలే।
అశేషనిర్గతే శేషః శేషోభూన్న ఫణీశ్వరః॥

తా॥ కాశీనగరమున వెల్వడు నవీనరుద్రుల యలంకారమునకు
గాను సర్పకులమెల్లను హరింపగా శేషించిన సర్పమునకు శేషుడని
పేరువచ్చెనుగాని ఫణిరాజు మిగులలేదు.

ఈమున్నగు వచనములచే కాశీనగరమునందు మృతినొందిన వారికి శివసారూప్యముక్తి వచ్చునని శంకరాచార్యులవారు తెలిపి యున్నారు.

పండి—రామమంత్రము నుపదేశముపొందినవారికి శివసారూప్యముక్తి యెట్లువచ్చును? వానిపార్శ్వమున సీతగదా యుండవలయు? వాని యర్ధశరీరమునందుఁ బార్వతియెట్లుండును?

అన్నం—ఇదియెగదా మీసందేహము?

పండి—ఇదియె తీర్చుడు.

అన్నం—రామమంత్రము నుపదేశము పొందిన వానికి శివుని స్వరూపమేల రాగూడదు? రామనామమునకు శివుఁడని యర్థము కాఁగూడదా? రాముఁడన్నను శివుఁడన్నను భేదముగలదా?

పండి—అట్లేని శివుఁడు తనమంత్రమునె యుపదేశింపక రామ మంత్రమునేల యుపదేశింప వలసివచ్చెను?

అన్నం—ఆరాధ్యులవారూ! రాముఁడనఁగా దశరథపుత్త్రుడని యెన్నుచున్నారు కాఁబోలు? అట్లుగాదు.

పండి—మఱియెవ్వరు?

అన్నం—తారసారోపనిషత్తునందు॥ కలాతీతాభగవతీ స్వయం సీతేతి సంజ్ఞితా । తత్పరః పరమాత్మాచ శ్రీరామః పురుషోత్తమః॥ సీతయనగా కలాతీతురాలనియు, ఆమెకన్న పరుఁడగు పరమాత్మయే శ్రీరాముఁడనియుఁ జెప్పబడియున్నది.

పండి—మీమతమునందు పరమాత్మకు నామరూపములుగలవా?

అన్నం—లేవు.

పండి—అట్లేని పరమాత్మకు శ్రీరాముఁడని నామంబెట్లు గలిగెను?

అన్నం—శ్రీరాముఁడు పరమాత్మయనగా శ్రీరామచంద్రునంత రాత్మయే పరమాత్మయని యర్థము.

పంఃి—చీమదోమ మున్నగువానియంతరాత్మపరమాత్మగాదా?

అన్నం—అగును.

పండి—అట్లైన మీమతమునుబట్టి శ్రీరామచంద్రునందు గల విశేష మేమి?

అన్నం—మీప్రశ్నములు వికటముగా నున్నవి.

పండి—మీసిద్ధాంతములు సరిగానున్నవా?

అన్నం—మాకీ కుతర్కముతోఁబనిలేదు. రామోత్తరతాపిని యందు కాశీనగరమున విశ్వేశ్వరుఁడు ప్రాణికి నంతకాలమునందు రామతారకము నుపదేశించుచున్నాఁడని యున్నది. అది యుపనిషత్తు గాదా? ఉపనిషత్తయినను మీకుఁ బ్రమాణముగాదా?

పండి—రామోత్తర తాపినియందు నట్లున్న సంగతి మీయా చార్యులవారికిఁ దెలియునా? తెలియదా?

అన్నం—సర్వజ్ఞులగు మాయాచార్యులవారికెట్లు తెలియ కుండును?

పండి—ఆసంగతి తెలిసియుండి యది ప్రమాణమను నమ్మ కము తమకు గలిగియున్నచో మీయాచార్యులవారు కాశీనగరము నందు మృతినొందినవానికి శివుని సరూపముక్తి వచ్చునని యెట్లు నుడువుదురు!

అన్నం—రామునకు శివునకు భేదములేదను యథార్థసిద్ధాంతమును బట్టి యటుచెప్పిరి గాబోలు?

ప్రతి—మీయథార్థ సిద్ధాంత మేగినట్లే యున్నది.

అన్నం—అదియేమి?

ప్రతి—శివునకు రామునకు భేదములేనిచో శివుఁడు రామ మంత్రమును జపించెనని యంగీకరించిన దానివలనఁ గలుగు లాభ

మేమి? ఘనత యెవ్వరికి వచ్చెను? న్యూనత యెవ్వనికివచ్చెను.? శివుని కన్న రామునకు నాధిక్యము దెల్పు ప్రమాణము తెలిసియున్నచోఁ జెప్పవలయును. లేనిచో నోరుమూసికొన వలయును. ఇంతియగాని వృథాకాలక్షేప కరములగు వచనోపన్యాసములవలన నేమి కార్యము?

అన్నం—రామోత్తరతాపిని వచనము రామునకు శివునికన్నఁ బరత్వమును ప్రతిపాదించుట లేదా?

ప్రతి—భేదమునొప్పినచో నది సిద్ధించుగాని యిద్దఱునొక్కఁడే యనినచో నెట్లుసిద్ధించును?

అన్నం—అభేదపక్షమున నట్టిపరత్వముతోన పనిలేదు. భేద పక్షమునందు నాయుపనిషత్తును బట్టి శివునకన్న రామునకు నాధిక్య మేల యేర్పడదు?

ప్రతి—ఆయుపనిషత్తునుబట్టి శివునివలన నంతకాలమున రామ తారకము నుపదేశమొంది తనువువిడిచిన ప్రాణులకు రామునిసారూ ప్యము గలుగవలసియుండఁగా వానికి శివుని సరూపముక్తియే గలిగి నట్లు కాశీసారమునందు మీయాచార్యులవారు చెప్పియుండుటచే వారాయుపనిషత్తును ప్రమాణముగా నంగీకరింపలేదని వ్యక్తమగు చున్నది. గావున నది ప్రమాణముగాదని యారాధ్యులవారి యభి ప్రాయము.

అన్నం—ఈయుపనిషత్తు ప్రమాణముగానిచో నారాధ్యుల వారు పంచరుద్రములు పంచ జాబాలములు మున్నగువానినిఁ బ్రమా ణముగా నెట్లు సాధించుకొనఁ గలరు?

ప్రతి—ఆరాధ్యులవారూ! వినుచున్నారా?

పండి—వినుచునేయున్నాఁడ. పంచరుద్రాదులకుఁ గడమయుప నిషత్తులకుఁ బోటి గలదా?

అన్నం—ఏమి యాతారతమ్యము?

పండి—మేము పంచరుద్రాదులను గైకొనకున్నను దశోపనిష త్తులలో నీశ్వరుని పారమ్యమును గనఁబఱతుము. మీరు వానిలో రామపారమ్యమును జూపగలరా? ఆదశోపనిషత్తులను దీసికొనకయు మూలవేదములలోన మహేశ్వరుని మహాత్వమును ప్రదర్శింతుము. మీరు వానిలో శ్రీరాముని మహాత్వమును జూపగలరా? ఇట్లు మూల శ్రుతులు మున్నగుచోట్ల సుప్రసిద్ధమగు నీశ్వరపారమ్య సిద్ధాంతమును దెల్పునవి గాన పంచరుద్రాదులు పరమప్రమాణములగు ననుట నిర్వివాదము.

ప్రతి—భట్టాచార్యులవారూ! నేటికిచర్చముగింతమా!

అన్నం—ఆరాధ్యులవారి సిద్ధాంతమును సాంతముసేయకయె నేటికిఁ జర్చ ముగింతునా?

ప్రతి—అది యెట్లుసేయుదురు!

అన్నం—శివునికన్న రామచంద్రుఁడధికుఁడని నిర్విచారముగా సాధింప బ్రహ్మాస్త్రమొక్కటి యుంచియేయున్నది.

ప్రతి—అట్లైని నద్దానిం డాపనేల? త్వరితముగఁ బ్రయోగిం పుడు. ఆరాధ్యులవారూ! అవధానముతో నుండుడు.

అన్నం—ఆరాధ్యులవారూ! అనందరామాయణము జూచి యుంటిరా?

పండి—దానియం దేమని యున్నది!

అన్నం—మీ శైవసిద్ధాంతము దీనితో సాంతమని యున్నది,

పండి—అది యెట్లో వివరముగా దెలుపుడు.

అన్నం—ఆనందరామాయణము రాజ్యకాండయందు నిట్లు కలదు. 'ఒకనాడు పార్వతీదేవి పరమేశ్వరునుద్దేశించి దేవా! బ్రహ్మహత్యాది దోషంబులకు పరిహారకంబగు నుపాయంబు నుపదేశింపుమని వేడిన నద్దేవుండు నగపుత్రికవలోకించి దేవీ! ఈయర్థంబున వినాయక సనత్కుమార సంవాదంబను నితిహాసం బుదాహరణంబగుగాన నద్దాని నెఱిగింతు నాకర్ణింపుము. ఒకప్పుడు సనత్కుమారుండు వినాయకు దర్శించి మ్రొక్కి గణనాయకా! బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తంబు దెలిపి యనుగ్రహింపుమని ప్రార్థింప నతం డమ్మునీంద్రుని సాదరదృష్టింజూచి మునికులతిలకా! ఏను తొల్లి చిరకాల మనుష్ఠించిన సత్కర్మము నిపుడు స్మరింపఁజేసితివి. ఏమి నీ బుద్ధివైభవము? పూర్వకాలంబున నేను పర్వతాకారంబగు గజాకృతిం దాల్చి వనముల నిర్మూలీకరించుచుఁ బెక్కండ్రు మునివర్యుల మడియఁ జేసితి. అంత నమ్మహర్షుల హా హా కారంబుల కోలాహలంబుతో ననంతంబులగు బ్రహ్మహత్యలు ననుం గూలద్రోసెను. అప్పుడేను తెలివిదప్పి పెక్కుకాలము నేలంబడియుంటిని. అంత నాతండ్రియగు మహేశ్వరుడు పర్వ జగన్నాథుండగు శ్రీరామ పరబ్రహ్మమును గుఱించి బహుకాలము తప మాచరింప నమ్మహాదేవునకు శ్రీరామచంద్రుండు సాక్షాత్కార మొసఁగి నీతపంబునకు మెచ్చితి, వరంబడుగుము. దుర్లభంబైన నిచ్చెదనని యనుగ్రహింప నీశ్వరుండు శ్రీరామచంద్ర పరబ్రహ్మమా! పార్వతీపుత్త్రుండగు గణనాయకుం డనంత బ్రహ్మహత్యాదోష దూషితుండై నిశ్చేతనుండై యున్నవాఁడు. నాయందు నీకు దయగల దేని వానిం బాపవిముక్తుం జేసి కాపాడుము. అని ప్రార్థింప శ్రీరామచంద్రుం డట్లయని యనుగ్రహించి సకరుణ కటాక్షవీక్షణంబు నాపైఁ బఱుప నప్పుడు నేను తెలివినొంది యమ్మహాత్ముని బహుభంగులఁ బొగడితి. అంత శ్రీరామచంద్రుండు బ్రహ్మహత్యా సహస్రంబుల నేని దొలంగఁజేయఁజాలు రామ సహస్రనామ స్తవంబు నాకు నుప

దేశించెను. ఆస్తవంబు మహిమంబున నేను సకలపాప విముక్తుం డనై దేవపూజ్యుండనైతినని గణనాథుం డాస్తవరాజంబును సనత్కుమారునకు నుపదేశించెను. అంత నమ్మునీంద్రుండు రామ సహస్రనామస్తవ జపంబున ధన్యుండయ్యెనని మహేశ్వరుండు వచింప శర్వాణి యాకర్ణించి దేవా! అట్లేని నాస్తవరాజమును నాకును నుపదేశింపుమని ప్రార్థించెను. అప్పు డమ్మహాదేవుండు గిరివరకుమారికి రామసహస్రనామ స్తవము నువదేశించినట్లు చెప్పఁబడియున్నది.

దీనింబట్టి శ్రీరాముఁడు శివునికన్న నధికుడని స్పష్టమగుట లేదా; చూతము దీనికేమి చెప్పెదురో చెప్పుడు.

ప్రతి—(తనలో) అడిగినను నిట్టిసంగతి యడుగవలయు, ఆరాధ్యులవారి సిద్ధాంతమిప్పు డెట్లగునో కనిపెట్టవలసియున్నది. ఆరాధ్యులవారూ! ఆలస్యము దేనికి?

పండి—ఇట్టి యల్పశంకల కన్నిటికిని దగిన సదుత్తరమును వెనుకటి యాహ్నికమునందే దెలిపియుంటిని.

అన్నం—అప్పుడేమని చెప్పితిరో ఇప్పుడు తిరుగ నొక్కమారు చెప్పుడు,

పండి—ఈమున్నగు కల్పనాకథలన్నియు శ్రీరాముని దేవునిగా సాధింపఁ బూనిన కొందఱు మాయావాదులచే కల్పితములు గాన నిట్టివి విమర్శన సహములుగావని చెప్పియుంటిని.

అన్నం—మీరు కుదరనివన్నియు గల్పితములని మీరన్నంత మాత్రమున నవి కల్పితములగునా? కల్పితములైనచో ఏకాలమునఁ గల్పితములో? ఎవ్వరిచేఁగల్పితములో? ఋజువుచేయ వలసిన భారము మీమీదనే యున్నది?

పండి—వేదవ్యాసమహర్షి పురాణములను విభజించునాటికి శ్రీరాముని దేవునిగా దెలుపునుపనిషత్తులు గాని శ్రీమద్రామాయ

ణము కన్న నితరములగు రామాయణములుగాని లేనట్లు వ్యక్త మగు చున్నది.

అన్నం— దేనినిబట్టి?

పండి— వ్యాసమహర్షి పురాణములలో గొన్నిటిని శివపార మ్యము దెలుపు వానినిగాను, మఱిగొన్నిటిని నారాయణాది దేవతాం తరపారమ్యమును దెలుపువానినిగాను సంగ్రహించెనుగాని యొక్క దాని నైన శ్రీరామ పారమ్యమును వివరించు పురాణమును నుడివి యుండెనా? లేదు. దీనింబట్టి పురాణరచనాకాలము నాటికి శ్రీరామ పారమ్యప్రతిపాదకములగు నుపనిషదాదులు లేవని స్పష్టమగుచున్నది.

అన్నం— ఇవికల్పితములనుటకు నింకనేదేని నిదర్శనముగలదా?

పండి— వలయుచో నెన్నేనిఁగలవు. ఇంకొక్కటివినుడు. పూర్వ కాలమున, శైవంచ వైష్ణవంశాక్తం సౌరం వైనాయకంతథా। స్కాం దంచ భక్తిమార్గస్యదర్శనాని షడేవహి॥ అనువచనమును బట్టిశైవము వైష్ణవము, శాక్తము, సౌరము, గాణాపతము, కౌమారము నని యాఱుమతములు వాడుకలోనున్నట్లు తెలియుచున్నది.

దీనింబట్టి గణపతి, స్కంద, లలితాద్యుపనిషత్తులు నానాటికి నుండియున్నట్లు విశదమగుచున్నది. దానింబట్టి శైవాదిషణ్మతముల కంటెను నితరమగు రామమతముగాని అద్దానిం బ్రతిపాదించు రామరహ స్యాద్యుపనిషత్తులు మున్నగునవి గాని లేవని తెల్లమగు చున్నది.

అన్నం— అవి కల్పితములనుటకు ప్రబలహేతువేమి?

పండి— ఇవుడు చెప్పినవి దుర్బలహేతువులా?

అన్నం— దీనిచేఁ గల్పితములనుట యెట్లు?

పండి : పురాణవిభజనకాలమునకుగాని, షణ్మతప్రచారకాలము నకుగాని యేర్పడనివి నేడు గన్పట్టుచున్నవిగదా? దీనింబట్టి యియ్యవి యీనడుమ గల్పింపంబడియెనని తెలియుటలేదా?

అన్నం—కల్పితములనుటయే నిర్వివాదముగాదు. ఒకవేళ నివి కల్పితములని యొప్పుకున్నను కల్పితము లెన్నిలేవు? అవి యప్రమాణములన నెట్లుచెల్లును?

పండి—శ్రుత్యాది విరోధమునుబట్టి ప్రమాణముగానేరవు.

అన్నం—ఆశ్రుత్యాది విరోధ మెట్టిదో తెలుపుడు.

పండి—శ్రు॥ విశ్వాధికో రుద్రోమహర్షిః॥ మహర్షియనఁగా సకల వేదద్రష్టయగు రుద్రుఁడు విశ్వాధికుఁడని వేదము నిర్ణయించుచుండగా నీరుద్రునికన్న రాముఁడధికుఁడని చెప్పు నితరవచనములు శ్రుతివిరుద్ధము లెట్లుగావు! శ్రుతివిరుద్ధములు ప్రమాణము లెట్లగును? ఇదిగాక, ఋగ్వేదమునందు॥ త్ర్యంబకం యజామహే॥ అను మంత్రమునకు వ్యాఖ్యానముచేయునపుడు వేదభాష్యమునందు సాయనాచార్యులవారు॥ త్రయాణాం బ్రహ్మవిష్ణురుద్రాణాం, అంబకం పితరం యజామహే ఇతి వసిష్ఠోబ్రవీతి॥ బ్రహ్మ విష్ణు రుద్రులు మువ్వురకు తండ్రియగు శివుని పూజించుచున్నామని వసిష్ఠుఁడు చెప్పుచున్నాఁడని వ్రాసిరి. ఇట్లు మూలవేదమగు ఋగ్వేదమునందు శివుఁడు బ్రహ్మవిష్ణు రుద్రులకు జనకుఁడని తెలుపఁబడుటచే సర్వకారణత్వసహజముగు సర్వేశ్వరత్వము గలవాఁడని స్పష్టముగాఁ గన్పట్టుచుండగా ఆపరమేశ్వరుఁడు రామమంత్రమును జపముసేసెనని వచించు కల్పనాకథ లెట్లు శ్రుతికి విరుద్ధములుగావు? అదియుండుగాక, రాముఁడన నెవ్వరు?

అన్నం—పరదేవత.

పండి—దేవతలలో రామ అను పేరుగలవా రున్నట్టు లెచటఁ జెప్పఁబడియున్నది?

అన్నం—దేవతలకన్న నతీతుఁడగువానిపేరు దేవతలలో నెట్లుండును?

పండి—అతీతులలోనైన నా పేరుండవలయునుగదా?

అన్నం—అతీతుఁడనగా పరబ్రహ్మము. ఆతత్త్వమే శ్రీరాముఁడు.

పండి—మీమతమునందు పరబ్రహ్మమునకు పేరుగలదా?

అన్నం—నిర్గుణ పరబ్రహ్మమునకు పేరులేకుంట నిజమేకాని సగుణపరబ్రహ్మమునకు పేరులేకేమి?

పండి—మీమతమునందు సగుణతత్త్వమును పరబ్రహ్మమని వ్యవహరింతురా?

అన్నం—మా యాచార్యులవారు సగుణతత్త్వమును అవర బ్రహ్మమని చెప్పియుండిరి.

పండి—మీరు శ్రీరాముని పరబ్రహ్మమందురా? లేక అవర బ్రహ్మమేయని యొప్పుకొందురా?

అన్నం—అవరబ్రహ్మమే యగుగాక! పరబ్రహ్మమన్నను నవర బ్రహ్మమన్నను రెండునొక్కటేగాని యిన్నిబ్రహ్మము లెచ్చటనున్నవి?

పండి—రాముఁడే బ్రహ్మమైన నగుగాక యాయనను నిర్గుణ తత్త్వమని యొప్పుకుందురా?

అన్నం—రాముఁడు నిర్గుణతత్త్వమె యనిన బాధకమేమి?

పండి—నిర్గుణతత్త్వమేయగునేని నద్దానికి రాముడను పేరెట్లు సముచిత మగును?

అన్నం—అట్లేని సగుణతత్త్వమేయని యెన్నుదు.

పండి—మే మెట్లైన నెన్నుదుముగాక! మీాచార్యులవారు బ్రహ్మము నిర్గుణముగాన శివ విష్ణ్వాదులు పరబ్రహ్మతత్త్వములు గారని చెప్పి శైవవైష్ణవాది మతములను నిరాకరించి యున్నారా లేదా?

అన్నం—అగును నిజమే.

పండి— శైవవైష్ణవాదులు సగుణవాదులని వారిమతములు ఖండించి మీరుతిరుగా రామనామకమగు సగుణతత్త్వము నింకొకదానిని పరిగ్రహించునెడ శైవవైష్ణవాదులకన్న నేమివిశేషముసాధించినట్లగును?

అన్నం—రామమతమునందు నధికవిశేషము లేకపోవుగాక ఈమతము శైవవైష్ణవాదులతో సమానమేల కాకుండును?

పండి— శైవులు త్రిమూర్తులకును గారణమైన శివుని నుపాస్యునిగా నంగీకరించి యుండిరి. వైష్ణవులన్ననో త్రిమూర్తులలో జేరిన విష్ణుమూర్తిని పరదేవునిగా నంగీకరించిరి. అట్లుండ రామమతము వారు దేవతలలోనె చేరనివాఁడును, దశరథ పుత్రుఁడునునగు జానకీజానిని పరతత్త్వముగా నంగీకరించిరి. ఇఁక రామమతము శైవవైష్ణవాదులతో సమానమెట్లగును?

అన్నం—రామమతమువారు దశరథపుత్రుడగుఁ శ్రీరామునినే దేవునిగా నంగీకరించిరనుట కేవలాజ్ఞాన కృతము.

పండి—అట్లుగాదనుట పరమాజ్ఞాన కృతము.

అన్నం రాముడు దేవతలలో జేరఁడని మీరు దేనినిబట్టి చెప్పఁగలరు?

పండి—దేవతలలో రాముఁడని యొకదేవతయున్నట్లు మీరు దేనినిబట్టి దెలుపఁగలరు?

అన్నం—అట్లెందును లేదా?

పండి—త్రిమూర్తులు, అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టదిక్పాలురు మున్నగు దేవతల పేరులు శ్రుతి స్మృతి పురాణాదులయందు వివరింపఁబడి యున్నవి. అట్టిచోట్ల రాముఁడని యొకదేవత యున్నట్టు లెందేని గలదా?

మఱియు, రాముఁడు దేవతాకోటిలోఁ జేరియుండునెడ బ్రహ్మ విష్ణ్వాదులకువలె నాయన లోక మెటనున్నదో ఆవివరము దేని యందు గలదో తెలుపవలయును.

అన్నం—ఉపాసకులు శ్రీరాముని దశరథపుత్త్రుఁడని యుపాసించుచున్నారా?

పండి—ఇంకేమని?

అన్నం—పరదైవతమని.

పండి—వారు దశరథ పుత్త్రుఁడే పరదైవతమని యుపాసించుచున్నారు.

అన్నం—శ్రీరాముఁడు దశరథపుత్త్రుఁడేయని యెవరుభావించిరి?

పండి—రామభక్తులే!

అన్నం—అట్లనుటకు నేమి నిదర్శనము కలదు?

పండి—రామదాసు త్యాగరాజు మున్నగువారు రామ భక్తులు గారా?

అన్నం—వారు శ్రీరాముఁడు దశరథపుత్రుఁడని యెట నుడివియుండిరి?

పండి——రామదాసు దాశరథి శతకము గావించియుండ లేదా? దాశరథియనిన దశరథపుత్రుఁడని గాక యింకేమని యర్థము?
త్యాగరాజు ఇనకులతిలకా! అనియు, రఘుకులాంబుధిసోమ అనియు మొదలుగాఁ బేర్కొనియుండలేదా? దీనింబట్టి రామభక్తులు దశరథపుత్త్రునినే పరదైవతమని భావించినట్లు తెలియుటలేదా?

అన్నం—ఎట్లయిననగుగాక. రామభక్తులు తరించిరా? లేదా?

పండి—మీరు శివభక్తులు, విష్ణుభక్తులు తరింపలేదని చెప్పఁ గలరా?

అన్నం—శివభక్తులు మున్నగువారు తరింపలేదని మేమెం దైనఁ జెప్పియుంటిమా?

పండి—శివభక్తులు మున్నగువారు తరించుచున్నప్పుడు తిరుగా రామమతమును విశ్వామిత్ర సాంప్రదాయికము దేనికి?

అన్నం—మీరు రాముఁడన దశరథపుత్త్రుఁడేగాని యాపేరుగల దేవతయున్నట్లు ఎందును లేదంటిరి. అట్టియెడ రామభక్తులు తరించుట యెట్లుసంభవించును?

పండి—శ్రీరాముఁడు దశరథపుత్త్రుఁడైనను శ్లో॥ యోయోయాం యాంతనుంభక్త శ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి॥ తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహం॥ అను గీతావచనమును బట్టి సర్వరూపుఁడగు పరమేశ్వరుఁడు ఏ యే తనువులయందు భక్తిగలవారలకు నాయా రూపముననే సాక్షాత్కరించి వారిననుగ్రహించుగాన రామభక్తులును నుత్తమగతి నొందుటకు సందియము లేదు.

అన్నం—అట్లని శివమతము, రామమతము నీరెండు సమానములే గదా?

పండి—అట్లెన్నటికి గానేరవు.

అన్నం—ఏమికారణమున?

పండి—శివమతమువారు కేవలము పరమేశ్వరుని నుపాసించుచున్నారు. వైష్ణవులు శివశక్త్యంశమగు నారాయణు నుపాసించుచున్నారు. రామభక్తులన్నో నారాయణు నంశమగు శ్రీరాము నుపాసించుచున్నారు.

మహాదేవుఁడగు శివునుపాసించువారికిని, మహాపురుషుఁడగు నారాయణు నుపాసించువారికిని, మహాపురుషునవతారవిశేష మగు శ్రీరామునుపాసించు వారికిని సామ్యమెట్లుండును!

అన్నం—అదియుండుగాక. ఆనంద రామాయణమున శివుఁడు పార్వతీదేవికి సనత్కుమార విఘ్నేశ్వర సంవాదము నుపదేశించుచు రామనామ సహస్రము నుపదేశించినదానికి మీరేమిచెప్పెదరు?

పండి—ఆనందరామాయణ గ్రంథకర్త రామానందమునం బరవశుఁడై జగమునే గాక తన్నుగూడ మఱచెనని చెప్పెదము.

అన్నం—దేనినిబట్టి?

పండి—విఘ్నేశ్వరుఁడు లెక్కలేని బ్రహ్మహత్యలు సేసితన్మూలములగు మహాపాపములవలన బహుకాలము ఓడలెఱుంగక పడియుండెననియు, అంత నధికకాలము శివుఁడు శ్రీరామునుద్దేశించి ఘోరతపమ్ముం గావించెననియు, పదంపడి శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించి శివునకు రామసహస్ర నామము ననుగ్రహింప తన్మూలమున విఘ్నేశ్వరుఁడు అనంత బ్రహ్మహత్యాదోషవినిర్ముక్తుఁ డయ్యెననియు, కదా సనత్కుమార విఘ్నేశ్వర సంవాదము దగు సారాంశము?

పార్వతీదేవికి విఘ్నేశ్వరుఁడు మున్నగువారికినిఁ బరస్పరము బాంధవముగలదా? లేదా?

పార్వతీదేవికి తనకుమారుఁడగు విఘ్నేశ్వరుఁడు బ్రహ్మహత్యలు చేసినది తెలియకున్నను ఆతఁడనంతకాలము మైమఱచి నేలం గూలియున్న వార్తయైన నెట్లుతెలియదయ్యెనో?

శివుఁడు శ్రీరామచంద్రుదనుద్దేశించి పెక్కుకాలము తపముచేసిన యుదంతము తనయర్థాంగి కెట్లు తెలియకుండెనో? ఇదియంతయు నద్దేవికి దెలిసియున్నచో నీచరిత్రమాదేవికి నప్పుడేల యుపదేశింపవలసి వచ్చెనో? దీనికి దగిన సదుత్తరము దెలుపవలసిన బాధ్యత యాగ్రంథకర్తయందుగాని ఆగ్రంథమును ప్రమాణముగా నంగీకరించిన వారియందుగాని నిలిచియున్నది.

అద్దానికిఁ బార్వతీదేవికి బాహ్యజ్ఞానము లేదనియో, ఆకాలమున నాదేవి యేదోకలోకాంతరమున కేగియున్నదనియో? వచించుటకన్న సమాధానము ఇంకొకటి సంభవింపదు. ఇట్లు ఆనందరామాయణగ్రంథములోని కథా సందర్భగత దోష పరిహారమునకై పార్వతీదేవికి బాహ్యజ్ఞానము లేదని మున్నుగా సంగీకరించుటకన్న నాగ్రంథకర్తకే ప్రపంచజ్ఞానమో దేహజ్ఞానమో లేదని యంగీకరించుట యుచితమని తోఁచెడిని.

అన్నం—రామరహస్యము, రామోత్తరతాపిని, ఆనందరామాయణము నీమున్నగు వానియందు శివుఁడు రామమంత్రమును జపించినట్లు చెప్పఁబడియుండుటచే శివునికన్న శ్రీరాముఁడధికుఁడని యేర్పడుట లేదా?

పండి—దానిఁబట్టి శివుఁడే సర్వాధికుఁడని యేర్పడుచున్నది.

అన్నం—అదియెట్లు?

పండి—ఇదివరకుఁ జేసిన విమర్శముంబట్టి శ్రీరాముఁడన దశరథపుత్త్రుఁడని యేర్పడియెను గదా? అట్టి రామచంద్రునకు సర్వాధిక్యమును సాధింపనెంచి కొందఱు సకలప్రమాణములచే సర్వాధికుఁడుగా నేర్పడియున్న శివుఁడే రామమంత్రమును జపించెనని చెప్పినంగాని యాయనఘునకు సర్వాధిక్యము చేకూడదని యెంచి కొన్నినిబంధములయందట్లు నిబంధించియుండిరి. ఆనాటికిగల ప్రమాణవచనంబులం బట్టి శివుఁడే సర్వాధికుఁడని లేకున్నచో వారట్లు నిబంధించియుండరు. దీనింబట్టి వారట్లు నిబంధించిన కారణంబునను మహాదేవుఁడే విశ్వాధికుఁడని వ్యక్తమగుచున్నది.

అన్నం— శివుఁడే సర్వాధికుఁడగుచో నాదేవుఁడు శ్రీరామచంద్రుని స్తోత్రముసేయుట మున్నుగా నెట్లు సంభవించును?

పండి — స్తోత్రాదులు చేసినట్లు వీరు గ్రంథమునఁ జేర్చుటయు గాని యట్లుసేయుటయు యసంభవము. ఒకప్పుడు పుడమిఱేఁడు సేవకునిగూడ నారునికన్నగల గుణవిశేషముంబట్టి మెచ్చుకొనుట గలదు? అంత్రమాత్రమున నాతనియందు నభిమానముగలవారు లేదు స్తుతించెననియె వాడుకొనుటయు సంభవించును. ఆకారణమున సేవకుఁడు ఱేనికన్న నధికుఁడని యెన్నుట యజ్ఞానకృతమయగు.

అన్నం — ఈశ్వరుఁడు శ్రీరామ మంత్రము జపించెననియు, నామంత్రమును పార్వతీ దేవికిగూడ నుప దేశించెననియు నిబంధించినవారి యాశయ మేమి?

పండి — ఇట్టివి స్తుతివచనములుగాన వీనికి స్వార్థమునందుఁ దాత్పర్యలేశంబును లేదు. వీనింబట్టి రామమంత్రము ప్రశస్తమనియె యేర్పడును.

ఇదిగాక, పరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడుగానను, శ్రు॥ ఈశానస్సర్వ విద్యానాం॥ అను శ్రుతినింబట్టి సర్వవిద్యాధినాథుండుగానునద్దేవునకు రామమంత్రంబును దెలిసియున్నదనుట లేనిదిగాదు. అట్లే సకలవిద్యలను పార్వతీ పరమేశ్వర సంవాదరూపమున జగమున వెలయుటం జేసి పరమేశ్వరుఁడు పార్వతీదేవికి నీమంత్రంబు దెలిపెననుటయు విరుద్ధంబుగానేరదు. ఇంతమాత్రమున నామంత్రమును శివుఁడు తాను తరించుటకు జపించెననిగాని, పార్వతీదేవిని తరింపఁజేయుటకై యద్దేవికి నుపదేశించెననిగాని భావించుట యవివేకమూలమేయగు. ఏలన, సకలవ్రతంబులును పరమేశ్వరుఁడు పార్వతీ దేవికే యుపదేశించెనని యున్నది. అవియన్నియు లోకానుగ్రహమునకై యట్లు లుపదేశింపఁ బడియెగాని స్వార్థమై యుపదేశింపఁబడినవి కావుగదా? అట్లేయిదియునగు. అట్లుగాక, పార్వతీదేవి తానుపదేశమునొందిన రామనామ సహస్రముస్వార్థమేయగునెడ, అమ్మెబ్రహ్మహత్యలనెన్నిటినెక్కడఁజేసియుండెనో? అదిగాక మీయాచార్యులవారు

శ్లో॥ కోటయో బ్రహ్మహత్యానా మగమ్యాగమ కోటయః। సద్యః ప్రళయమాయాంతి మహాదేవేతి కీర్తనాత్॥ మహాదేవాయని పలుకగనే కోట్లకొలది బ్రహ్మహత్యలప్పుడే నశించిపోవునని యేల చెప్పవలసివచ్చెనో సమాధానము చెప్పవలసిన బాధ్యత మీయందనిలిచియుండును.

అన్నం—శ్రీరాముఁడు శివునికన్న నధికుఁడనుటనిస్సంశయము.

ప్రతి—తగినంత కారణము సెప్పక యట్లుతలంచినంతన లోకు లంగీకరింతురా? అధికుఁడనుటకుఁ దగిన కారణమున్నచో దెలుపుడు. లేనిచో విరమింపుడు.

అన్నం—లేకేమి? వినుడు. ఆరాధ్యులవారూ! శ్రీరాముఁడు శివకేశవుల యిద్దఱి యవతారమని వసిష్ఠాది సంహితలలో గలదు. దానింబట్టి యీయవతారమూర్తి యాయిద్దఱికన్న నధికుఁడయ్యెను. దాననే శివుఁడు రామమంత్రము జపించుట సంభవించెను.

పండి—శ్రీరాముఁడు శివకేశవుల యిద్దఱి యవతారమనుట యిద్దఱను నేకము సేయఁబూనిన మహానుభావులచేఁ గల్పితమనియు, కొన్ని రామావతారములు శివునివిగాను, మఱికొన్ని నారాయణునివిగాను, ఇంకఁగొన్నిశక్తివిగాను మాత్రమే ప్రామాణికగ్రంథముల యందు గలదనియుఁ జెప్పియుంటిని. అదియుండుగాక, శ్రీరాముఁడు శివకేశవుల యిద్దఱి యవతారముగాన నాయిర్వురకంటెను నధికుఁడనియే గదా? మీయభిప్రాయము. అట్లయినచో నారాయణుడు శ్రీరామమంత్రమును జపించినట్లెందైనఁ గలదా?

అన్నం—నేను చూడలేదు.

పండి—దీనింబట్టి శ్రీరాముఁడు నారాయణు నవతారమే యని యాగ్రంథకర్తలకు నభిప్రాయమున్నట్లు తెలియుటలేదా? ఇద్దఱి

యవతారమే యయినచో శివునివోలె కేశవుండును తరింపనెంచి రామ మంత్రము నేల జపింపఁడయ్యెను?

అదియుండుగాక, శివుఁడు రామమంత్రమును జపించెనని పలుకు చున్నారుగదా? అట్లైన శివునకు రామమంత్రము నుపదేశించిన వారెవరు?

అన్నం—రాముఁడే.

పండి—ఎప్పుడుపదేశించెను?

అన్నం—ఎప్పుడన నర్థమేమి?

పండి—రాముఁడు పుట్టిన తరువాతనా? అంతకుముందా?

అన్నం—మీావన్నియు వికటప్రశ్నములు,

పండి—మీాసిద్ధాంతమును బట్టి ప్రశ్నము లట్టివయ్యెను.

అన్నం—రాముఁడు పుట్టనే లేదు.

పండి—శ్రీరాముఁడు పుట్టకయె దశరథునింటికి యెందుండి వచ్చెను?

అన్నం—దశరథునింటఁ బుట్టెననుట భ్రాంతియే.

పండి—నిజమేమి?

అన్నం—శ్రీరామచంద్రుఁడు దశరథునింట నవతరించెను.

పండి—అట్లవతరించుటకు ముందా వెనుకనా? యుపదేశించి నది తెలుపుము.

అన్నం—ముందేయేల యుపదేశింపఁ గూడదు

పండి—అవతరించుటకుముం దేరూపములో నుపదేశించెను?

అన్నం—శ్రీరామరూపములోనే

పండి—దశరథునింట నవతరించుటకు ముందే శ్రీరామరూప మున్నదా?

అన్నం — లే కేమి! ... ద్యః

పండి — శ్రీరాముఁడట్లుండి యున్నచో నాయన ... ముని పలు
రాక తిరుగా కౌసల్యాగర్భమునుండి జన్మింపనేల! ... చెప్పి నిలిచి

అన్నం — శ్రీరాముఁడు దశరథునింట నవతరించిన తరు...
శివునకు రామమంత్రము నుపదేశించెనని యేల యంగీకరింపఁగూ...

పండి — అట్లేని శ్రీరాముఁడవతరించు దనుక శివు డే... ము.
మును జపించుచుండెను? ... కేవ లోదు

ఇదిగాక, శ్రీరామమూర్తి హరియవతారమనిగాని ... దెలువుదు.
యవతారమనిగాని యంగీకరింపక తీరదుగదా? ఎట్లైనను
మూర్తికి మూలమూర్తికన్న నాధిక్యము నిర్మూలమేయగున్ రాముఁడు
రామమూర్తి హరిహరులకన్న నధికుఁడనుట యనుచితము. ... గలుదు.
మహాకవిని వాగ్దేవి సమవతారమని కొందఱుభావింతురు. ... డమ్యేను.
మున నతఁడు వాగ్దేవికన్న నధికుఁడనఁ జెల్లునా?

కావున శ్రీరామునకు సర్వాధిక్యమును సాధింపఁబూ...గారమనుట
...ములన్నియు తద్భక్తులకు నామూర్తియందు స్థిరభావమును ...మనియు,
...నెంచుటయందే తాత్పర్యము గలవిగాని శ్రుతిస్మృత్యాది ...నివి
పరమేశ్వర పారమ్యమును నిరసించుటయందు దాత్పర్యము గ...థముల
నేరవు. ఇకవాని కిట్టివిపరీతతాత్పర్యము సాధింపనెంచునెడ శ్రుతిస్మృ...డు
పురాణేతిహాసవిరోధమువలన వనవహ్నినెదిరించిన మిడుతలవో...
వానికే యప్రామాణ్యరూపమగు స్వరూపనాశము సంభవింపకమా...డు
దనుట సిద్ధము.

అందఱు లేచివెళ్లిరి.

సప్తమాహ్నికము ముగిసెను.

